శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

శంకరకవి ప్రణీతము.



ప్రచురకు:

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్ సెల్లర్, రాజమండ్రి.



కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

కాకినాడ.

1930.

వెల 1—0—0

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.



## పీఠిక.



వాణీవరవాసవాదివిబుధశ్రేణీశిరోరత్నశో-
భావిభ్రాజితపాదపంకజుఁడు మాభామామనోభర్త కా
శీవిశ్వేశ్వరుఁ డిందుశేఖరుఁడు రక్షించు న్మహాపార వి
ద్యావద్ధిష్ణుని బాచయప్రభుని యెల్లామాత్యచూడామణిన్.

చ. జలనిధికన్య కౌ్రిమ్మొఱుఁగు సంతతకౌస్తుభవైజయంతికా
విలసితకాంతి వాసవునివిల్లు కృపాంబుధారవృష్టి గా
వెలయ వహించుచుం బొదలుకృష్ణపయోదము శ్రీదిసేయు న
త్ఫలితవిభూతులం బెనఁగ బాచయయెల్లనికీర్తిసస్యముల్.

శా. నీరేజప్రభవుండు వాక్పతి జగన్నిర్మాణదక్షుండు జం
భారాతిప్రముఖామరార్చితుఁడు వేదార్థప్రబోధక్రియా
పారీణుండు విరించి దానజితదేవక్ష్మాజుహుండైన యీ
యూరెల్లక్షితిపాలమంత్రిని జిరాయుష్మంతునిం జేయుతన్.

ఉ. అల్లదె మాతులుంగఫలమ్మును నవోదయభానుమండలం
బల్లనఁ జూపుచుం బృథులహస్తమునం గబళింపఁ గోరువా
గ్వల్లభముఖ్యదేవగణవంద్యపదాబ్జుఁడు కుంజరాననుం
డెల్లనమంత్రిశేఖరున కీప్సితసిద్ధికరుండు గావుతన్. 4

మ. కరపద్మంబులఁ బుస్తకంబు శుకముం గంజాతము న్వీణయుం
గర మొప్పం బ్రియమందంబుతో నుపనిషద్గంగాపథశ్రేణి వా
సగథం బెక్కి చరించు చంద్రముఖి భాషాదేవి సన్మానఁ జే
యు రతీశప్రతిమానరూపనిధి నీయెల్లనామాత్యునిన్. 5

ఉ. నల్లనివేల్పుఁబోఁటి గహినాథుని కూరిమితల్లి యామినీ
వల్లభుతోడఁబుట్టువు శివాననరాస్యవధూవయస్య యు
త్ఫుల్లసరోజహస్తములఁ బొల్పెసఁగ న్విహరించులక్ష్మి మ
మ్మెల్లనమంత్రిశేఖరునియింట వసించు మనోహరాకృతిన్. 6

ఉ. చేటికలేవధూటికి శచీముఖసన్నుతసన్నభామినీ
కోటులు పద్మ మేకుటిలకుంతల కీశ్వరుమేను పుష్పమే
పాటలగంధికిం జికురభారమునైసురాట్కిరీటగ మా
జోటి భవాని చాలఁ గృపఁజూచును బాపయయెల్లధీమణిన్. 7

తే. అర్కహిమధామభౌమ సౌమ్యగురు శుక్రతోయమజాఖ్యపదరాహుకేతుగ్రహంబు
లెలమి నేకాదశస్థానఫలము లిత్తురెప్పుడు నీసూరియెల్లయమంత్రీశ్వరునకు. 8

వ. అని యిష్టదేవతాప్రార్థనాపూర్వకంబుగాఁ గృతీశ్వరున కాశీర్వచనంబులొసంగి. 9

తే. సరవి దీపింప నామ్నాయసరణిఁ దఱిసి, పాలునీరును బోలె సస్సారవిదనట్టి
యనఘతరమూర్తి గీర్వాణవచనరిక్షు, బాదరాయణమౌనిసంయమిఁ బ్రస్తుతింతు. 10

శా. తారానాథమరీచికాభయ కృతో ద్యన్మాద్గంగత్వయః
పారావారవినిర్మలోర్మి పటలీపర్యాయవాఙ్నిర్మిత
శ్రీరామాయణకావ్యసృష్టి కవితాసిద్ధాంతశుద్ధాంత వి
ద్యారాశి న్ఘను వామలూరుభవుఁ జేతఃప్రీతి వర్ణించెదన్.

క. ధీరుల బాణమయూరుల, భారవులై వెలయుమాఘుభోగవుల సుధా
ధారాపాణింధమకవి, తారచనావాసుఁ గాళిదాసుఁ దలంతున్. 12

క. విమలకవిత్రయనిర్మితి, సమధికరతసత్ప్రబంధసాహిత్యకళా
సుమనస్తటినీకల్లోలములం గ్రీడింతు నిష్కళంకప్రతిభన్. 13

ఉ. పైకొనుకాంతుచేఁ దగిలి పల్కులు భీకరలోభిగేహవ
ల్మీకములందుఁ బాయనియమేయమదోద్ధతదుష్కవీంద్ర ద
ర్వీకరరాజికి న్వివిధవిశ్రుతకావ్యకళావిశేషది
త్పాకుళలార్యతంత్రములు గారుడమంత్రము తుందు నాగయన్. 14

చ. వడియును బ్రాసము న్వదమువాఁడు ప్రబంధము పూని యేమి చె
ప్పెడి నగుఁబాటుగు న్సుకవిబృందముముందట మాటలాడు వెం
బడి నవి తమ్ముఁ దామె సులభస్థితితో నుచితస్థలంబులన్
బడిబడి వచ్చి నిల్చి బహుభంగులఁ దోఁచవలెఁ జూపకుండినన్. 15

వ. అని సకలసుకవిజననమస్కారంబును గుకవినికరతిరస్కారంబును గావించి యేనొక్క నవీనప్రబంధం బనుసంధింపం బూనుసమయంబున.

సీ. తనయశోమహిమ గంధర్వభామాహస్త, వల్లకీసంగీతవర్ణనంబు
తనవదాన్యత యర్థిజనమనోరథదాన, పారీణగీర్వాణపాదపంబు
తనవిలాసంబు దంతావళీగామినీ, దృక్చకోరకనిశాధిపమరీచి
తనభుజావిక్రమం బనతారిదుర్గమంత్రి, దంతశూకాచ్యుత స్యందనంబు

గీ. గాఁగ, వెలసినచంద్రశేఖరపదార, విందసేవాకళాలబ్ధవిభవశాలి
మాన్య, డీడూరియెల్లయామాత్యమౌళి, యుల్ల మానందమునుబొంద నొక్కనాఁడు.

సీ. అలయుగంధరుసాటి యగునీతికార్యకర్తృ,యాధుర్యులైన యాప్తసచివు
లలపరాశరసూనుఁ దలఁపించువేదశాస్త్ర, విద్యాధురీణాగ్యవితతు
లలబాణు నోరయుకావ్యక్రియావైఖరీ, సాగస్యనిధులైన సత్కవీంద్రు
లలపురందరసూనుఁ గెలువంగ నూహించు, విక్రమక్రమధన్యవీరభటులు

గీ. అప్సరస్త్రీలఁ బోలెడు నబ్జముఖులు, కలితసంగీతగాంధర్వగాయకులును
మహిమఁ గొలువంగ నిజసభామందిరాంత,రమునఁ బేరోలగంబుండి ప్రమదలీల.

మ. ననుఁ గౌండిన్యమునీంద్రగోత్రజు సుధాంధస్సింధుకల్లోలగు
ల్యనిరాఘాటవచోధురంధరుని దేచామాత్య సత్పుత్త్రుఁ బా
వనచారిత్రు శశాంకమౌళిపదసేవాలబ్ధ సాహిత్యస
ద్ధనుని స్పంధువిధేయు శంకరకవి న్దాక్షిణ్యపుణ్యాగ్రణిన్. 19

తే. మమత రావించి యగ్రాసనమున నునిచి, కప్పురపువిడెము గంధాక్షతంబు లాది
గాఁగఁ గర్పూరతాంబూలకనకభూష, ణాంబరంబులు దనియ నందంద యొసఁగి.

తే. సప్తసంతానములలో యశస్కరంబు, కృతియె కావున నీవొనరించునట్టి
నిరుపమానహరిశ్చంద్రనృపచరిత్ర, మంకితము సేయు నాపేర ననఘచరిత.

వ. అనుటయు నట్లకాక యని యంగీకరించి, సరససంగీతసాహిత్యవిద్యావినోదగోష్ఠీవిహారుండును, వసుంధరాభారభరణ దక్షదక్షిణభుజాదండప్రాభవాధ్యక్షుండును, నవార్యాగజతురగసౌభాగ్యభాగ్యుండును, మత్తమరాళగామినీవిశాలనయనచకోరనయనసంపూర్ణపూర్ణిమాచంద్రుండును, భోగదేవేంద్రుండును, కపటరిపుదుర్గమంత్రిజనాఖర్వగర్వపర్వతకులిశాయమాన కార్తికేయుండును, వనీపకమనోరథార్థదాయకుండును, శంభుసేవావిశేషలబ్ధవిజృంభమాణ శాశ్వతైశ్వర్యుండును, శాండిల్యమునిచక్రవర్తి గోత్రప్రవర్ధనక్రియాధురీణుండును నగు నీడూరెల్లయామాత్యవంశావతారం బభివర్ణించెద.

శా. కల్యాణాత్మకమూర్తి జృంభితతపోగాంభీర్యధుర్యాత్మ సా
కల్యామ్నాయరహస్యవేది బుధలోకస్తుత్యు నంభోజభూ
తుల్యప్రాభవశాలిఁ బంకరుహబంధుస్వచ్ఛతేజస్వి శాం
డిల్యు న్సంయమిచక్రవర్తిఁ దగు వర్ణింపంగ నశ్రాంతమున్.

తే. ఆమునీశ్వరువంశ దుగ్ధాంబునిధికిఁ, బూర్ణనీహారకిరణుఁడై వర్ణనీయ
మహిమ విలసిల్లె లింగనామాత్యవర్యుఁ. డనఘుమతి బల్లికురువపురాంకుఁడగుచు. 24

క. ధర లింగమంత్రితనయులు; సరసులు ప్రెగడనయు గౌరవసచివుఁడును గుణా
భరణుం డమరయ్యయు సు, స్థిరకీర్తుల వెలసి గణ్యచింతామణులై.

చ. ప్రెగడనమంత్రి బంధుజనబృందము పేర్కొన నుండిశాసనుం
డగుమతిశాలి వీరసచివాగ్రణిపుత్రికఁ దిప్పమాంబికం
దగుమహిమ న్వివాహమయి ధన్యచరిత్రులఁ గాంచెఁ బుత్రులన్
జగదభివర్ణనీయుల విశాలయశోవిభవాభిరాములన్. 26

సీ. స్వర్ణదీలహరికాసందోహవిమలయశస్కుఁడగు శ్రీశాలిభాస్కరయ్య
ధారాధరానుకారకరుహోజ్జ్వలారాతి, వితరణగుణమహోదీగనారి
చేతోభవాకారాతిసేవాధురీణుండు, భూపాలాధిపమంత్రి పోతవిభుఁడు
సంగీతసాహిత్యచతురవిద్యాకళా, లీలాపరిష్కృతుండు లింగరాజు

గీ. పెద్దతాననఁ దనరిన పెద్దవిభుఁడు, మహిమ వెలసిరి రాజన్యమాన్యు లగుచుఁ
గల్పతరుపంచకముఁరీతిఁ గవిజనార్థి, యూధముల కిష్టఫలముల నొసఁగఁజాలి. 27

వ. వారిలోన.

సీ. యాచకదారిద్ర్యహరణకారణగుణ, శ్రేణి యెవ్వానివిశ్రాణనంబు
శాతోదరీజనచేతోముదావాది, వర్తితమూర్తి యెవ్వానిమూర్తి
కపటశాత్రవమంత్రివర్గసాధ్వసరాశి, బాహుబం బెవ్వానిబాహుబలము
దిగ్దంతిదంతకాంతిపరిహాసిప్రభా, విలసనం బెవ్వానివిమలయశము

గీ. దండశూకాధినాథమండనాత్మునాయి, యాఢి నెవ్వానిచాటువాగ్రప్రధీశయ్య
యతఁడు సెంపొందు లోకవిఖ్యాతి బల్లి, కురువ పెద్దయ యనుమంత్రికుంజరుండు.

ఉ. అద్రివిజాధినాయకునియంతటివాఁ డురువైభవంబునన్
దద్దలివైపులం దృణముగాఁగఁ గనుంగొను భాగ్యశాలి యే
ప్రొద్దును బాంధవార్థిజనపోషణ మేమఱఁ డిట్టిధన్యుఁ డో
పెద్దన తద్దయుం బ్రబలె విద్వదనీకనిపకస్తుతిన్. 30

తే. ప్రాజ్ఞుఁడై కీర్తిగనినట్టిపట్టుమెట్టు, పోతనార్యునిపుత్రి నంభోజనేత్రి
బరిణయం బయ్యెఁ జిక్కమాంబావధూటి, నింపు సెంపొంద పెద్దమంత్రీశ్వరుండు.

చ. వినుతచరిత్రి చిక్కమకుఁ బెద్దనమంత్రికిఁ బ్రాభవాధికుల్
తనయులు సంభవించిరి ముదంబున బాచయదండనాథుఁడున్
మనసిజవాసవాత్మజసమానవిలాసుఁడు పెద్దయ్యయున్
వినుతవివేకభూషణుఁడు వీరనయున్ చరితార్థులెంతయున్. 32

వ. అం దగ్రజుండు. 33

సీ. కాంతాజనస్వాంతసంతోషకరరూప, హసితలతాంతబాణాసనుండు
సుకవిసందోహసంస్తూయమానాశ్రాంత, వితరణక్రియావిబుధశాఖి
నిఖిలవిద్యాకళానిరవద్యవైఖరీ, లీలావివేకనాళీకసూతి
[illegible]కోటీరఘటితమార్గగానర్గళో, రత్నప్రభాసన్నిభ స్వచ్ఛకీర్తి
గీ. బంధుజాలపయోజాతభాస్కరుండు, భూరిగాంభీర్యవినయవిభూషణుండు
ప్రబలె వాణీశవంశవారాశిసోమ, ధాముఁ డీసూరిబాచప్రధానమౌళి. 34

ఉ. యాచకలోకరక్షణసమంచితభూరిదయాగుణక్రియా
శ్రీచరు వంశపావను మృగీనయనాజనపంచబాణు వి
ద్యాచతురాస్యు నీశ్వరపదాంబురుహద్వయచంచరీకముం
బాచయమంత్రిపుంగవుని బ్రస్తుతిఁ జేయుదు రార్యులెప్పుడున్. 35

క. పెద్దనమంత్రియశోరుచి, నగుఁ దుహినాచలముఁ బక్షినాయకకులమున్
నాగభిద్దంతావళమును, గంగాధునీజలముఁ జంద్రకాంతోపలమున్. 36

చ. వగకగపతాక నాకృతి హిమద్యుతి నిర్మలగాంతి విష్ణునా
యకుని విభూతిఁ బాండుతనయాగ్రణి ధర్మగుణప్రశస్తి హా
టకగిరి ధైర్యవృత్తిఁ గపటప్రతిపక్షపమోఘనిసేంగుచ్ఛ బ
ల్లిదుడు పెద్దమంత్రిసుతు లిల నుతించెద వీరనార్యునిన్. 37

వ. వీరిలోన. 38

చ. అనఘుఁడు సద్గుణాఢికొండరాధిపకుమారిమిత్రి నద్రినం
దన దానధురీనపద్మనయనం బెదలింగను బెండెకట్లశా
సనుఁ డగుపర్వతయ్యసుతఁ జంద్రముఖిం బెదలింగమాంబ నిం
పెసఁగ వివాహ మయ్యె విభవేంద్రుఁడు బాచయమంత్రి యున్నతిన్. 39

సీ. అవనీసుతశ్రేణి కన్నతాన్న మొనగాడి, మెలఁతల కీయింటి మేలుబంతి
ధవునియానతి యొక్కలవము లంఘింపని, సతియల కీభామ జన్మసీమ
సగుణపాతివ్రత్యగరిమంబు వొందెదు, తాటంకవతుల కీజోటి మేటి
నిష్ఠన్యులఁ బుత్రరత్నములఁ గాంచినవను, తరుల కీకాంతామతల్లి తల్లి

గీ. పుణ్యములపోఁగువు గాంభీర్యమునకు నెలవు, మహితసౌభాగ్యగుణములమంజరి
వినుతలావణ్యలక్ష్మికి ననికి యనఁగ, లీల విలసిల్లె బాచయలింగమాంబ.

చ. పతి తనపాలిదైవ మని భావనసేయుపురంధ్రి బంధుసం
తతులకు సంతతంబును సుధామధురాన్నము లన్నపూర్ణయా
కృతి బరితుష్టిగా నొసఁగు నిం పెనఁగం బినలింగమాంబ కీ
క్షితి బ్రతి సేయ లేరు సరసీరుహలోచన లెన్ని చూచినన్.

సీ. అనఘవర్తనుఁడు బాచయమంత్రివర్యుండు, హరిణాక్షి పెదలింగమాంబవలన
నిద్ధతేజోనిధి నెల్లయామాత్యుని, హేమాద్రిసమధీరు సోమఘనుని
బినలింగమాంబికావనరుహాననయందు, రసికశేఖరు పెదరామవిభుని
బినరామధీమణి బ్రియవచోవైఖరి, బ్రతిభాసముగ్రని బన్నయయ్య

గీ. గనియె వారలు వంశమాకందవాటి, కావసంతులు హరిదంతకరటిదంత
కాంతినివహానుకారినితాంతకీర్తి, రుచివిభూషణు లగ్ధాధిక గుణపతులు.

ఉ. రామభుజాబలాఢ్యుని బురందరవైభవధుర్యు బాంధవా
రామవసంతమూర్తి నమరద్రుమపుష్పసరో న్మరందధా
రామధురోక్తివైభవధురంధరు నెన్నెద వీగమంత్రి శ్రీ
రామనదండనాయకుని రాజసభాభవనాంతరంబునన్.

శా. ఈడూరీకృతసాధురీతికలనాహ్వాద్యానవద్యంబు లీ
యీడూ రెల్లనమంత్రిశేఖరవచోహేవాక ముల్లాండవ
క్రీడాకౌతుకజృంభమాణఫణిరాట్కోయూరకోటీరగం
గాడోలాయితనిర్మలోర్మిపటలీగాఢధ్వనిప్రౌఢికిన్.

సీ. గాంగేయవిస్ఫూర్తి గాంగేయవిస్ఫూర్తి, నమరె దేహప్రభావినుతగుణాల
బంచాననాకృతి బంచాననాకృతి, బోలు పొందె శౌర్యవిభూతులందు
నాగేంద్రవైఖరి నాగేంద్రవైఖరి, విలసిల్లె బలవచోవిభవములను
హరిజృంభణంబున హరిజృంభణంబున, బొదలె లక్ష్మీయోగభోగములను

గీ. నతడు కరహాటలాట కర్ణాట యవన, కుంత లావంతి నృపసభాభ్యంతరాళ
సుకవిగాయకలోకసంస్తుత్యకీర్తి, నిత్యు డీడూరిసోమనామాత్యమౌళి.

మ. పెదరామయ్యను బాచమంత్రిసుతు గాంభీర్యాంబుధిం గామినీ
మదనుం జేరోక్కన వచ్చు రాజసభల న్మందాకినీచందన
త్రిదశక్ష్మారుహతారహారనిభకీర్తిస్ఫూర్తి సంపూర్ణస
ర్వదిశాభాగుని మేరుశైలధృతి గీర్వాణాధిపప్రాభవున్.

క. వనరాశిఘనగభీరుని, బినరామనమంత్రివర్యుఁ జేర్కొనఁగఁ దగుం
దనరారువేడ్క యాచక, జనరాధాతనయుఁ బాచసచివాత్మజునిన్. 47

క. పర్వతమంత్రిని హిమవ, త్పర్వతఘనధైర్యధుర్యు భామాజనదృ
క్పర్వతనూసౌందర్యు సు, పర్వతరుత్యాగశీలు బ్రణుతి యొనర్తున్. 48

క. అం దగ్రజుఁడు లోకా, నందకరుం డొప్పు నింద్రనందనధనరా
ణ్ణందనలక్ష్మీనందన, సౌందర్యస్ఫూర్తి యెల్లసచివుఁడు ధాత్రిన్. 49

సీ. ఆర్యానుకూలకృత్యంబు శంభునియందు, దనయందు గలుగంగ దనరినాడు
భూరిసుదర్శనాస్ఫూర్తి కృష్ణునియందు, దనయందు గలుగంగ దనరినాడు
చతురాననప్రౌఢి జలజాసనునియందుఁ, దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
ప్రబలభోగోన్నతి ఫణివల్లభునియందుఁ, దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు

గీ. మతి విచారింపఁ గేవలమంత్రిమాత్రుఁ, డే ధనంజయబాహుశౌర్యాధికుండు
సత్యపర్తనుఁ డీడూరిశాసనుండు, హితవచోహారి బాచయయెల్లశౌరి. 50

వ. అమ్మంత్రినిధానంబునకు నిజస్థానంబు. 51

మ. అగవింధ్యాసనవాసవాద్యమరలోకారాధ్యకర్కోటకే
శ్వరకారుణ్యపదాభిరక్షితము భాస్వద్విష్టపద్మాభసుగో
త్రగనిత్యప్రతిపాదనిస్వన ముదాత్తశ్రీ నజస్రంబు ని
ద్ధగణిం జేర్కొన నొప్పుఁ గార్కొలను గోదావర్యుపాంతంబునన్. 52

సీ. ప్రాలేయశైలేంద్రబహుశృంగ సంతత స్ఫటికోపలప్రభాపటలములకుఁ
జంద్రోదయాగంభసంతోషితామృతాం, భోనిధానతరంగఫేనములకుఁ
వాసంతసమయగీర్వాణసర్గంసహా, జాతశాఖాసుమవ్రాతములకు
వారిజాసనసతీవక్షోజపాటీర, జంబాలచర్చాసుచర్చికలకు

గీ. వింధు నీడూరియెల్లప్రభుప్రశస్తి, దండనాథయశఃకాంతిమండలములు
దిక్పగోజాతలోచనాదీర్ఘకర్ణ, కోణముక్తాఫలభ్రాజికుండలములు.

శా. వేదార్థప్రతిపాదనప్రకటవిద్యాధురీణుండు సా
ధ్వాదర్శోదుకళావతంసుఁడు సమగ్రప్రాభవాఢ్యుండు నై
కేదారేశగురుండు సత్కృపఁ గటాక్షింపంగ వర్ధిల్లు ని
త్యోదారప్రతిభాగుణాభగణుఁ డీడూరెల్లనార్యుం డిలన్. 54

శా. చూడం దన్యసుధాంశుబింబవదనాస్తోమంబు గా నెట్టిచో
నాడం జాలఁ డసత్యవాక్యములు గర్వాయత్తుల న్మత్తులం
గూడం డెన్నఁడుఁ బూర్ణచంద్ర సుగుణశ్రీ దండరూపాధికుం
డీడూరెల్లనమంత్రి బోలఁ గలరే యెవ్వారు నిర్ధారుణిన్. 55

చ. సరసజనాగ్రగణ్యుడును సత్యవచోగచనాధురీణతా
భరణుడు నైనయల్లిఘను బాచయయెల్లనికీర్తికామినీ

కరతలమల్లికాప్రసవకందుక మంబురుహాక్షిరాతి త
త్పరిమళలోలషట్చరణపంక్తియె లాంఛన మెన్ని చూచినన్. 56

గీ. సరససారసదినరాజు సత్త్రిరాజు, లింగయామాత్యపుత్త్రి నాళీకనేత్రి
రూపగుణశీల నుతభవానీపురంధ్రి, నెలమి వరియించె నీడూరియెల్లమంత్రి. 57

సీ. పరమపాతివ్రత్యగరిమ నరుంధతీ, సంపూర్ణపూర్ణిమాచంద్రవదన
సదమలసత్యభాషావిశేషంబుల, రాజీవగర్భురాణియాన
యపరిమితంబైనయట్టితాలిమికల్మి, ధాత్రీసరోజాతపత్రనేత్రి
శాశ్వతైశ్వర్యవిస్తారవిస్ఫూర్తుల, నమృతపాథోరాశియాడుబిడ్డ

గీ. బాంధవాశ్రిత భూసురప్రకరసంత, తాన్నవిశ్రాణనంబున నన్నపూర్ణ
యనగ నీడూరియెల్లనార్యునిపురంధ్రి; వినుతిగాంచె భవాని పావనచరిత్రి. 58

ఉ. భావజరూపవిభ్రమవిభాసితు డెల్లనమంత్రికి న్భవా
నీవరవర్ణినీమణికి నిర్మలకీర్తులు గల్గి రాత్మజుల్
కోవిదవర్ణనీయు లతికోమలమూర్తులు బంధులోకసం
భావనదక్షు లెంతయును బాపనయుం గఱకంఠమంత్రియున్.

షష్ఠ్యంతములు.

క. ఈదృగ్విధమహిమాయతి, కాదిత్యాపత్యఖేచరాదిత్యగనీ
సాదృశ్యవితరణ శ్రీ, మోదితవిబుధేంద్రతతికి ముఖ్యస్థితికిన్. 60

క. ఆరాధితశంభునకును, సారబలాన్వితఘనభుజాస్తంభునకున్
దూరీకృతదంభునకు ద, యారచనాబంధురగుణారంభునకున్. 61

క. సతతాన్నదానసంగ, తీకృతనానార్థిలోకగీర్వాణునకున్
జతురవచోరచనాతి, ప్రతిభాసుకవిత్వతత్త్వపారీణునకున్. 62

క. గురుచరణయుగళసేవా, గురుతాత్పర్యునకు మంత్రికులవర్యునకున్
గురుతరమతికి న్గౌరీ, గురుసన్నిభధృతికి వినుతకోవిదతతికిన్. 63

క. మానిజనవంద్యగౌరీ, జానిపదాంభోజయుగళసదమలసతత
ధ్యానవిలీనస్వాంతమ, నోనాళీకునకు సతతనుతలోకునకున్. 64

క. పాటీరహీరహిమకర, కోటీరతుషారహారగోక్షీరమరు
ద్ఘోటకహాటకగర్భవ, ధూటీసమవిమలకీర్తిధుర్యోన్నతికిన్. 65

క. నిరుపమనృపకార్యధురం, ధరునకు శాండిల్యగోత్రునకు బాచమహీ
వరమంత్రితనూభవునకు, హరిహయవిభవునకు నెల్లనామాత్యునకున్. 66

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం గడంగిన హరిశ్చంద్రచరిత్రం బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.

### కథాప్రారంభము.



తరుణీమనోహరగవిరించిసమానమహాతపోధన
వ్రాతనివాసయోగ్య మమరద్రుమతుల్యసమస్తపుణ్యభూ
జాతలతానికేతనవసత్పికముఖ్యశకుంత మెంతయున్
ద్వైతవనంబు పొల్చు వసుధారమణీహారినీలభూషయై.

చ. జానవిరోధిఁ దాపససమాజము పూజ యొనర్చుదాఁక ష
ట్పదములు బుష్పగుచ్ఛములపై భ్రమరింపవు చంద్రశేఖరున్
ముదమున మజ్జనంబు మునిముఖ్యులు సేయకమున్న హంసము
ల్గదియఁగఁ బోవు తామరకొలంకుల కవ్విపినాంతరంబులన్. 2

సీ. వికసితకుముదారవిందసౌగంధిక, విస్ఫురద్వాసనావిలసితంబు
చంచరీకమరాళచక్రవాకక్రౌంచ, బకసంచయారావభాసురంబు
తీరద్రుమసుమగుచ్ఛవాసనిర్యన్మక, రందసమేతాంబురాజితంబు
మత్స్యకచ్ఛపమహామకరాదిజలజంతు, సంతానసంచారసలలితంబు

గీ. సతతకేళీవనాసక్తసంయమీంద్ర, బాలికాకుచకాశ్మీరపంకసురభి
రంగదుల్లోలకల్లోలసంగతంబు, రుచిరమై పొల్చు నొక్కసరోవరంబు. 3

తే. ఆసరోవరతటమున నమరవిటపి, కరణి నుడివోనిపల్లవోత్కరలతాంత
చయశలాటుఫలాళులఁ జాలి విచ్చి, వీఁగు నొక్కరసాలపృథ్వీరుహంబు. 4

శా. ఆమాకందముక్రింద ధర్మజుఁ డగణ్యావాససంశీలుఁడై
భీమాదుల్నిజసోదరుల్నలువురుం బ్రేమంబుతోఁ గొల్వఁగా
భామారత్నము చేరి ద్రౌపది మహాభక్తి న్భజింపంగ నా
నామౌనీంద్రకథాప్రసంగముల నానందంబుతో నుండఁగన్. 5

వ. ఆసమయంబున.

శా. గండూషీకృతవేదశాస్త్రనిఖిలగ్రంథార్థసారుండు మా
ర్తండానూనతనుప్రభాంచితుఁడు సుత్రామాదిగీర్వాణసే
వ్యుం డంహఃకరిసింహపోతము ఋషివ్యూహాగ్రగణ్యుండు మా
ర్కండేయుండు ద్వితీయబాలశశిరేఖాశేఖరుం డిమ్ములన్.

సీ. భసితత్రిపుండ్రాంకఫాలభాగముతోడ, రుద్రాక్షమాలికారుచులతోడ
బల్లవారుణజటాపటలభారముతోడ, నవ్యపలాశదండంబుతోడ
నుత్తమవ్యాఘ్రాజినోత్తరీయముతోడ, రమణీయదర్భాంకురంబుతోడ
నతినిర్మలస్ఫటికాక్షసూత్రముతోడ, ధవళయజ్ఞోపవీతములతోడ,
గీ. బుణ్యకల్లోలవత్యంబుపూర్ణఘనక, మండలువుతోడ వినయసంపదలు పొదలఁ
గదిసి భజియించువరశిష్యగణముతోడ, గరిమ నేతెంచెఁ బాండవాగ్రజునికడకు.

సీ. అరుగుదెంచుటయుఁ దా నల్లంత దవ్వులఁ, బొడగాంచి యెదురుగాఁ బోయి భక్తి
ననుజసమేతుఁడై యందంద పెక్కువం, దనము లొనర్చి తోడ్కొనుచు వచ్చి
పావనసలిలార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి కుశాసనాసీనుఁ జేసి
హస్తాబ్జములు మోడ్చి యంతరంగంబునఁ, బ్రేమ ముప్పిరి గొన సేమ మడిగి
గీ. సమయసముచిత మృదువాక్యసరణి వెలయఁ, గోరిసుఖగోష్ఠి నడపుచుఁ గొంత ప్రొద్దు
జరపి కుంతీసుతాగ్రణి సంయమీంద్రు, బలికె నిట్లని వినయసంపదలు పొదల. 9.

శా. అర్కాభ్రాజితతేజ కల్మషసమూహాంభోజహేమంతదు
స్తర్కాతీతమతిప్రభావసుమనస్సందోహకోటీరసం
పర్కానేకమణిప్రభాళివిలసత్పాదాంబుజద్వంద్వ యో
మార్కండేయమునీంద్ర! శక్యమె భవన్మాహాత్మ్యము ల్సెప్పఁగన్. 10.

క. విమలతపఃపరిపోషిత, కమలాసనకమలనాభకమలారికిరీ
టీ మహానుభావ నినుబోల మహాత్ములు ముజ్జగంబులను లేరరయన్. 11.

మత్తకోకిల. ఆలపోతును జింకయున్ గరళాంకము న్గజచర్మమున్
శూలముం జడలేఱుఁ దామరచూలి భూరికపాలమున్
ఫాలనేత్రము బూపచందురుడు బాపపేరును డాపుచున్
హేలమై జరియించుదేవుడ వీవు కేవలమానివే. 12.

క. ఇత్తాపసపుంగవులకు, ముత్తాతవు నీవు గావె ముజ్జగముల మీ
చిత్తముల కెఱుకపడనివ్వ, పోత్తమవృత్తములు గలవె యూహింపంగన్. 13.

ఉ. కావున దొల్లి మీ రరసి కాంచినయట్టినృపాలకోటిలో
నీవసుధాస్థలిం దొలుత నేమఱి రాజ్యము గోలుపోయి హా

దావహలీల గ్రీష్మఋ బ్రిజాభినుత స్థగ నేలినట్టిధా
త్రీవరు నాన తీవలయుఁ దేటపడం గ్రసలో మునీశ్వరా. 14
క. అని యిబ్విధమున నడిగిన, విని మార్కండేయమౌనివృషభుఁడు కుంతీ
తనయాగ్రజునకు నిట్లను, ఘనకరుణాపాంగదృగ్వికాసము లడరన్. 15
క. మనుజేశ నీవు నను వేఁ, డినమాటకుఁ దేటపడఁగ డెందంబు ముదం
బును బొంద సదుత్తరమగు, విను మొకపృథ్వీశుకథ వివేకస్ఫురణన్. 16
సీ. ఆకాశవాహినీనీకాశపర్యంత, భూసరయూనదీభాసురంబు
పవనభుగ్భామినీపాథోవిహారరమా, గ్ర్యానేకపరిభూజితార్ణవంబు
సౌధశృంగన్యస్తజలజరాగప్రభా, పాటలీకృతదిఙ్నభస్థలంబు
నికటలీలారామవికచనానావిధ, ప్రసవసౌరభ్యవిభ్రాజితంబు
గీ. కరము కొనియాడఁదగు నహంకారవైరి, ధారణీధరజలదసమీరణంబు
ప్రబలవిభవాకరము వీరభటనికాయ, కేసరిక్షోణిధరము సాకేతపురము. 17
తే. ముక్తిదములైన పురములు మూఁడునాల్గు, వానిలో నగ్రగణ్యయై వసుధమీఁదఁ
బరఁగు ధనదునిప్పురి కనుప్రాసమగుచు, నఖిలసిద్ధజనారాధ్య యగునయోధ్య. 18
క. ఆపంకజసంభవునకు, నాపవనభుగీశ్వరునకు నాగహునకు నో
భూపాల పొగడఁ దరమే, యాపట్టణమహిమ షోడశాంశం బైనన్. 19
శా. ఆకాశస్పృగనేకభూరిశిఖరవ్యాసక్తవైమానికా
నీకం బప్పురివప్రమె ప్పెసఁగు వర్ణింపంగ నిర్మాణలీ
లాకేళిగతి జక్రవాళగిరిఁ బోల న్నేర్పు సంధిల్ల భా
షాకాంతుండు సృజించి నిల్పినమహాశైలంబుచందంబునన్. 20
శా. సాలస్థూలమనోజ్ఞశృంగఘటితస్వర్ణాభనీలప్రభా
జాలంబు ల్గలయంగ నంబరమునన్ సాంద్రంబుగాఁ బర్వినం
గాళిందీనది హేళిఁ గన్గొనెడివేడ్కన్వచ్చెనో కాక యం
చాలోకించుచు సంశయింతురు సుధాహారేందుబింబాననల్. 21
తే. నల్లకలువలు దొగలు కెందామరలును, నీలమణిశుక్తివిద్రుమశీలఁ దనర
శీకరంబులు మౌక్తికశ్రీవహింపఁ, బరఁగు రత్నాకరముఁ బోలెఁ బురము పరిఘ.
ఉ. శ్రీ విలసిల్లునప్పురి విచిత్రపుహర్మ్యతలంబులందుఁ బుం
భావరతిప్రసంగములఁ బల్మఱుఁ జొక్కి శ్రమంబుఁ జెందురా
జీవదళాయతేక్షణల చెక్కులఘర్మపయఃకణావళు
ల్పోవఁగఁ జేయు నభ్రనదిలోపల మెల్లని చల్లఁదెమ్మరల్. 23

క. సురశిఖరిశిఖరసమసు, స్ఫురదున్నతశృంగఘటితశుంభన్మణికుం
భరుచిపరిపూరితాఖిల, హరిదంతరములు పురంబు హరిహరగృహముల్. 24
తే. గగనగంగాతరంగిణీకనకకమల, హరణగమనార్థజనకల్పితాతిహృద్య
విమలశశికాంతసోపానవితతు లనఁగఁ, బొలుచుఁ గలధౌతగోపురములు పురమున.
తే. దానవారిప్రశస్తి నెంతయును వెలసి, భూరిపద్మాభిరమ్యవిస్ఫురణ గలిగి
ధేనుకాహితమతి వసుదేవసుతుని, బోలు నప్పురి భద్రశుండాలపతులు. 26
క. నాకస్వామితురంగము, కోకనదప్రియునిరథముగుఱ్ఱంబులు నే
మోకాని యితరతురగము, లాకటకములోనఁ గలుగుహయులకు నెనయే. 27
తే. తత్పురస్యందనములయందములు హృదయ, వీథి నిడుకొని మతి సుమీ విశ్వకర్మ
కమలవనబాంధవునిశతాంగముఁ గుబేరు, పుష్పకంబును సృజియించెఁ బోలుపు దోలక.
క. గుణులు శ్రుతిశాస్త్రపారా, యణులు తనూదీప్తివైభవాధరితనభో
మణులు వచశ్శేషమహా, ఫణు లప్పురములోని బ్రాహ్మణు లెల్లన్. 29
క. చాపాద్యాయుధవిద్యా, నైపుణగాంగేయు లర్థి నవరాధేయు
ల్బాపట్టుదు రాపురమున, భూపకుమారులు భుజావిభూతికుమారుల్. 30
క. భిక్షాటకుఁ డగుశివుతోఁ, బక్షంబై మైత్రి నెపుడు పాయండని యా
యక్షేశ్వరుఁ బ్రహసింపుదు, రక్షీణైశ్వర్యధుర్యు లప్పురివైశ్యుల్. 31
ఉ. భద్రవితీర్ణసంపదలఁ బ్రస్తుతిఁ గాంచినయట్టినూత్నక
ల్పద్రులు బాహుసత్వబలభద్రులు సంతతవిప్రభక్తిని
ర్ణిద్రులు సద్గభీరగుణనిర్జితదుగ్ధసముద్రు లాఖ్యతా
క్షుద్రులు తత్పురిం గలుగుశూద్రులు ధైర్యసురాద్రు లెన్నగన్. 32
క. చటులరణరంగవీథీ, నటులు మదారాతివీరనవజయలక్ష్మీ
విటులు భయంకరశౌర్యో, ద్భటులు పురిం గలుగువీరభటులు దలంపన్. 33
ఉ. కీరకిశోరభాషలును గేసరిమధ్యములున్ బ్రఫుల్లపం
కేరుహపత్రనేత్రములఁ గెంపుల నీనెడుతియ్యమోవులున్
వారణరాజయానములు వన్నెలు గాని విభూషణావళుల్
పౌరవిలాసినీతతికి బల్మఱు వన్నెలు గావు చూడఁగన్.
ఉ. క్రొవ్వినయట్టినిబ్బరపుగుబ్బచనుంగవలున్ మృణాంబులన్
నవ్వవిశాలలోలనయనంబులఁ బున్నమచందమామసైఁ
జివ్వకుఁ గాలుద్రవ్వనునుఁజెల్వపుమోములఁగ్రొ న్నవ్వపుం
బువ్వులయొత్తులమ్మెదురు పొందుగ నప్పురిఁ బుష్పలావికల్.

సీ. దాడిమీఫలముల దర్పింపవితతుల, దట్టించు రదనములు దంతములును
ధారాధరంబులఁ దత్తఱపెట్టెడు, నదలించు కురులును నంగములును
తామరసంబుల దర్పంపుశోభలఁ, హసియించు మొగములు హస్తములును
నంబువీచికల దరావర్తకంబుల, నగునళిత్రియములు నాభితతులుఁ

గీ. గలువపువ్వులఁ దత్పరాగముల గెల్చు, వాలుగన్నులు దనువులవాసనలును
గలిగి యొప్పుదు రప్పురాంగనములందు, లలితగతులైనవారవిలాసవతులు. 37

ఉ. పౌరనితంబినీజనులపయ్యెద లూర్యనదూతి సీనవ
క్షోరుహాలిస్తసంకుమదకుంకుమచందనపంకవిస్ఫుర
త్సౌరభము ల్మనోజ్ఞగతి సారెకు గోత్రిల పటీరభూమిభృ
న్మారుత మప్పురి న్మెలఁగ మాంద్యము జల్లినఁబు జూపుచున్. 38

క. ఏతాదృశమహిమంబుల, భూతలముల జనులచేత బొగ డొందినసా
కేతమునకు విధినివహాని, కేతనమున కధిపు లమితకీర్తిస్ఫూర్తుల్. 38

ఉ. మానుగ జేపునుం బగలు మాపు బితామహమన్మథద్విష
ద్దానవవైరమూర్తుల నుదారగతి న్విహరించు వేల్పు తే
జోనిధి వంశకర్తయయి సూర్యకుమే లొసఁగంగ నిత్యల
క్ష్మీనుతవైభవస్ఫురణ జెందిన దానకళాధురంధరుల్. 39

సీ. వాసవనిభుఁడు వైవస్వతుండును విను, క్ష్వాకుఁడు నిక్ష్వాకున్ప కేసరియును
బాణుండు ననరణ్యపార్థివుండును వైన్యు, దుందుమారులు పరిపంథిజయులు
యువనాశ్వమాంధాతృకువలయేశులు పురు, కుత్సాహ్వయుండు కాకుత్స్థవిభుఁడు
నంబరీషుఁడు త్రిశంకువసురనిండు, సారపుణ్యుఁడు హరిశ్చంద్రవిభుఁడు

గీ. ప్రిణాతి జెందిరి జలజాతబంధువంశ, చూతవనచైత్రు లత్యంతశుభచరిత్రు
లహితకైతవ్రిలు సకలలోకైకమిత్రు, లబ్ధివలయితసర్వంసహాధిపతులు. 30

వ. వారిలోన. 41

సీ. నిత్యసత్యవ్రతస్ఫూర్త్యవారిత్రుఁడై, గౌరీమనో నాగరుకరుణ వడసి
సమదశాత్రవలోకజయసమాకాంతుఁడై, రాజసూయమహాధ్వరం బొనర్చి
ధారాధరత్యాగధౌరేయుఁడై వని, పకలదారిద్ర్యంబు బాయఁజేసి
భుజగనాయకతుల్యభూరిభోగ్యుండై, వసుమతీభరము సర్వము వహించి

గీ. నవనిలో బదువాల్గుమహాయోగములు, పూజ్యసామ్రాజ్యపదవివిభూతి నెగడె
సకలకలుబంతరాళిప్రశస్తకీర్తి, చంద్రమూర్తి హరిశ్చంద్రచక్రవర్తి.

ఉ. ఏనుగుల న్హయంబుల న్మృగేక్షణుల న్మణిభూషణంబులం
గానుక దెచ్చి కొల్తు రతికౌతుకలీల నిరంతరంబు నం
భోనిధివేష్టితక్షితివిభుత్వము జెందినరాజు లెల్ల నా
భానుకులాగ్రణిం గని నభస్తటినీనిభకీర్తిఁ బుణ్యునిన్. 43

ఉ. కేళి దలిర్ప నాక్షితిపకేసరిబాహుపరాక్రమంబునం
గోలుమసంగి వైరిగజకుంభవిపాటన మాచరింపగా
వ్రాలినముత్యము ల్కదనరంగమునం గనుపట్టువీరల
క్ష్మీలలనాకరగ్రహణసీమ రచించిన ముగ్గులో యనన్. 44

క. ఆతనిబాహాదండము, వాతాశనరాజసత్తవసుధాధరది
గ్మాతంగకమఠకిటులకు, నాతతవిశ్రాంతి యొసఁగు నశ్రాంతంబున్. 45

సీ. సమధికబాహుపీఠమున సర్వంసహా, యాననంబున నమృతాకరుండు
భూరిప్రతాపవిస్ఫురణ హవ్యవహుండు, తేజోవిభూతి నంభోజహితుఁడు
నయనారవిందకోణంబుల నిందిర, వర్ణితసూనృతవాణి వాణి
ప్రచురవైభవకళాప్రౌఢి జంభారాతి, సౌందర్యరేఖ మత్స్యధ్వజుండు
సతతమును నుండఁగాఁ దనసర్వదేవ, తామయత్వంబు దెలుపు నాధరణివిభుఁడు.

మ. కవిదారిద్ర్య మహాంధకార మడఁగెం గల్గె న్సుహృద్బంధుకై
రవకల్హారవరప్రతానములకు న్ప్రియత్వ ముబ్బె న్విలా
సవతీనేత్రచకోరికాతతి హరిశ్చంద్రుండు దిక్పూర్ణకీ
ర్తి వికాసోజ్జ్వలకౌముదీ పటలకాంతిం జాల దీపించినన్. 47

తే. శశవిషాణంబు బ్రాహ్మణస్వాపతేయ, హరణబుద్ధి నభఃపుష్ప మనృతవాక్య
సరణి వివరించి చూడ నద్ధరణిపతికి, హాటకగ్రావసమనిరాఘాటధృతికి. 48

క. ఇంద్రనిభుండైన హరి,శ్చంద్రమహీరమణుగృహిణి సాధ్వీమణి ని
స్తంద్రమతి చంద్రమతి యనఁ, జంద్రానన చెప్ప నొప్పు శచికిం బ్రతియై. 49

క. ఆదంపతులకు నొక్కత,నూజుఁడు శశిబింబనిభమనోహరతను వి
భ్రాజితుఁడు లోహితాస్యుఁడు, భూజననుతిభాజనైకపుణ్యుం డరయన్. 50

చ. గిరిసుతయుం బినాకియును గేకిపవాహనుచేత లక్ష్మియున్
సరసిజనాభుఁడుం గుసుమసాయకుచేత, బులోమజాపురం
దరులు జయంతుచేతఁ బ్రమదంబును జెందినరీతి ధారుణీ
శ్వరుఁడును సాధ్వియుం గని రవారితసౌఖ్యము లోహితాస్యుచేన్. 51

క. పతిహితమతి గలసచివ, ప్రతతులలో మున్ను ధరణిఁ బ్రణుతింపఁగ ను
న్నతిఁ గన్న మంత్రిరత్నము, కృతపుణ్యుఁడు గలఁడు సత్యకీర్తి యనంగన్. 52

క. దేవేంద్రునకు బృహస్పతి, కైవడిఁ దగుమంత్రి యగుచుఁ గమనీయయశ
శ్శ్రీ వెలయు హరిశ్చంద్ర, క్ష్మావరునకు సత్యకీర్తి చాలఁగ హితుఁడై. 53

క. జననియు జనకుండును నై, మనుజేంద్రుఁడు భూప్రజాసమాజంబుల
త్యనుకంపను బ్రోచుచు నిం, పెనయ మహీచక్ర మెల్ల నేలుచు నుండెన్. 54

వ. తత్కాలంబున.

ఉ. శ్రీకరవైభవాఢ్యుఁడు హరిత్పతిముఖ్యుఁడు సర్వదేవతా
నీకశిరఃకిరీటమణినిర్మలపాదసరోజుఁ డబ్జనా
నేకపవాహనుండు పవినిర్దళితాద్రి శచీకళత్రుఁ డా
నాకమునందు వేడ్క నొకనాఁడు మహామహిమాభిరాముఁడై. 56

సీ. ప్రవిమలచంద్రికాధవళదుకూలంబు, గను పొందుగాఁ గటి గనుఁ గట్టి
నవరత్నమయభూషణవ్రాతములు గళ, శ్రవణహస్తాగ్రాల సరవిఁ దాల్చి
మంజులవాసనాపుంజగంజితమైన, చందనంబును దేహమున దలంది
తుమ్మెదగమికి విందులు సేయుసుందాగ, కుసుమదామము మౌళిఁ గునురుకొల్పి

గీ. పృథులచింతామణీభద్రపీఠికాగ్రమున హుతాశనసుపర్వదనుజవరుణ
గంధవాహకుబేరశంకరులు గొలువ, గరిమ విలసిల్లెఁ బేరోలగమున నుండి. 58

వ. నితాంతసంతోషంబుఁ జెంది శతానందనందనుండు కరారవిందాంగుళీనఖశిఖాంకు
రంబులఁ గరంబు సంగీతప్రపంచపారంగతుండై విపంచి వాయించుచుం గర్ణ
పుటంబులకు నుత్కృష్టసౌఖ్యంబు సంపాదింప నత్తఱిసంగంబున గంధర్వదివిజ
వధూనాగసతులు నానావిధమృదంగడిండిమహుడుక్కానకకారితాళకాహళ వేణు
ప్రముఖనిస్వనంబులం గలసి చరణసరోజనూపురారావంబులు చెలంగ నానేకవిధ
నృత్యవిశేషంబులు చూపుచు నయనోత్సవక్రియాకలాపంబు లొనర్ప బృందారక
సందోహంబులు సేవాంజలిపుటంబులు ఫాలభాగంబులం గీలించి కైవారంబులు
సంఘటింపఁ బ్రియంబునం గదిసి సుపర్వనితంబినీజనంబులు కరసరసిజసంకలితకంకణ
ఝణఝణత్కారంబులు తోరంబులై విజృంభింపఁ బూని చామరంబులిడఁ దదీయ
కోమలపవమానప్రకంపితరోలంబనీలకుంతలుండై యాసనభువంతుండు వసిష్ఠ వామ
దేవ వ్యాస వాల్మీకి పుల స్త్యాగస్త్య జైమిని జాబాలి జమదగ్ని కణ్వ కౌశిక కపిల
కశ్యప కౌండిన్య శాండిల్య గౌతమాదితపోధనవ్రాతంబులతోఁ గూడి వినోద
గోష్ఠిం దగిలియున్నయెడ నమ్మహామునులం జూచి యింద్రుం డిట్లనియె. 59

ఆ. మౌనులార స్వర్గమర్త్యపాతాళలోక,ములందు మీరు గన్గొనని వృ
పాలు రెండు లేరు పరికింపఁ గావున, వలయు నడుగ నొక్కపలుకు మిమ్ము. 59

క. త్రిభువనములయందును భూ, తభవిష్యద్వర్తమానధరణీశులలో
నభినుతసూనృతవాచా, విభవసముగ్రుండు గలఁడె వివరింపంగన్. 60

తే. అట్టిరాజన్య సకలలోకైకమాన్యుఁ, డియ్యపలుకుల నా కాన తియ్యవలయు
మీర లొండొరు లత్యంతసారమతుల, నరసి తలపోసి కృతనిశ్చయాత్ము లగుచు.

వ. అని యిత్తెఱంగునఁ బులోమజాభర్త పలికిన నవ్వాక్యంబు లాకర్ణించియు నాకర్ణిం
పని యట్ల యాశ్చర్యమనస్కులై నిశ్చయింప లేక.

ఉ. ఊరక మూఁగలో యనఁగ నుండి రగస్త్య పులస్త్య గౌతము
ల్ధారుణి వ్రాయుచుండె జమదగ్ని పరాశరమౌని యేమియు
న్నోరు మెదల్పఁడయ్యెఁ జ్యవనుండు విచారము సిగ్గు బర్వఁగా
నేరకయుండె మార్కలుక నింగి గనుంగొనుచుండె నత్రియున్. 62

సీ. కశ్యపువదనంబు గన్గొనె జాబాలి, యతఁడు నారదుని దేహంబు గోకె
నతఁడు శాండిల్యుని నమరేంద్రుమాటకు, నుత్తరం బిమ్మని యొత్తి పలికె
నతఁడు భరద్వాజు నల్లన యంగుళీ, సంజ్ఞను బలుమాఱు సన్న జేసె
నతఁడు మాండవ్యమునిమహాప్రవరుని, గనుఁగీటె నీవె యుంగవె యటంచు

గీ. నివ్విధంబున సకలఋషీశ్వరులును, నీవు నీవని ప్రతివాక్యనిర్ణయంబు
గాన కన్యోన్యవదనపంకజసమీక్ష,ణములు సేయుచునుండిరి బ్రమసినట్లు. 64

వ. అప్పు డనుపమానవిపులతపోగరిష్ఠుండును సకలమునిజనశ్రేష్ఠుండును భూతభవిష్య
ద్వర్తమానవిదుండు నగు వసిష్ఠుండు సభాసదులకలకలంబు వారించి సునాసీరునిం
గనుంగొని మహోద్ధతంబుగా నిట్లనియె. 65

శా. ఆకర్ణింపుము పాకశాసన సుపర్వానీకసంసేవ్య భూ
లోకాధీశుఁ డగణ్యపుణ్యుఁడు కృపాలోలాత్మకుం డర్థిర
క్షాకల్పద్రుమ మద్రిధీరుఁడు హరిశ్చంద్రాభిధానుండు ధా
త్రీకాంతుం డొకఁ డొప్పు సూనృతవచశ్శ్రీవైభవోపేతుఁడై. 66

క. మధ్యమలోకాధీశుఁడ, యోధ్యాపురభర్త నిర్జితోగ్రారినృపా
సాధ్యుఁడు సకలగుణా, రాధ్యుం డహీనమహిమ వంశగత్నం బగుచున్.

క. శరణాగతరక్షాగుణి, కరుణాగుణసింధుఁ డాత్రిగణ్యుం డిరను
వ్వరు సార్వభౌములకు న, ధ్వరకృత్యసమగ్రవిమలతరపుణ్యుఁ డిలన్. 68

తే. వేయు నేటికిఁ బార్వతీవిభుని యాన, సరసగంధర్వయక్షరాక్షససుపర్వ
దందశూకావలులలోన సంగునకును, సూనృతాలాపనియతు లెచ్చోట లేరు. 88

వ. అనుటయు నవంధ్యకోపాటోపంబున నరుంధతీమనోహరుం డిట్లనియె. 89

క. మతిఁ బరికింపఁగ నాత్మ, స్తుతియును బరనిందయును విశుద్ధాత్ములు దా
మతికలుష మందురు తగద, ద్భుత మొదవఁగ నన్ను నేనె పొగడుకొనంగన్. 90

తే. పంకరుహబాంధవుఁడును బాఁకశ్రేఁడు, కలశజాతుఁడు నెఱుఁగంగ నమలసూక్తి
మనతపశ్శక్తిలారరచ్యంబు లెల్ల, నిశ్చయింపఁడె యొంతయు నేర్పు మెఱసి. 91

తే. ఆర్యుఁ డడిగినపలుకుల కాత్మ నంబ, యుచితిభంగుల నొసగు ప్రత్యుత్తరంబు
నెట్టుకొని నీవు నాతోడ వట్టిజగడ, మునకు నేటికి బూనెదు మాఘవృత్తి. 92

ఉ. చంద్రికళావతంసుఁడు భుజంగమభర్తయు నైననాహరి
శ్చంద్రనరేంద్రుప్రాభవము సన్నుతి సేయఁగ శక్తు లే శర
చ్చంద్రపురందరద్విరదచందనకుందసురాళిమల్లికా
చంద్రిమనగేంద్రులన్ గెలువఁజాలుఁ దదీయయశోవిలాసముల్. 93

శా. సత్యశ్రీనిధి రాజమాత్రుఁడె హరిశ్చంద్రుం డహంకారవ
ద్వృత్త్యగ్రక్షితిపాలసైన్యతిమిరప్రాభాతమిత్రాయమా
నాత్యంతోగ్రభుజాకృపాణజనితో ద్యత్కీర్తి గంగానదీ
నిత్యక్షాళితసర్వలోకదురితానీకుండు వీక్షింపఁగన్.

క. పరిహాసమునకు నైనను, మరి కలలో నైనఁ గాక మఱపున నైనన్
ధరణిపయి హరిశ్చంద్రుఁడు, హాహాగ పరికింప ననృతమాడెడువాఁడే. 95

మ. మదిరాపానసమంబుగాఁ దలఁచు నమ్మార్తాండవంశోత్తముం
డుదయాంభోనిధి పల్కు బొంకుటలు దుష్టంగూడి వర్తించుటల్
తుదిఁ జండాలునితోడిసంగతిగఁ జేతోవీథి భావించు స
ర్వదిగంతస్ఫుటకీర్తి మూలధనమై వర్తించు సత్యస్థితిన్. 96

క. పరశాతోదరులు సహోదరులుం దల్లులును భూతదయ యెల్లప్పుడుం
గర ముల్లసిల్లు మిత్రుఁడు, వరధర్మము దలఁచి చూడ వర్మ మతనికిన్. 97

తే. అంతకంతకు రోషంబులలరఁ బ్రియము, దక్కు నీ వొక్కటియన నేనొక్కటియన
వట్టిమాటల నిటుఁ జాలి బెట్టనేల, వినుము కౌశిక యొక్కసల్కు విశదముగను. 98

సీ. అపరదిక్తటమునఁ దపనుండు పొడిచిన, గాంగేయశైలంబు గ్రుంగబడిన
పారిది నంభోనిధు ల్వ్యతిక్రమించిన, దమ్మిచూలివరంబు దప్పి చనిన

జంభారిపంపుఁబోలెఁ దనె వచ్చెనను, ధరణిమండలము దిద్దిరఁ దిరిగిన
హవ్యవాహనుఁడు శైత్యంబు వహించిన, బ్రహ్మాండభాండంబు పఱియలయిన
గీ. నాహరిశ్చంద్రమనుజేంద్రుఁ డనృతమాడఁ, డనిన నమ్మునివరునిశ్చయార్థమునకు
గనలి వెండియు నిట్లనుఁ గౌశికుండు, ఘనతరాంగారములు కన్నుఁగవను వెడల. 99
తే. బాపురే నీదుపలుకుల కీపురంద, రాదిబృందారకులును సంయములు మెచ్చి
రెంకఁ జాలింపు మలసితి వెంతసేపు, వాక్పరిశ్రాంతి వొందంగ వచ్చు నీకు. 100
క. పలుకులు నీకీతి వృథా, కలనాఁటిల కేమిఫలము గలిగెడు నీమా
టలు మేము విశ్వసింపము, తెలియంగా వలయు వానిదృఢనూనృతముల్. 101
ఉ. ఏవిధినైనఁ జుట్టుకొని యే జలపట్టి త్రిశంకుపట్టి నా
నావిధలీలలం గపటనాటకము ల్పచరించి ధైర్యల
క్ష్మీవిభవంబు మాపి చలచిత్తుని జేసి యసత్యవాక్యముల్
కేవలదుర్మనీషఁ బరికించినఁ బన్నిద మేమి చెప్పుమా. 102
ఉ. ఎంతకుఁజాలి నిల్చెద వహీనసునా కెదిరించి నీవు నీ
పంతము చూపుమా ధరణిపాలునిపాలికిఁ బోయి యీ తెఱం
గంతయుఁ జెప్పి దైన్యమహిమాన్వితుఁ జేయుము నా నరుంధతీ
కాంతుఁడు నవ్వి యిట్లనియె గాధితనూజునితోడఁ గ్రోధియై. 103
ఆ. ఇపుడు వాకుఁ జేయనేటికి నామహీ, కాంతు నధికదైన్యవంతుఁగా నొ
నర్చినాఁడు మున్ను నాళీకగర్భుండు, మాఱులేనిధృతి హిమాద్రి యతఁడు. 104
క. కప్పురము పుట్టుతోడనె, యొప్పగుపరిమళముఁగూడ నుదయించినయా
చొప్పున నతఁడు జనించిన, యప్పుడె సత్యవ్రతంబు నంకురమయ్యెన్. 105
తే. ఆనరేంద్రునినిత్యమే నరసి చూడ, కనిమిషాధిపుతోడ నే నాడ నింత
వెడఁగు నే నీకు నిట్లు గర్వించి నన్నుఁ, జను నె యొకపక్షములు నుల్లసములంబలుక.
ఉ. నీవును నిన్నుఁ బోలెడుమునిప్రవరుల్పదివేలుఁ గూడి మా
యావనరాశి ముంచి హృదయంబు గలంచి మహోగ్రదుఃఖసం
భావితుఁగాఁగ జేసినను భావములోఁ నణుమాత్రమైన నా
భూవరవంశవర్ధనుఁడు బొంకమి కెంతటికైనఁ జాలెడన్. 107
మ. తనసామ్రాజ్యము వాసినం గులవధూత్యాగంబు వర్తించినం
తనయుం డీల్గిన హీనకృత్యములచేత న్దుర్గతిం బొందినన్.
వనటం గుందిన నానరేంద్రుఁడు మనోవాక్కాయకర్మంబులం
దనృతం బాడిన నాప్రతిజ్ఞ విను విశ్వామిత్ర చిత్రంబుగన్. 108

సీ. పలుమాఱు నను నీవు పరిహాస మొనరింప, మేటివిప్రత్వంబు వీటఁబుచ్చి
తపమును జపమంత్రతంత్రము ల్డిగ నాడి, వేదశాస్త్రాభ్యాసవిధులు విడిచి
సంధ్యాద్యనుష్ఠానసత్క్రియ ల్వోకార్చి, కటివారచీరలు కట్టు టుడిగి
బోడిపై జన్నిదంబులు తెంచి పాఱవైచి, యపవిత్ర మగుబూది నలఁది మేన
గీ. వారుణీపూర్ణమనుజకపాలపాణి, నగుచు ఖరవాహనుఁడ నై యామ్యదిశకు
నభిముఖంబుగ గమనింతు నఖిలజనులు. రోసి తొలఁగంగ భీభత్సరూపమునను. 109

వ. అని యివ్విధంబున నవ్వసిష్ఠమునిశ్రేష్ఠుండు పలుకునిష్ఠురప్రతిజ్ఞావాక్యంబులు విని
రెండవకుసుమకోదండవైరి యగునక్కౌశికుండు నాసికాపుటంబు లదర మహో
త్కట క్రోధమానసుండై యధర్మాలంభవర్జితంబగు సుధర్మామధ్యంబున లేచి నిలు
చుండి పురందరాదిబృందారకబృందంబులు తాపసజనసందోహంబులు మదీయ ప్ర
తిజ్ఞ వినుండని ప్రచండరవంబున ని ట్లనియె. 110

తే. చలము దళముగ నాహరిశ్చంద్రుఁజేరి, భూరికోపాగ్ని కింధనంబుగ నొనర్చి
పెక్కుమాయలు బన్ని గాంభీర్యధైర్య, హీనుఁగావించి బొంకింతుఁబూనియేను. 111

సీ. బొంకింపలేకున్న భుజగకంకణు గూర్చి, యనిలజలాహారి నగుచు దొల్లి
హిమవన్నగంబున నమితహాయనములు, తపము చేసినసుకృతంబులోన
నర్ధాంశ మొసగి లోకైకవిఖ్యాతిగా, దగ జతుర్దశమహాయుగము లవని
బూజ్యసామ్రాజ్యవిస్ఫూర్తుల బొందించి, తదనంతరంబ యాత్రిదివమునను
గీ. రమణ బదునాల్గు మన్వంతరములదాక, నముచిసూదను నర్ధాసనంబునందు
నీరజారాతికోటీరనీరజాక్షు, నీరజాసను లెఱుగంగనిలుపువాడ. 112

వ. అని యివ్విధంబున నమ్మునికుంజరంబు లన్యోన్యభీకరక్రోధాతిరేకంబులం బ్రతి
జ్ఞలు పలుకుటయును. 113

ఉ. కుంభిని దిర్దరం దిరిగె గుమ్మరిసారెవిధంబు నద్రి
కుంభులు మ్రొగ్గె మేరుగిరి గ్రుంగె విరించి మతిం జలించె వి
శ్వంభరుఁ డెంతయు న్వెఱచె సాగరము ల్గలగంగ బాఱె సం
స్తంభితతేజుఁడయ్యె రవి తారలు రాలె మహాద్భుతంబుగన్. 114

తే. తలలు వేయును ముడిచె బృథ్వాకువిభుఁడు, మాన కదరంగ జొచ్చె నంబరతలంబు
దిక్కులన్నియు నొక్కట వ్రక్కలయ్యెఁ, బెల్లు బలిమందిరంబు ఘూర్ణిల్లదొడఁగె.

వ. అప్పుడు సునాసీరుండుప్రకంపితశరీరుండును విన్యస్తభయచేతనుండునువిస్రస్తహస్త
శతకోటియునై పేరోలగంబు చాలించె, బృందారకబృందంబులు డెందంబుల నమం
దంబు లగుభయంబులం బొంది వికలతం బెగడు గుడుచుచు నొక్కరుండుచనిన తెరు

వృషఁ గదిసి వేళాకొక్కరుండు చనక నలుదిక్కులకుం బఱవం దొడంగిరి. మునిజనంబు
లన్యోన్యముఖావలోకనంబులు సేయుచు హాహాకారంబులు చెలంగ జటాభారంబులు
వీడి నేలవాఁకం దూలి యాడ నొండొరుల, గడవ నాలస్యంబువక్కి పదంపడి
వసిష్ఠకౌశికులభాషణరోషపావకవిస్ఫులింగంబు లభంగంబులై చతుర్దశభువనంబులకు
దుర్దాంతతాపంబు నాపాదించు నని యుగ్గడించుచు దిగ్గన నిజాశ్రమంబులకుంజనిరి.
వసిష్ఠకౌశికులు నంతరంగంబులఁ గోపంబులు గాఁపురంబుండఁ దమతమనివాసంబు
లకుం బోయి రంత. 116

చ. ప్రసవితకింశుకప్రముఖపాదపజాలము పాంథలోకమా
నసపరితాప కారణము నందితకోకిలకీరశారికా
ఘసలము చంద నాచలకషస్వదువారము వచ్చెఁ జైత్రమ
య్యసమశరప్రతాపము మహోభ్యుదయంబును బొందుచుండఁగన్. 117

వ. ఇట్టిచైత్రారంభంబున. 118

తే. మహితజహ్నుయజ్ఞదీక్షాసమర్థుఁ డైన, యాహరిశ్చంద్రనరపతి సాంగనియతి
వెలయనొకయజ్ఞ మొనరించి విప్రతతికి, భూరిదానంబు వెట్టె నవారితముగ. 119

వ. వెట్టుటయు దత్సందేశంబు విని యానందించి కపటకృత్యనిత్యతానిపుణుం
డగునగ్గాధినందనుండు. 120

క. నాతలపున కనుకూలం, బైతనరఁగ మిషము గల్గె నానూనృతవా
క్చాతుర్యహరిశ్చంద్ర, క్ష్మాతలపతికడకు నిపుడ చనియెద వేగన్. 121

తే. చని ప్రియంబున నాశీర్వచనము లొసగి, ప్రీతి పుట్టించి యజ్ఞంబుపేరు చెప్పి
యగణితం బైనస్వాపతేయంబు వేడి, తివిరి బొంకింతు మదిలోనిధృతి గలంచి. 122

వ. అని కృతనిశ్చయుం డై. 123

ఉ. బుద్ధ్యరవిందసూతి మునిపుంగవుఁ డప్పుడు యోగ దేవతా
రాధ్యుకు సర్వవత్సకలరాడ్జుసవల్లభకైతవక్రియా
సాధ్యుకు నిర్జరీభవలసత్తనుమధ్యుకు సర్వవస్తు సా
న్నిధ్య్య కయోధ్యకు న్విమలనీరమహాసరయూపరిబోధ్యకున్. 124

వ. చని యప్పురంబు గనుంగొని ప్రవేశించి రాజమందిరద్వారంబు జేరి మహావైభవం
బున జేరోలగం బున్నహరిశ్చంద్రనరేంద్రుం గనుంగొనుటయు నతం డత్యంతసంభ్రమ
వంబున నెదుర్కొని వినయపూర్వకంబుగా నమస్కారంబు లొనర్చి. 125

తే. విమలమతి నర్ఘ్యపాద్యాదివిధుల బూజ, లొసగి యర్హాసనంబుపై నునిచి కేలుఁ
దామరలు మోళిఁజేర్చి ముదంబుపొదల, మునిశిఖామణియిచ్చు దీవనలుగాంచి. 126

# ప్రథమాశ్వాసము.

క. దురితాంధకారనవభా, స్కరబింబ కృపావిధేయ గాధేయ[illegible]పుష్టా
పరమతపోధన నీసరి, పరికింపఁగ లేరు మునులు ప్రాభవచరితా.
తే. బ్రహ్మతోడను సహమించి ప్రాభవమున, మించి ప్రతిసృష్టిచేసి బ్రహ్మీభవించి
విమలతరకీర్తిఁ గాంచినవేదమూర్తి, వెగుచుఁ బొగడొందితివి తాపసాగ్రగణ్య. 128
ఉ. కౌశికమౌనివర్య కడఁగ న్నను ధన్యునిఁ జేయఁ గోరి వేం
చేసితి రేఁగృతార్థమతిఁ జెందితి సాంగమహాధ్వరక్రియా
కౌశలపుణ్యసంపదలు గాంచితి మించితి రాజకోటిలో
వాసికి నెక్కితిం దగినవాంఛిత మెయ్యది వేఁడుఁ డిచ్చెదన్. 129
వ. అనిన విశ్వంభరాకళత్రునకు విశ్వామిత్రుం డి ట్లనియె. 130
క. నరవరరూపముఁ దాల్చిన, పురుహూతమహీరుహమవు పురుడింపఁగ నీ
సరి లేరు వనధిపరివృత, ధరణీచక్రంబులో వదాన్యులు ధన్యుల్. 131
క. వేలుపుటావును గుమ్మెండు, బా లడిగెడురీతి ధరణిపాల యశశ్శ్రీ
లోల యొకయల్పదానము, వాలాయముగాఁగ నడుగ వచ్చితి నిన్నున్. 132
వ. అది యెయ్యది యనిన.
క. సితకరమౌళికిఁ బ్రియముగఁ, గ్రతు వొక్కటి యాచరింపఁ గడఁగితి నీ వా
క్రతుతంత్రము సాంగంబుగ, హితమతి నీడేర్పవలయు నినకులతిలకా. 134
క. జనుఁడు కరి నెక్కి దేహం, బనయము నిక్కించి రత్న మంబరమునకై
చన విడిచినంతప్రోవిడు, ధన మిచ్చిన నధ్వరము యథావిధి నడచున్. 135
వ. అనుటయు నారాజన్యుం డతిధన్యుండ నైతి నన్ను మీ రడిగిన విత్తంబు చిత్తంబు
గంజిల్లఁ ద్వరితంబు యిచ్చెదఁ గొనుండనిన నగాధినందనుండు శరేకంపంబుచేసి మహై
శ్వర్యంబును బొంది యీమహా యిస్యహానుభావుని యనూననానప్రభావం బింతయొప్పు
నే యని వక్కాణించుచు నమ్మహీవల్లభున కిట్లనియె. 136
తే. క్షోణినాయక నీచునశ్శుద్ధిఁ దెలియ, వలసి యడిగితిఁ గాక నీవంటిదాత
నిండువేడ్కఁ బ్రసన్నుఁడై యుండ మాకు, నిట్టిసమయంబులను ధనం బేమిబ్రాతి.
తే. చాల నక్కఱ యొదవినవేళ వచ్చి, పుచ్చుకొనియెద నంచు నీ విచ్చువిత్త
మింకమాఱుత్తరంబు నీ వేమిపల్కి, నను సదాశివునాన భూనాథతిలక. 138
వ. నీకుం జిరాయుర్నిరామయంబులు నభిరామక్షేమంబు లగుఁ బోయి వచ్చెద నని య
చ్చోటు ముహూర్తమాత్రంబునుం దడయక నిజాశ్రమంబునకుం జనియె నంత
నమ్మహీవల్లభుండు నల్లఁబునఁ బెల్లు వితర్కించి. 130

తే. విత్త మిప్పుడు గొని చన్నఁ జిత్తమున వి, చారదూరుఁడనై కడు సమ్మదమున
నుండెఁ గాఁ గల్గు నప్పు డైనను నిచె నతఁడు, క్రోధమతి నెట్టితటి వేఁడు నోధనంబు.

క. వనరుహనాభ్యున కైనను, వనరుహలోచనున కైన వనరుహరిపుజూ
టున కైనఁ దరము గాదు, మ్మునివరుకోపాగ్ని కెదిరి మొనఁ గట్టంగన్. 141

వ. అని మనంబునం దలంచుచు నిరంతరపరిపాలితమహీమండలుండై యుండె నంత
నక్కడ నితాంతకపటక్రియాధౌరేయుం డగు నగ్గాధేయుండు వెండియు నొక్క
కపటమతంబు విచారించి యతిత్వరితంబున. 142

క. నూతనజవసత్త్వంబుల, నూతనతనువర్ణములను నూతనగతులన్
నూతనభంగుల నొప్పెడి, కైతవమృగఖగచయంబుఁ గల్పించె నృపా. 143

వ. ఇట్లనల్పకుహనాచాతుర్యంబునం గల్పించి పంపిన మృగఖగవ్రాతంబులు గణ
నాతీతంబులై యెక్కడఁ జూచినం దామయైయుక్కుమిగిలి యొక్కుమొగిం బిక్కు
టిల్లి పెక్కుతెఱంగుల నత్యంతభయంకరకృత్యంబులం జెలంగి ఫలితంబు లగు కల
మాదిసస్యంబులు మేసి పడఁద్రొసి మట్టిమల్లాడియు నారామంబుల నిక్షుదండంబు
లు ఖండంబులు గావించియు, గదళీతరుషండంబులు విదళించియు, మల్లికామాధవీ
ద్రాక్షాదిలతావితానంబులు ద్రెంచియుఁ, గొమ్మలఁ గోరాడి తటాకంబులు పటా
పంచలు గావించియుఁ గ్రిమ్మిరియందంద కెందమ్మికొలంకులఁ గలంచి కాటియపెట్టి
యు, గోష్ఠంబుల గోవత్సనికాయంబుల నపాయంబునొందించుచు జనపదంబులమను
ష్యులం బొదివి చదిపియు, బహువిధంబులఁ గోలాహలంబు సేయుటయు హాలాహల
విషజ్వాలంబులచేత దేవదానవానీకంబులంబోలె ననేకంబులు మహిప్రజాసంఘంబు
లహీనభయంబుల మొఱలిడుచుం జని హరిశ్చంద్రనరేంద్రులఁ గనుంగొని సర్వాంగ
సంగతోర్వీమండలంబు లగు దండప్రణామంబు లాచరించి మస్తకన్యస్తహస్తారవిం
దులై యి ట్లనిరి. 144

సీ. సదయుండవై నేఁటితుదదాఁక మము నీవు, పెంపుదీపింపఁ బాలింపుచుండ
నీకీతిబాధల నెన్నఁడు పొందక, నీచల్లదనమున నిండువేడ్కఁ
దల్లిదండ్రులయొద్ద తనయులగతి మాకు, మఱుఁగుపిందెలకీతి నెఱి వహించి
భవనంబులను వెండి పైఁడియుఁ దడఁబడ, గుఱిలేనిపాఁడియుఁ గూడు గలిగి 145

గీ. క్రీడమై నెండకన్నును నీడకన్ను, నెఱుఁగ కన్నలఁ దమ్ముల హితుల సుతులఁ
గూడి సుఖమున్నవారము కోర్కు లొదవ, సత్యసల్లాప యోహరిశ్చంద్రభూప.

ఉ. జారులుఁ జోరులుం న్విమలసత్యవిదూరులుఁ గ్రూరులు న్ధరా
చారులు లేరు యాచకులు సాధుల బాధ లొనర్పభీకరా

కారులు లేరు లేరు మతికల్మషచిత్తులు మత్తులు న్ధరి
త్రీరమణాగ్రగణ్య వివరింప భవత్పరిపాలితావనిన్. 146

క. క్షితి సకలసస్యవతియై, యతిసాంద్రంబుగ ఫలించు నపమృత్యువు లె
ట్టితఱిం బ్రభవింపవు కడు, హితముగ నెల మూడువాన లెలమిం గురియున్, 147

చ. చిరతరదేవతాగృహవిశేషమహోత్సవకృత్యము ల్వరం
బరలఁగ సాఁగు నెల్లపుడుఁ బల్లవపుష్పఫలాటుసత్ఫలో
త్కరములఁ బొల్చుఁ బాదపనికాయము లింకవు నిర్మలాంబువుల్
సరసుల నేఱులం బిదుకుఁ జాలఁగ గోవులు దుగ్ధపూరముల్.

సీ. ఇట్లు వర్తింపంగ నిప్పుడు కొన్నాళ్ళ గోలె భరింపంగఁ గొలఁది కాక
బ్రహ్మకైనను గణింపఁగఁ రాని పెక్కు, వన్నెలమెకంబులు బుల్లులును నేల
యీనినయట్లు కోటానకోటులు గూడి, జారుణతరనినాదములు చెలఁగఁ
జెలువులు తోఁటలు చేలు గాలువలును, నే పెల్లఁ దూలఁగ రూపు మాపి
గీ. యాలమందలఁ గొందలం బందఁ, జనపదంబుల మనుజులఁ జంపుచుండుఁ
గదల మెదలఁగ శంకించి కాఁపురములు, విడిచి వచ్చితి మోపృథివీకళత్ర. 149

క. ఈమృగబాధలు మాన్పి ద, యామతి మముఁ బ్రోవ వలయు హాలహలాగ్ని
స్తోమభయ ముడిపి యమరులఁ, బ్రేమ న్రక్షించినట్టిమృడునివిధమునన్. 150

చ. అనినఁ గృపారసంబు హృదయాంబురుహంబున సంజనింపన
య్యనకులరత్న మిట్లను మహీప్రజ నేఁ దనియంగఁ జూడ మీ
కనయము నింతమాత్రమునకై భయమందుచు నుండ నేల యీ
ఘనమృగభీతి మాన్చెద సుఖస్థితి మీ కొడఁగూడునట్లుగన్. 151

వ. అని యభయప్రదానం బొసంగి యమ్మహీప్రజాసందోహంబుల వీడ్కొలిపె నంత.

ఉ. పంకజగర్భసీమ మధుపంబులు వృక్షములందుఁ బక్షులుం
బంకరుహాక్షులందు రతిభర్తయుఁ జేరి వసింప నొప్పె న
ప్పంకరు డాప్తుఁ డస్తగిరిపైఁ గడుమందము లైనరశ్ములన్
మంకెనపువ్వుగుత్తిక్రియ మండలమంతయుఁ గుంపు లీడఁగన్. 153

చ. తరుణవయస్కుఁ డైనహిమధాముని మీఁద మనంబు నిల్పి యం
బరసతి దన్ను వృద్ధుఁడని మానఁ దలఁచిన జాల సిగ్గునం
ద్వరితగతి న్మునింగినవిధంబునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకె భా
స్కరుఁడు గుముద్వతీతతి వగంగ వికాసకళామిషంబునన్. 154

క. అనుపమతేజోనిధి యగు, దినవాథునిమహిమ రాశిదేరినచందం
బున సాంధ్యరాగదీప్తితి, గనుపట్టె నవీనకింశుకప్రసవరుచిన్. 155

క. హేలాగతి విరహులపై, నోలి న్రతివల్లభుండు ప్రయోగించుమహా
నీలోత్పలశరజాలము, పోలికఁ దిమిరంబు దిశల బొదిఁబొరిఁ బర్వెన్. 156

క. మృగనాభీపరిస్రావిత, నగభిన్మణిపేటికరణి నలినభవాండం
బు గనుంగొన కనుపట్టెను, మిగుల దపస్సముదయంబు మెండుకొనంగన్. 157

తే. యామినీచంద్రవదన వియత్సురేంద్ర, నీలమణిపాత్రలోపల నించినట్టి
విమలఘనసారశకలసంఘము లనంగ, బ్రబలు నక్షత్రవితతు లంబరమునందు. 158

వ. అంత.

ఉ. శంకరమౌళిభూషణము సారసమిత్రునితోడిజోడు మీ
నాంకుని మేనమామ కలశాంబుధికూరిమిపట్టి యామినీ
పంకరుహాయతాక్షి ప్రియభర్త వియద్గృహమధ్యదీప మే
ణాంకుఁడు గాన నయ్యె నుదయాద్రిపయిం దిమిరేభసింహమై. 160

క. నిండారుకళల హిమకర, మండల మొప్పారె నయనమహా మొదవగ నా
ఖండలదిక్సతిమౌక్తిక, కుండల మన విపులకాంతి కొమరు దలిర్పన్. 161

శా. కాశాకాశధునీతరంగచయనికాశద్యుతి న్దట్టమై
కాసెం గౌముది చక్కగా సకలదిగ్భాగంబుల న్మిన్నుముం
దేసెం జాంధజనవ్రజంబులపయిన్ జృంభించి లీలాధను
ర్వైశారద్యము నివ్వటిల్లఁ బ్రసవాస్త్రశ్రేణులం జెల్లుగన్. 162

ఉ. వారణ లేక యొక్కమొగి వాంఛలు దీరగ సాంద్రచంద్రికా
పారణ సేయుచుం బొదలె బాయనివేడ్క జకోరవారముల్
కైరవబాంధవోపలనికాయము లోలి స్రవించె నేలపై
జారులు చోరులుం గడువిచారము నొందిరి పొంగె వారిధుల్. 163

వ. ఆసమయంబున హరిశ్చంద్రధరణీవల్లభుండు తత్కాలోచితకృత్యంబులు నిర్వర్తించి నిద్రింపం దొడంగె నంత.

తే. కామకేళిపరిశ్రాంతి గన్ను మోడ్చి, వేడ్కనిద్రించువిటవిటీవితతి బెదర
గుక్కుటంబులు కుక్కురోకో యటంచు, గూయజొచ్చె గఠోరనిర్ఘోషణముల.

సీ. చంద్రుఁ డద్దపుబిళ్ళచందానఁ బశ్చిమ, దిశ నిల్చె కాంతి మందీభవించి
యొక్కటొక్కటి చిక్కె జుక్కలాకసమున, వాడకాడను గడునల్పరుచుల

విటపివిటపతతులపై విషమాయుధుఁడు రోష, మెడలి బాణాసన మెక్కుడించె
వనముల సింధుజీననముల జెలరేఁగె, కలయంగ బహుపక్షికలకలములు

సీ. కాంతు లుడివోయె గృహదీపకళికలెల్ల, జక్రదంపతు లలరె నిర్వక్రలీల
నంబుజంబులు విరిసె రోలంబములకు, విందులొనరించె బ్రాభాతవేళయందు. 166

మ. ధరణీనిర్జరరాజి మ్రొక్క శతపత్రంబు ల్విజృంభించి ప
ట్చరణశ్రేణుల కెల్ల నామెతలు పెట్టం జక్రవాకావళుల్
పరమానందము బొంద బింబరుచి బింబశ్రీ విడంబింప నం
బరరత్నం బుదయించె జంభరిపుహర్మ్యస్వర్ణకుంభాకృతిన్. 167

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డటమీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయును. 682

మ. అమరానోకహదానదానవవిపక్షాస్త్రాంఘ్రిసేవాకళా
కమనీయస్థిరభావభావభవరాకాచంద్రనీకాశకా
శచరాళీప్రతిమాననిర్మలయశస్సౌభాగ్యభాగ్యప్రభా
వమురారాతి సమానమానవిభవవ్యాపార పాథోనిధీ. 169

క. మందారదానగుణ సం, క్రందనసమశక్తివరుణకౌబేరదిశా
సౌందర్యయువతివిలసిత, చందనచర్చాయమానసదమలకీర్తి. 170

పంచచామరము. వసుంధరాధరేంద్రధైర్య వారిజాసనానవ నో
జ సర్వభూతలేశమాన్యచారువర్తనా నటత్
ప్రసూనబాణవైరివక్త్రాళిభాగవిస్ఫురత్సు
పర్వసింధువీచిజారతుల్యవాగ్వినిర్భరార్భటీ. 171

గద్యము.

ఇది శ్రీచదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర
సకలసుకవి జనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయ
వివేకవిద్యాలంకార శంకరకవి నామధేయ ప్రణీ
తం బయినహరిశ్చంద్రోపాఖ్యానం బగు
మహాప్రబంధంబు నందు
ప్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.



లలితలోచనాబ్జ వి
శాలయశోరుచినికాయసదమలసుగుణ
పాళీసంవాసిత ది
గ్జాలా ధమ్మిల్ల మంత్రిబాచయయెల్లా. 1

వ. ఆకర్ణింపుము. పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె నట్లు భానుమంతుండు ప్రభుసామంతంబునం గనుపట్టుటయు నటమున్న మేల్కాని యవ్వసుంధరావల్లభుండు సంధ్యానుష్ఠానంబులు నిర్వర్తించి మృగయావిహారంబునం జనువాఁడై పురంబునం జాటింపించిన. 2

తే. వేఁటమాణిక్య ముపకారి వెండిగుండు, వాయువేగంబు వెఱపుమృగాయ గరుణఁ
డడవిపోతులరాజు చిత్రాంగి బొండు, మల్లె యన నొప్పు పెక్కునామములవాని.

మ. బలుకోఱ ల్తనుమధ్యము ల్మహదురోభాగంబులుం బెద్దమూ
తులునుం గల్గి మృగేంద్రడింభములకుం దుల్యంబులై నట్టి జా
గిలపుంగుక్కల హేమశృంఖలముల న్గీలించి కోటానకో
టుల వేగం గొని వచ్చి రాటవికు లాటోపంబు వాటిల్లఁగన్. 4

చ. గొలుసులఁ బట్టి లుబ్ధకు లమంతశక్తిఁ గుదించి నిల్వఁగా
బలువిడి సంఘుగ్రీల న్వాయలు పల్మఱుఁ దివ్వుచు వీఁకమై నభ
స్థలిఁ గబళింపఁ బాఱెడువిధంబున మోరలు మీఁది కెత్తి కు
క్కలు ఘుఘుఘాక్రియాధ్వనుల గాఢతరోద్ధతి నించె దిక్కులన్. 5

సీ. కఱకు లైనట్టి జుంజుఱువెండ్రుకలుఁ గొల్లు, గవియు మేనులు గెంపుఁగన్నుఁగవయుఁ
గుఱుచకేవులు బొజ్జలు కురువిందపూసపేరులు నొంటియట్టుచెప్పులును గల్గి
వలలును బెట్టుకోఁవులుఁ బెద్దయురులును, దెరలును బోనులు దీపములును
వసులు గసులు పోగువాలు వెండ్రుకత్రాళ్ళు, బలువిండ్లు నమ్ములు బల్లెములును

గీ. బందివాఘులు వీఁటెలు బట్టెసములుఁ, బంటుక్రోలలు నాదిగా బహువిధముల
సాధనమ్ములు ధరియించి శబరపతులు, వచ్చి రాఖేటకక్రియావ్యసనరతులు. 6

సీ. వ్యాఘ్రంబు నైనను శిఘ్రంబ తరిమిడి, పొడిచెద మీటెల బూఫు చెడక
శరభంబు నైనను సరభసంబున డాసి, పదము లెన్మిదియుఁ దుంచెదము పొదివి
సింగంబు నైనను భంగంబు నొందించి, జీవంబుతోన, తెచ్చెదము పట్టి
భేరుండమును నైన నోరెండ నీయక, నలి చేసెదము చాల బలిమి వెలయ

గీ. సాహసంబున మత్తగజంబు నైనఁ, గెగలి తొండంబు తెగ నఱికెదము దేవ
నేఁడు చూడుము మావేఁట నేర్పులెల్ల, ననుచుఁ బంతంబు లాడికొందఱాడిరపుడు.

మ. తలచుట్టుల్ జడచొళ్ళెయంబులును నీల్గట్టీలుఁ జేకట్టుదం
డెలు వాకట్టులు ముప్పిడు ల్మేకముల న్డాకోల్పువశ్యంపు చుం
దులునుం జోఁపుడుఁగోలలుం గుఱుచచేదుస్లు న్ననుగ్రంబులై
చెలువార న్భటకోటి వచ్చె మృగయాశృంగార మేపారఁగన్. 8

వ. ఇవ్విధంబున నపరమితకిరాతవ్రాతంబులు సముద్భటభటానీకంబులుఁ జనుదేర న
మ్మానవాధీశ్వరుండు దానును మృగయావిహారసముచితశృంగారవేషం బంగీకరించి
పుత్రికళత్రామాత్యసమేతంబుగా. 9

చ. ధనదుని పుష్పకంబునకుఁ దానెనవచ్చు నటంచు లోకముల్
వినుతి యొనర్ప బొల్పెసఁగి విద్రుమమౌక్తికవజ్రనీలకాం
చనమయము న్సువేగహయసంఘటితంబును నైనతేరు సొం
పొనరఁగ నెక్కి మిక్కిలిసముత్సుకతం బురబాహ్యసీమలన్. 10

క. మాతలి దలఁపింపం గల, సూతుఁడు తనరథము గడపుచో బహుగతులం
చాతుర్యంబులు చూపఁగ, నాతని నేర్పులకుఁ జాల హర్షము పొదలన్. 11

వ. కౌబేరదిశాముఖుం డైకొంతదవ్వు చని యంతట. 12

మ. కనియె న్భూతలనాథుఁ డాటవికరాకాచంద్రబింబాననా
జననితోచితపుండరీకగవయ స్తంబేరమాఖేటమున్
ఘనశృంగాటము నర్మదోర్మిపటలీగర్జద్దిశాపేటమున్
వినుతానేకనికుంజకూటము మహావింధ్యాటవీవాటమున్. 13

ఉ. మారుతపూర్ణకీచకసమాజరవంబులు నర్మదానదీ
నీరజభృంగగానము ధ్వనిస్వనవైఖరితోడఁ గూడి యిం
పొంగఁగ సద్ధ్వనీనినివహంబులకున్ శ్రవణోత్సవక్రియా
గౌరవము ఘటించు నొడికంబుగ వింధ్యవనాంతరంబులన్. 14

వ. వెండియుఁ బుండరీక శుండాల గవయ గండభేరుండ వంశ శరభ సారంగ భూదార
భల్లూక లులాయ ప్రముఖనిఖిలమృగనికాయభయంకరానూనధ్వానబధిరితకకుబంత
దంతావళక్షుణ్ణకుహరాంతరాళంబును తింత్రిణీతమాలతాళవటకుటజకపిత్థాశ్వత్థకోవి
దారసింధువారకమందారపిచుమందచందన మాకందమాతులుంగలవంగ జంబుజంబీర
వకుళ క్రముకపనసబదరీమధూకమాధవీకింశుకశింశుపాశోకాది నానావిధపాదప
శాఖాశిఖానిహారమాణమయూరకోకిలకీరశారికా కలవింకకపోతఖంజరీటకాకఘూ
కాద్యనేకశకుంతసంతతిప్రబలవినాదమేదురంబును నైయరుణగభస్తి కిరణపరంపరలకు
బ్రవేశింప శక్యంబుగాక కరంబు సాంద్రంబయి యిసుక చల్లినం గ్రింద రాలక యి
మలుగవియుచుం బసరుడాలు విరక్ష్మావసుంధరాధరపరిసరారణ్యంబు దఱిసి మృగం
బులు మెలంగుప్రక్కల నుసి ముల్లుతాకువేయించి పొంగు వారించి వలలును దెరలు నె
త్తించి బోనులు కీసుంబులు నొడ్డించి. 15

మ. ఘనజాలాసన మెక్కు వెట్టి పటుదోర్గర్వంబు బఖర్వంబుగా
వనధిధ్వానముకంటె మించుగుణనిస్వానంబు గావించి యు
బ్బున నేసెన్ హరిశ్చంద్రరాజు గతతుల్యంఖానుపుంఖంబుగా
వనజాతాప్తకులాగ్రగణ్యుఁడు మృగవ్రాతంబులం గూలఁగన్. 16

వ. ఇవ్విధంబున నత్యంతభయంకరము లగుశరంబులం బఱపినం గరంబు భీతిల్లి యెల్ల
మృగంబులు తల్లడిల్లి పెల్లాఱఁగ నట్టియెడ. 17

తే. మేదినీనాథశరహతమృగసమూహ, ఘనకళేబరజనితరక్తప్రవాహ
వితతి ప్రవహించె గైరికక్షితిధరేంద్ర, సారసంభూతనిర్ఝరచయము బోలె. 18

క. అంతట మృగయాకేళి ని, రంతరపరితృప్తి నొంది యవనీశుఁ డతి
శ్రాంతుండై సెలవిచ్చినఁ, బంతమునఁ గిరాతపతులు భటసంతతులున్. 19

క. ఉరువడిఁ బెల్లార్చుచుఁ గే, సరిశాబకసదృశరూపజవసత్వభయం
కరము లగువేఁటకుక్కల, బరి విడిచిన నవి వధించె బహుమృగతతులన్. 20

వ. తదనంతరంబ వారును బదచిహ్నంబులవెంబడిం జని నికుంజంబులు దూఱి పొంచి
కొనియును దీమంబుల నొడ్డి యేమఱుపాటునం బొదివియుఁ దనివి సనక మఱియును.

తే. సాళువము గిడ్డు లగుడు వేసడము కురుజు, బాజు జలకపై జాలియ వైల యణుజు
నోరణంబును నాదిగాఁ జేరవడిన, వేఁటడేగల గిఱికొన విడిచి కడిమి. 22

తే. గ్రద్దయును తాకి కొంజును గొక్కెరయును, గూబపార్శ్వంబు బెగ్గురుకొక్కెరయును
గొంగ లావుక యాడేలు గువ్వ వెలిచ, పొట్టపిట్టయు ననగల్లుపులుగుగముల. 23

క. తూలించి విపిన మెల్లను, గాలించి తదస్రివారిఁ గ్రవ్యచయంబుల్
వేలించి తనిసి వేఁటలు, చాలించి నరేశ్వరునకు సమ్ముఖ మొసఁగన్. 24

క. చమరీవాలములు గురం, గమదము గజదంతములును గరికిటిసంజా
తము లగుముక్తాఫలములు, నమితంబుగఁ దెచ్చి యిచ్చి రతివినయమునన్. 25

వ. ఇచ్చిన నవి యన్నియుం గైకొని ప్రియంబునం జంద్రమతికి సమర్పించి యవ్వేఁట
కాఁడులకుఁ బసదనం బొసంగి యబ్జసరుహాప్తకులుండు సరసవివేకరతుండును, నత్యంత
హితుండును నగుసత్యకీర్తిం గనుంగొని. 26

తే. అనఘవర్తన విను మృగయావిహార, కారణంబున మాకు మేతేర వలసె
మనకు నీరాక సఫల మౌమార్గ మొకటి, తెలియఁజెప్పవె సప్తదస్థితిఘటిల్ల. 27

లయగ్రాహి. అల్లదె సదాగతినటల్లహరి వైభవ్యరిఫణ్షల్లమకుటప్రసవవల్లరి సముద్య
త్ఫుల్లకుముదాబ్జనవహల్లకవసద్భ్రమర ముల్లమునఁ గౌతుకము వెల్లగొనఁ గన్నుల్
చల్లఁగ బయోధిప్రియవల్లభఁ గనుంగొనుము కొల్లలుగ ముక్తిరమ నెల్లపుడు మజ్జ
త్సల్లలితచిత్తులకు నెల్లొసగె జహ్నుమునిపల్లజసుతోరుతటి నల్లచద లేటిన్. 28

శా. ఈతీరంబున నిమ్మమై దప ముదాత్తప్రీతి గావించుభా
స్వత్తేజోగమణీయు నంబురుహభూసంకాశు నంహాపమో
ద్వృత్తిప్రశ్వాసనుం బ్రసన్నగుణగంభీరు న్వసిష్ఠు న్దయా
యత్తస్వాంతు నరుంధతీవిభు సపర్యాకాంక్షఁ జూడంవగున్. 29

క. అని నృపతి దండనాథుని, యనుమతమున నరిగి కాంచె ననురాగము నె
మ్మనమున బెనగొనుచుండఁగ, ననుపమము వసిష్ఠచారునియాశ్రమ మెదురన్. 30

వ. కని తత్ప్రదేశంబున. 31

మహాస్రగ్ధర. వరరుద్రాక్షపరిభూషాపరిజరుచిరతను న్వ్యాఘ్రచర్మోత్తరీయుం
బరమధ్యానాంతగంగాప్రణిహితశివునిన్ బద్ధపద్మాసనస్థున్
గర విన్యస్తాక్షదామున్ గనదరుణజటాకల్పు భస్మాంగరాగున్
జగకాలోపార్జితాతిస్థిరవిపులతపశ్శ్రీగరిష్ఠు న్వసిష్ఠున్. 32

వ. కనుంగొని ప్రముదితస్వాంతుండై యమ్మహీకాంతుండు నిజకిరీటకోటిసంఘటితహరి
నీలరోలంబంబు ప్రదీయ పదజారవిందంబుల జూసింప సర్వాంగాలింగితమహీమండ
లుండై దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చినం గనుంగొని య
మ్మునివల్లభుం డిట్లనియె. 33

చ. అపగతబుద్ధి నింత మృగయావ్యసనంబున [illegible] నల్పగా
నృపులకు నీతి గాదు ధరణీశ్వర! భావ్యము నీవు భీకరా

ఉ. అల్లదె పైఁడియిఱ్ఱి మదమారఁగఁ జూడుము దానిఁగూడ నీ
వెల్లవిధంబులన్ రథ మహీనజవంబునఁ దోలుమన్న భూ
వల్లభునాజ్ఞ సూతుఁ డనివార్యగతిం దగఁ బోలె వాయు వే
గోల్లసితాశ్వయుక్తమయి యొప్పగు నయ్యరదంబుఁ జయ్యనన్. 46

వ. ఇవ్విధంబున రథంబు తోలించి మహీనాయకుండు డాయం బోవుటయు నమ్మాయా
కురంగంబు నిరాయాసంబున 47

సీ. బంధనం బెడలి భూభాగంబుఁ జేరి యి, చ్చాలీల విహరించు గాలియిఱ్ఱి
కుందేటితోఁ బొత్తు గూడక వచ్చిన, యుడురాజబింబంబునడిమియిఱ్ఱి
వీరభద్రునికృప వేఁడియు మద్భాగ్య, మైనదక్షమఖంబులోనియిఱ్ఱి
కుధగనంబున వేఁడికొన విసర్జించిన, చేతోభవారాతిచేతియిఱ్ఱి
గీ. ననుకరించుచు మిగులఁ బెంపగ్గలింప, మంచిమురువును బరువును మదము ముదము
పొదలఁ గనుగొనువారి కింపులు ఘటిల్ల, నల్లనల్లన నడయాడె నభినవముగ. 48

సీ. చేయాక కుప్పించి చివ్వున దాఁటుచుఁ, గొమ్ములచే బయ ల్చిమ్ముకొనుచు
చిత్తరంబులు గాఁగ బేరెముల్వాఱుచు, మరిగి నక్కైవడి మలసికొనుచుఁ
గసవుపోచలు కసిగాట్లుగాఁ గొఱుకుచు, వివృతాస్యమున జాఱ విడుచుకొనుచు
రిక్కరిక్కనఁ దోఁక ద్రిప్పి జాడించుచు, ఖురపుటంబులఁ దల గోఁకుకొనుచు
గీ. నిగిడి పాఱుచు నంతంత నిలువఁబడుచు, నొడలి కండూతికై చెట్ల నొరసికొనుచు
నుదరి యొక్కెడ మిన్నక బెదరిపడుచుఁ, గువలయేశ్వరు నలయించికొనుచు నరిగె.

వ. ఇట్లరిగి విశ్వామిత్రునియాశ్రమంబు ప్రవేశించి మొఱంగి చనం జూచు దానితెఱం
గెఱింగి రోషించి కనుంగవఁ గెంపు జనియింప నాత్రిశంకుసనందనుండు విశంకటభుజా
బలంబున శరాసనం బెక్కువెట్టి మౌర్వీరవం బొనర్చి దర్వీకరభీకరం బగు శరంబు
దొడఁగి తెగనిండం దిగిచి దృష్టిముష్టిస్థానయుండై యేయుటయు నయ్యేటునం దూ
లక వాతూలజవంబున నక్కురంగంబు కౌశికసమ్ముఖంబునకు జనియదృశ్యం బయ్యె.
విశ్వంభరావల్లభుండు నాయిఱ్ఱిపసలంబడి వెత్తిశ్రమంబున నవ్వనంబెల్లఁ ద్రిమ్మరినవాఁడు
గావున నితాంతనిబిడాతపాక్రాంతుండును క్షుత్పిపాసాక్రాంతుండును నై యమంద
శ్రమంబును బొంది శీతలజలాన్వేషణాభిలాషియై చని చని ముందట. 50

సీ. మందారజంబీరమాతులుంగలవంగ, కేతకీచంపకకింశుకముల
మాకందచందనమాలూరఖర్జూర, కోవిదారగణధూకకురువకముల
జంబూకదంబాశ్వత్థనింబతాలరసాల, తాలతమాలహింతాలములను
తింత్రిణీపాటలతిలకామలకదేవ, దారుపున్నాగకద్రూపకములను

గీ. మఱియుఁ దక్షిణపావనక్షోణిరుహముల, బహువిధంబులపూఁదీగెపందిరులను
బ్రబలి పిలసిల్లుకౌశికాశ్రమముఁ గాంచె, నల్ల మలకంగ మేదినీవల్లభుండు. 61
తే. మానవాధీశ యీపుణ్యకాననముఁ, దోయదశ్యామమునిహోమధూమవితతి
యంబరంబున నధ్వరవం బైన నల్ల, పటుజగజంపు గొడుగువిభ్రమము నొసగు. 52
శా. పంకేజనూతికైనఁ దలఁపం గాదు నద్భుత మావపిల్ల నే
శంకాకర్షాగ్రిణ్య విను మాగమశాస్త్రపురాణము ల్నిరా
తంకమునం బఠించు నెదఁ దాపసపుత్రులకుం గవుల్గొగిన్
వంకలు దీర్చి చెప్ప గొరవంకలుఁ జిల్కలు నవ్వనంబునన్. 53
సీ. కడుఁ బ్రీతి జన్నిచ్చుబడిపప్పి తిరిగాడు, లేడిపిల్లలకు బాలెంతపులులు
కంఠీరవంబులు గంధసింధురముల, తోడ మాటికి జెలులాడుచుండు
జక్కైలక్రాలములతో జెలువులు వాటించు, బ్రియమున బావురు బిల్లిగములు
నీలకంఠంబులు లాలనం బొదవ బా, టించుఁ గుండలీనడింభకముల
గీ. గొండనొక్కఁడె యుపిండును గోఁతిగమియు, సంతసము లుండు బోరపొచ్చె మింతలేక
సాత్వికంబులఁ బక్షులు గెళిసల్పు, గాధిపుత్రతపోవనవీథియందు. 54
వ. ఇట్టి విచిత్రంబులకు బాత్రం బగువిశ్వామిత్రతపోవనక్షేత్రంబు నిరీక్షించి తన
ధ్యాంతరంబున. 55
సీ. సంఫుల్లహల్లకజలజాతమకరంద, పానలోలాళినీగానరవము
వీచిడోలాకేళివిశ్రాంతవిలసిత, చక్రవాకమరాళసముదయంబు
నలితకేళీసక్తసంయమిబాలికా, స్తనకుంకుమారుణస్వచ్ఛజలము
పరివిమలశశికాంతపాషాణకల్పిత, సోపానమార్గసంశోభితంబు
గీ. పవనకంపితతీరభూజాగవిటపి, పుష్పగుచ్ఛపరాగవిభూషితంబు
మకరకచ్ఛపజలజంతునికరయుతము, భూవిభుఁడు గాంచె నొక్కసరోవరంబు. 56
తే. కాంచి మానవనాథుఁ డంగనయు సుతుడు, దాను దత్తీరభూమి రథంబు డిగ్గి
దండనాథుండు కరము కైదండ యొసగ, సరసి దఱిసి వినిర్మలజలముగ్రోలి. 57
వ. కృతావగాహనం బై తత్సమీపప్రదేశంబునఁ బ్రవేశించుపుష్పితమాధవీలతామండ
పాంతరంబునఁ గిసలయతల్పంబున జంద్రమతీసతీలలామంబు మ్మృదూరుపీఠం బుపధా
నంబుగా శయనించి బాలరసాలపల్లవపరికల్పితతాళవృంతంబున శీతలమందవాతూ
లంబు సోఁక నడిసి విసర దండనాయకు వదనారవిందం బవలోకించి. 58
కం. నవమల బహుపుష్పలతా, సవనవసన్నసలగాసష్ఠాంకారములన్
మున మొదవించుచున్నవి, యివి యేమునియాశ్రమంబొ తెలుపఁగవలయున్. 59

తే. అనుచు పలుకుచు నుండంగ నచటి కపుడు, కుశసమిత్పుష్పఫలముల గోయ నొక్క
ఋషికుమారుండు వచ్చి మహీశుతోడ, జెప్పెనిది కౌశికునివనక్షేత్రిమనుచు. 60

ఉ. చెప్పిన మేదినీరమణశేఖరు డుల్లమునందు నెంతయుం
ముప్పిరిగొన్నభీతి మునిముఖ్యుడు గౌశికు డేమి సేయునో
యప్పరమేశుఁడే యెఱుఁగు నంతయు నిక్కడఁ బాసి వేగ నే
చొప్పునఁ బోద మింక మనశుద్ధి యెఱుంగక యుండ నాతఁడున్. 61

క. ఎక్కడి హేమకురంగం, బెక్కడిమృగయావిహార మెక్కడివిపినం
బిక్కడి కేటికి వచ్చితి, మక్కట మిక్కిలి ప్రమాద మయ్యె న్మనకున్. 62

తే. నవవిరించి యరుంధతీనాయకుండు, మఱచి తప్పియు గాధికుమారువనము
చొరకు మీ వని చెప్పె విశుద్ధబుద్ధిఁ, గోరి నామీఁదివాత్సల్యగుణము పొదల. 63

క. ఇచ్చోట దడయ వలవదు, చెచ్చెరఁ బురి కేఁగుమనుచుఁ జెప్పిన నేలా
వచ్చితిని మృగము వెంబడి, వచ్చెనె విధి గడవ నెంతవారలకైనన్. 64

తే. ఏమిచేయువార మెక్కడి కేగుద, మేది కార్యచింత యింక మనకు
మిగుల మోస మయ్యె మృగయావిహారైక, కారణమున నేమి గాఁగఁ గలదొ. 65

ఉ. ఆమునిసార్వభౌమునిదృగంతము లించుక జేవురించినన్
హేమగిరీంద్ర మైన ధృతి నేపఱి బిట్టు చలించు మ్రుగ్గ ది
క్సామజయూథ మైన నుడుసంఘము లైనను రాలు నాసుధా
ధామదినేశు లైన గడు దల్లడ మందుదు రేమి చెప్పగన్. 66

తే. శర్వరీశకళామాళి గర్వ మైన, నడచు కౌశికమౌని కే నసగ నెంత
యబ్ధి లంఘింపనోపినయలఘుబాహు, బలున కతిదుష్కరమె చౌటిపడియ దాట.

చ. మలయజశైత్యయుక్తములు మానసము ల్విలయోష్ణభానుమం
డలకిరణాతితీక్ష్ణములు నాలుక లెప్పుడు మౌనికోటికిం
దలప ననుగ్రహించిన బితామహు జేయుదు రల్పు నైన చే
రలుక వహించి రేని కడు నల్పుని జేయుదు రప్పితామహున్. 68

ఉ. ఇప్పుడ పోయి యమ్మునికులేశ్వరు డగ్గర మున్నె చేరి వా
తప్పక సంస్తుతించుచు బదంబులకుం బ్రణమిల్లి యుందమో
చప్పుడు సేయ కీక్షణము సత్వరవృత్తి దొలంగి పోదమో
యిప్పటి కేది కార్య మది యిద్ధమతిం దగు నాచరింపగన్. 69

వ. అని విచారదోలాందోళితమానసుండై యున్న యమ్మానవేంద్రునింగనుంగొని యమా
త్యశేఖరుండు వసుసత్యకీర్తి విశుద్ధబుద్ధిక్రియాపాటవంబు దేటపడ వినయాలాపం
బున ని ట్లనియె. 70

క. ఓకమలాప్తకులాగ్రణి, వికా కేటికి, నింతచింత మిన్నక వినుడ
స్తోకమతిని వివరంబుగ, నాకుం దెలిసిన తెఱంగున న్వినిపింతున్. 71

శా. భూపగ్రామణి వర్ధికల్పక మహాంభోరాశిగాంభీర్యరే
ఖాపారీణుడ వద్రిధైర్యుడవు లోకస్తుత్యసత్యవ్రతా
లాపశ్రీవిభవోజ్జ్వలుండవు విధి యేలా చింత చేకొంచినన్
నీపై నగ్గెడువారలుం గలరె యోనిర్వక్రవిక్రాంతిగా. 72

వ. అదియునుం గాక. 73

తే. శత్రుమిత్రత్వములు రెండు సమము గాఁగఁ, జూచి నిందాప్రశంసల సొక్కఁబడక
యుబ్బు నొందక యడవుల నొంటిఁ దిరుగు, మౌనులకు నేల నృపులతో మచ్చరంబు.

ఉ. జనవర నీకుఁ గోపమదెస న్వ్రాయ మేటికి నింత యాత్మలో
ననుపఁగ నామునిప్రవరుఁ డుల్లమునం గృప పెక్కుటిల్లఁ బో
జనముఁ ద్రిశంకుభూవరు విశంకటశౌర్యుని బొందితోడ నే
యనుపఁడె దేవతాపురికి నాగసి చూడ సుహోన్నతంబుగన్. 75

క. విశ్వామిత్రమునీంద్రున, విశ్వాసం బేల నీకు వివరింపంగా
విశ్వార్థదాయకుండవు, విశ్వంభరఁ గలుగుమానవితతుల కెల్లన్. 76

తే. సారవర్తన యీదుర్విచారతమము, వరవివేకదివాకరునిచేత
నడఁచి యొక్కింతసేపు సౌఖ్యాన్వితముగ, నిద్రఁ బొందుము నిరపాయముద్రఁ జెంది.

వ. అని పల్కు ప్రధానాగ్రగణ్యు సముగ్రసునీతివిశేషభాషణంబు లాకర్ణించి యమ్మ
హీకాంతుండు చింతావర్జితస్వాంతుండై సంతాపం బుడిగి నేత్రకమలంబులు ముకు
ళించి ముహూర్తమాత్రంబు నిద్రించి వాక్రువ్వ నాకర్ణింపఁ దరంబుగాని భయంకరం
బగుదుస్స్వప్నంబుం గాంచి బిట్టు మిట్టిపడి కలవరించుచు ధైర్యం బవలంబింపలేక
నలుదిక్కులు చూచుచు బాష్పజలపూరితనేత్రుండును బరికంపితగాత్రుండునునై
యొండెఱుంగక యున్న యన్నరేంద్రుం గనుంగొని చంద్రమతి యతిత్వరితంబున.

క. కెంజాయల నీనెమ్మొగ, కంజంబునఁ గంకణములు ఘుంఘుమలు వన భూ
మింజయుని వెన్ను చఱచుచు, నంజక భ్రమ యొల్లఁ దెలిపె నతిశయధృతియై. 79

తే. ఘటితనిర్మలఘూర్ణిముక్తాఫలప్ర, కాండసౌభాగ్యనిర్జితగగనసింధు
కంకణం బైననిజహస్తకంకణంబు, కదలఁక నాడించి పతిఁగా బడిసిపైచి. 80

సీ. ప్రాణేశ యేమరుపాటఁ బూర్వంబిట్లు, బిట్టు మేల్కని యేల బిట్టిపడెదు
శరణాగతారాతిజనపాలభయహర, ఖ్యాతిదక్షుఁడవు సమగ్రమతివి
దుర్వారమదభూరిగర్వాంధపరిపంథి, బాహుబలారణ్యపావకుఁడవు
సప్తపారావారసంవేష్టితక్ష్మా, చక్రసంరక్షావిచక్షణుఁడవు
గీ. నిత్యసత్యవ్రతస్తుత్యనిరుపమాన, సారగంభీరవాచావిశారదుఁడవు
ప్రబలధైర్యసుపర్వపర్వతమ వీవు, భ్రాంతిఁబొందంగఁదగునె నీకింతలోన. 81
క. అని తనప్రియఁ దెలిపెడుసతిఁ, గని దుస్స్వప్నంబు గంటిఁ గమలానన నే
వినిపింతుఁ దత్ప్రకారము, విను మీవని తెలియ ధరణివిభుఁ డిట్లనియెన్. 82
సీ. మణిమయం బగుసభామండపంబున వైభవోన్నతి నేఁ గొలు వున్నవేళ
కోపారుణేక్షుఁడై రుచిరార్కతేజుండు, ధరణీసురుం డొక్క దరుగుదెంచి
యదలించి ధరణిపై నస్మత్కిరీటంబు, పడఁ దన్ని మఱినన్ను బట్టి తిగిచి
కరము నిర్దయవృత్తిఁ బరము వెల్వడఁ దోల, బహువిధాపత్పరంపరలఁ జెంది
గీ. యీశ్వరానుగ్రహంబున నేఁచి పిదపఁ, బూజ్యసామ్రాజ్యవైభవస్ఫురణ గంటి
ననుచు దుస్స్వప్నపద్ధతి మనుజవిభుఁడు, సర్వమును జంద్రమతితోడ సరవిఁ జెప్పె.
ఉ. చెప్పిన నంతయు న్విని కుశేశయలోచన కౌతుకంబు నె
ల్లొప్పమి నెంతయు న్భయము నొందియు నొందనియట్టు లాత్మలోఁ
గుప్పలు గొన్నధైర్యమున గొంకక భూరివివేకశక్తి వా
తెప్పక పల్కెఁ జేరి వసుధావరుతోడ బ్రియోక్తినైఖరిన్. 84
క. ఏతన్మాత్రంబున కో, భూతలపురుహూత యింత పొలుపఱి మదిలో
భీతిల్ల నేల చెప్పెద, గౌతుక మొదవంగ వినుము కలతెఱఁ గెల్లన్. 85
చ. అలుక జనించి వచ్చినధరామరవర్యుడు గాధిపుత్రుఁడు
జ్వలమకుటంబు దన్నుటలు చయ్యన రాజ్యవిభూతి బాయుటల్
పలుమఱు దన్నిమిత్తమున బ్రాప్తము లౌను బహుప్రయాసముల్
గలుగు శశాంకమౌళికృప గ్రమ్మఱ రాజ్యధనాదివైభవముల్. 86
వ. అని చంద్రమతి హరిశ్చంద్రమనస్తాపంబు మాన్పి యూఱడించుచుండె నంతనచ్చట.
క. కోపంబునఁ బెండ్లియు గప, టోపాయం బొకటి యాత్మ నూహించుచు మా
యాపారీణత మీఱఁగ, దాపసవర్యుండు గాధితనయుఁడు వేగన్. 88
క. మాతలఁగ కుంభకుచములు, మాతంగకరోపమానమహితోరువులున్
మాతంగయానములు గల, మాతంగవధూయుగంబు మహిమ సృజించెన్. 89

క. అన్నలినాక్షులవాలుం, గన్నుల కెనయింప లేనికతమున గాదే
పన్నగ భయమున చేడెస, కెన్నడు జలమున్గ భూము లేమఱ వెడచున్. 90

చ. శివశివ యావిలాసినులచిక్కని చక్కని కుబ్బచన్నులన్
ధవళమరీచిబింబము నదల్చు మొగంబులు కెంపు మోవులుం
గువలయకాంతిసంపదలకుం గుదురైన వెడందకన్నులన్
యువజనధైర్యమూలముల నొక్కట బెల్లగిలంగ జేయవే. 91

సీ. కొదమతేటుల దెచ్చి విడియచందురు దెచ్చి, విషమాస్త్రసింగిణివిండ్ల దెచ్చి
కలువపూవుల దెచ్చి ఘనచంపకము దెచ్చి, దాడిమీబీజసంతుల దెచ్చి
జలజరాగము దెచ్చి బిసంబుల దెచ్చి ని, స్తుర శాతకుంభకుంభముల దెచ్చి
గీ. పుష్పగోత్రముల నావర్తపులినములను, కదళికాస్తంభముల శాలిగర్భములను
జిగురులను దెచ్చి కాని సృజింపరాదు, కమలజున కైన నాహంసగాములను. 92

క. ఆనీలవేణులకు గల, గానకళానైపుణంబు గంధర్వసరో
జాననలకు లే దింతయు, వీనులపండువులు సేయు విశదస్వరముల్. 93

క. చండాలత్వము దక్కగ, నొండేమియు వెలితి లేనియొప్పులకుప్పల్
గుండెలపతియును జాల డ, ఖండమతిం దద్విలాసగరిమ నుతింపన్. 94

వ. ఇవ్విధంబునం గనుపట్టు చండాలబాలికాయుగళంబు సృజియించి మౌనిశుండాలుం
డానీలవేణుల కిట్లనియె. 95

సీ. పాటించి వినుడు నాపలుకులు తెలియంగ, గంధసింధురరాజగమనలార
బిత్తరివన్నెలు పెట్టి మీ రెంతయు, నోసపరిబాగులం బొసగ నరిగి
జలజాప్తకులవార్ధిచంద్రుహరిశ్చంద్రు, సద్భక్తి దర్శించి సంస్తుతించి
సంగీతవిద్యాప్రసంగము ల్పచరించి, మృదుమధురోక్తి సంపదలు నెఱపి
గీ. వివిధలాస్యక్రియాకళావిధులు చూపి, చేరి సంతోషితస్వాంతు జేసి యతని
నడుగరానిపదార్థంబు లడిగి ధైర్య, హీనుగావించి బొంకించి యేగుదెండు. 96

వ. అనుటయు వల్లె యని యప్పల్లవాధర లమ్మునివల్లభునకుం బ్రణమిల్లి వీడ్కొని
సముల్లాసంబున. 97

సీ. చైతన్య మొందినశాతమన్యవశిలా, నికురుంబసాలభంజిక లనంగ
సంపూర్ణపూర్ణిమాచంద్రాస్యలై సంచ, రించు నీలోత్పలశ్రీ లనంగ
జంగమత్వము గాంచి సౌభాగ్యవిస్ఫూర్తి, నుతిగన్న తాపింఛలతిక లనగ
బొలుపు దీపింపంగ బ్రోది గావించిన, మకరకేతనుని ధేనుక లనంగ

గీ. వనితలకోటినినదసంపదల నదిసి, గిలుకుమట్టెలచప్పుళ్లు గులుకరింప
గలికిరాయంచకోదమలగతులసొబగు, నేలునొసపరినడకల నేగుదెంచి. 98

క. చండాలిక లసమాయుధ, కుండాలిక యూరువిజితసురుచిరకదలీ
కాండాలిక లమృతాకర, ఖండాలిక యాన్నపాలు గనుగొని వేడ్కన్. 99

వ. అనుపమానవినయపూర్వకంబుగా బ్రిణామంబు లొనర్చి కరకమలంబులు మొగిడ్చి.

మ. జయ మార్తాండకులావతంస విమతక్ష్మానాథనానాచమూ
చయపాథోనిధికుంభసంభవ సమస్తద్వీపవిన్యస్తభూ
రియశస్స్తంభవిజృంభమాణమతి వర్ణింప న్సమర్థుండె యా
వ్యయుడైన యొప్పుభవన్మహామహిమ నవ్వాతాశనాధీశుడున్. 101

ఉ. నీరమణీయవైభవము నిర్జరవల్లభు గెల్చు నీమహో
దారత పారిజాతవసుధారుహముం బ్రహసించు నీశుభా
కారము చంద్రమండలముఁ గైకొన కుండు నటంచు మాటికిన్
సూరిజను ల్నుతింప నినుఁ జూడఁగ వచ్చితి మయ్య వేడుకన్. 102

గీ. విపులధవళాతపత్రితవిమలకీర్తి, మండలుండవు మహితలాఖండలుఁడవు
నిన్నుఁ గనుఁగొనఁగంటిమి నృపవరేణ్య, మత్పురాకృతపుణ్యకర్మములకతన. 103

క. వీణెలు వాయింపంగఁ బ్రి, వీణత్వము గలదు మాకు వినిపించెద మ
క్షీణతరగానవిద్యలఁ జాణలు గాణలును మెచ్చి సంస్తుతి సేయన్. 104

వ. అని తదీయహృదయానుకూలభావం బెఱింగి గూఢలీలావతులు గంధర్వనితంబవతుల
కుం బ్రతిబింబంబులవై యత్యంతవిడంబంబున. 105

సీ. వీణెలఁ బుసెన ల్సోడలించి చెఱఁగుల, మొఱుఁగురాఁ గాయలమీఁదుఁ దుడిచి
కుచకుంభముల మోపికొని తానములపును, జక్కఁగా బవడ పుసారె లొత్తి
శ్రుతి గూడఁ దంత్రులు సుడిగోళ్ల మీటుచు, జీవాళి బుట్టించి చెలఁగురత్న
కంకణధ్వనులతోఁ గరపల్లవాంగుళు, లల్లార్చుచును నేర్పు లెల్ల మెఱసి

తే. మొనసి శ్రుతు లేడు మూర్ఛనలును, గలుగు ముప్పదిరాగములవాని
మిత్రముల శుద్ధసారంగమేళనముల, మంద్రమధ్యమతారకమానసనరణి. 106

శా. గాణ ల్మెచ్చఁగ బాడి రింపు దొలకంగాఁ దాళమానంబులన్
క్షోణీనాథజయాంకసంకలితము ల్బాశాదిగీతావళుల్
వాణీపాణిసరోరుహాంగుళినఖవ్యాపారలీలారణ
ద్వీణాసంచితపంచమక్వణకళావిఖ్యాతకంఠధ్వనిన్. 107

తే. ఆ నదీనవిశేషనానాభృతమునఁ, బొదలి యెంతయు నాశ్చర్య మొదవ నపుడు
వల్లికీపండపములఁ బుట్టెఁ బల్లవములు, హారమణిపంక్తి కరఁగి నీరయి స్రవించె. 108

వ. ఇవ్విధంబునఁ బాడిన నవ్వెలివాడచేడియలనిరుపమానగానవిశేషంబులకుఁ బరితో
షంబు నొంది హరిశ్చంద్రధరిత్రీవల్లభుండుల్లంబునఁ సంతసిల్లి వారలకనేకమణిమయా
భరణంబులు కురంగమదకర్పూరకాశ్మీరగంధసారతుషారనీరాదిసౌరభద్రవ్యంబులు
బ్రియంబెసంగ నొసంగి వీడ్కొల్పుటయుఁ జూచి మందహాసంబుచేసి యగ్గోసంగి
పడంతు లమ్మహీకాంతున కిట్లనిరి. 109

తే. కుంభదాస్యంబు లేల ధాత్రీశ మాకు, వివిధభావజ్ఞుడతకళావేది వీవు
బడలితిమి చాల నిబిడాతపంబుచేత, నీసితచ్ఛత్రి మొసఁగి మన్నింప వలయు. 110

సీ. ధరణీతలేశ నీగొడుగు దక్కఁగఁ దక్కినవస్తువు లెవ్వరం
పదలుగ నెవ్వి యిచ్చినను బల్వనతాపము పాయ నేర్చునే
హరిబొరిఁ గాయునెండఁ గడుఁ బొక్కె శరీరము వేఁక్కె మాయెదం
గరుణ వహింపఁగాఁ దగు నఖండితదానకళాధురీణతన్. 111

క. అనుటయు నామాలెతలం, గనుఁగొని యుత్సాహ ముడిగి ఘనకోపముతో
మనుజాధీశ్వరుఁ డిట్లనుఁ, గనుఁగొనలయందుఁ గెంపు గడలుకొనంగన్. 112

క. పుడమిపయిఁ దొల్లి యీగతి, నడిగినయాచకులు గలరె యనుచితమతి మీ
యెడఁదల నిప్పారింపక, గొడు గడుగుట యెట్లు కంఠ కొఱవ్వున నన్నున్. 113

క. ప్రేమంబున యాచకులకుఁ, గామితవస్తువుల నొసఁగుకాలమునందున్
భూమీశుల కిడ రానివి, చామరయుగళంబు గొడుగుఁ జర్చింపంగన్. 114

ఉ. కను నఖిలావు మీర లడుగంగఁ దలంచిన చామరంబులున్
గొడుగును దక్కఁ దక్కినవి గోరెడు వస్తువు లెవ్వియైన నే
నెవడక యిత్తు నావుడు నహీనసుతూహల ముప్పతిల్ల న
ప్పడఁతులు పల్కి రిట్లనుచు భూనకులోద్భవుతోడఁ జయ్యనన్. 115

ఉ. శీతలవస్తుసంగతులచేత నడంపఁగ వచ్చుఁ గొంత యీ
యాతపతాపఖేదము ధరాధిప మన్మథబాణఘాతసం
జాతవియోగతాపమునఁ జాలఁ గృశత్వము నొందుమమ్ము న
త్యాతతకేళి నీబిగువుఁగౌఁగిట జేర్పు రతిప్రసంగతిన్. 116

వ. అనుటయుం గర్ణపుటంబులుం గరంబులుం జేర్చి యవ్విభుల పరిక్రమించు శివస్మరణంబు
చేసి ప్రచండరోషంబునం జండాలబాలికలం జూచి మీర లర్థమువాఁరిధారిణు లని

తిరస్కారంబు సేయ నేరక యూరకున్న నింగితం బెఱుంగక మదిరాపానవికారం
బున శరీరవిస్మృతిం బొంది విప్రలాపంబులు పల్కెద రని వెండియు నిట్లనియె. 117

తే. దర్శనస్పర్శనములకుఁ దగరు మీరు, మీకుఁ గౌఁగిలి యిమ్మని మేలఁతలార
పలుక నాలుక లెట్లాడె భయములేక, తెలియ మీజాతి యెంత బుద్ధియును నంతె.

క. చూచిన మీయం దిప్పుడు, యాచకముద్రావిశేష మణుమాత్రంబున్
దోఁచదు మీ రెక్కడిమా, యాచండాలాంగనలొ మహోన్మత్త మరయన్. 119

క. ఆయత కారుణ్యంబున, నీయపరాధంబులను సహించితి నిఁక న
న్యాయోక్తులేమి పల్కినఁ, గోయుదు నాలుకలు మిమ్ముఁ గొంకక నలుకన్. 120

చ. అనుటయు నాసరోరుహదళాక్షు లొకింతయు శంక లేక యు
బ్బున మదగర్వము ల్వొదల భూపతి దగ్గఱి పెక్కుభంగులం
గనుఁగవ లార్చుచు న్వివిధకామవికారవిధానకృత్యము
ల్గానకొని చూపుచు న్మఱియుఁ గోరి యకారణహాస్యలీలలన్. 121

సీ. పొరిఁబొరిఁ గెంజల్వపుంజంబు లెగయఁగఁ గేళీసరోజాతము ల్ద్రిప్పికొనుచుఁ
గడకంటిచూపుల బెడఁగొందువీనుల, తొడవు లొయ్యనఁ జక్కఁదోఁచికొనుచు
దోర్మూలరోచులు దుర్నిష్కగింతలు వెట్టఁ, దివుటమైఁ దుఱుములు దిద్దుకొనుచు
నొసపరి బాగుగా నొసలఁ గస్తూరికా, తిలకంబు లొయ్యనఁ దీర్చికొనుచు

గీ. దలరనునుగుబ్బచనుదోయి వెలికిఁ దోప, జిలుఁగువలిపంపుఁ బయ్యెద చెఱఁగులొలయ
పాసఁగ లేఁజమ టూరఁగ విసరికొనుచు, మసలుచుండిరి శృంగారమహిమ చెలఁగ.

క. ముద్దులు గురియుచు మురియుచు, నిద్దపుటద్దములలోన నీడలయొప్పుల్
పెద్దయు జూచుచు మైకొని, గద్దరితనమున విలాసకేళులు దొలంకన్. 123

ఉ. విందులుగాఁగఁ గర్ణపుట వీథులకుం బికనాదలక్ష్మికిం
బొందులుగాఁగ బల్లవికపుంగవమోదకళాభివృద్ధికిన్
మందులుగాఁగ జొక్కుచును మందమనోహరవిభ్రమంబులం
జిందులువాఱుచుం జిగురుచేతుల దాళము లొత్తి యాడుచున్. 124

తే. ధరణిపతి చూసి నరపాల తమకు దాను, తివిరి మోహించి వచ్చినయువతిజనుల
రతుల దేల్పక పూని తిరస్కరించు, టగసి చూచిన గారాదు పురుషులకును. 125

ఉ. కావున మమ్ము బ్రేమమున గౌఁగిట జేర్చి రతిప్రసంగ లీ
లావిభవంబున న్బహుకళానిపుణత్వము మీఱ నన్యథా
భావము లుజ్జగించి నిరపాయసుఖస్థితి బొందు రూపచే
ఖావిధుబింబ మన్మథునిగర్వము సర్వము బాయునట్లుగన్. 126

క. అంభోజముకుళసమకుచ, కుంభములు రాయిడింప గోరిక లలరన్
బుంభావరతుల నిను గడు, సంభావించెదము మాకు జన వీవలయున్. 127

తే. మానవాధీశ యీలతామందిరంబు, రమ్యమై యున్న దిచ్చోటు రతివిహార
యోగ్య మీరీతి దడయంగ నుచిత మగునె, రమ్ము విరహానలమున కోర్వంగలేము.

వ. అని యివ్విధంబునం జెలిలు వాలుగంటులు మహీపాలుకేలు కేలం గీలింప నుద్యో
గించుటయును నాలీలావతులతలం పెఱింగి నిలింపపతిప్రతిమానుం డగునబ్భాను
కులాభరణంబు తాలిమిం బొఱిగి యమ్మాలెతలమదం బుడిపెద నని దర్వీకరభీకరతర
కశాఘాతంబుల గాయంబులు జర్జరీభూతంబులు సేయం దొడంగినం గనుంగొని
యమాత్యపుంగవుం డగుసత్యకీర్తి కదియం జనుదెంచి కరసరోజంబు వట్టి సమ్మోటం
దొలంగం దిగిచి తోడ్తెచ్చి మనంబునం గారుణ్యంబు పూరించి నిలిచి. 129

మ. జననాథోత్తమ గాధిరాజపుత్రియు నీచందంబుగా నాగ్రహం
గినియం బాడిరె శత్రు కన్యలె వితర్కింప నస్సరోజేక్షణల్
విను మీ వర్గిన దుర్మదోద్ధతమహావిద్వేషరాజన్యసై
న్యనికాయంబులమీద గాక దగునే యన్యప్రదేశంబులన్. 130

క. త్రిదశేంద్రసదృశ నీవీ, సుదతుల వారింప బూనుచొప్పు దలంపన్.
మదనాగ మరటికోదమల, విదళింపగ బూనునట్టివిధమై యుండున్. 131

సీ. ఈవెలందుకలపయ్యెద లభియాతిభూ, మీతలాధీశుల కేతనములె
యీపంకజాక్షులయెలవంక బొమలహాం, కారవద్వైరుల కార్ముకములె
యీకీరవాణులకోక స్తనంబులు, మత్తారిగిరి దుర్గమండలములె
యీరాజముఖులపృథూరుదండంబులు కపటవిద్వేషులకరికరములె

గీ. యీపడంతులకడకంటిచూపు లహిత, మనుజనాయకసునిశితమార్గణములె
వీరి నోపింప దగునె యుర్వీకళత్ర, కృపదలిర్పగ జూచి రక్షింపవలయు. 132

మ. వలదీరోషము మానుడీ తగదు నావాక్యంబు లాలింపు ద
ర్థుల బ్రత్యర్థులరీతి జూచిన మహాదోషంబు ప్రాప్తించు ను
జ్జ్వలకీర్తీశ్వర యాచకప్రకటరక్షాదక్ష యీ వేళమున్
వలయు న్నాత్మకశేముషీపథమున న్వర్తింప శాంతస్థితిన్. 133

తే. అనుచు హితబుద్ధి నుడివి ప్రియంబు మీఱ, శాంతు గావించి మరలించె సచివు డధిపు
నంకుశంబున నాదిన యంతభద్ర, దంతి మరలించునట్టిచందము దలిర్ప. 134

క. తదనంతరంబ ప్రియము, న్సదమలవాగ్వృత్తి వెలయ జంద్రమతియు బె
ల్లాదవెడుమతినైపుణమున, హృదయేశ్వరుమోము జూచి యిట్లని పలికెన్. 135

సీ. ఎన్నఁడైనను వింటిమే మహీతలమున గనకసారంగంబు గల దనంగ
నాయిఱ్ఱివెంబడి నడియాస నిచ్చోటి, కేగుదెంచితిమి విహీనబుద్ధి
నెక్కడిమాలెత లేతెంచి రీతాప, సాశ్రమభూముల కనుచితంబు
చండాలబాలికాజనముల కిటువంటి, చక్కఁదనం బెట్లు సంభవించె
గీ. విశ్వసింపంగ దగునె వివేకులకును, భూమిపాలక యిది గాధిపుత్త్రకపట
కృత్యమింతయుఁ గాకున్న నిట్టియద్భుతములు గలుగంగ నేర్చునే తలచి చూడ.
క. అపుడు వసిష్ఠమహాముని, విపులకృపాగరిమ బుద్ధి విలసిల్లంగా
నుపదేశించినపలుకులు, నృపవర తార్కాణమయ్యె నిపు డిచ్చోటన్. 137
వ. అని పలుకుచుండ నమ్మాతంగకన్యకాలోచన లక్కడ దొలంగి చని. 138
సీ. మురువేది వాడినమోము దామరలును, గడునొప్పిపొందినకాయములును
గొప్పులు వీడి చిక్కులుపడ్డకురులును వీతరాగము లైనవాతెఱలును
జఘనమండలమున జారినచీరలు, ఘనరక్తసంసిక్త కంచుకములు
కరగినయంగరాగములును మిగులఖిన్నము లైనకర్ణతాటంకములును
గీ. బాష్పధారల దోగినపక్ష్మావళులును, వ్రీలి ముక్తాఫలంబులు రాలుసరులు
కలసి నాదంబు లెడలినకంఠములును, గలిగి యత్యంతదైన్యంబు గ్రందుకొనగ. 139
క. త్రిజగత్పవిత్రు నవపం, కజనేత్రు దపోవిశిష్టగాత్రు సముద్య
న్నిజతను తేజోవైభవ, విజితప్రభాతమిత్రు విశ్వామిత్రున్. 140
చ. కని మునిచంద్ర యీధరణికాంతుఁడు మమ్ము మహోగ్రకోపియై
కినుక మనంబులో మిగులఁ గీల్కొనఁ గొత్తుల మొత్తుకైవడిం
గొనకొని మొత్తె సమ్మెటలఁ గొంకక నిర్దయవృత్తిఁ జేసి మే
త్తైనఁ గడు నొచ్చి వచ్చితిమి దిక్కు దలంపగ నీవు నావుడున్. 141
శా. ఏమేమీ మిము భూవరాధముఁడు దా నెంతే నహంకారియై
భీమస్ఫూర్తిఁ గశాభిఘాతములచే బిట్టుల్క నొప్పించె నే
యేమాడ్కి స్థరియించువాఁడొ యిఁక నూహింపంగఁ గల్పాంతవే
ళామృత్యుంజయఫాలనేత్రశిఖిలీలం బర్వుమత్కోపమున్. 142
వ. అని త్రిపురాసురవీరులపయిఁ గవియుఫాలలోచనుండునుబోలె నాభీలరోషావేశం
బునం గరకమలాక్షమాలిక నేలం బడవైచి, కనత్కపిలాంగారశంక నంకురింపంజేయు
దృగంతంబు లంతకంతకుం గెంపులీనుచుండ సమీపవాసు లగుతాపసజనంబులమనం
బులు తల్లడిల్లఁ బ్రచండదండంబు కేలంబూని జటాభారంబు దూలియాడఁ గటి
మండలంబున వల్కలాంబరంబులు వీడం బాఱ్ఱు గొనుచుఁ బవంబులు దాటించు-

చుఁ జనుదెంచు నవ్విశ్వామిత్రుం గనుంగొని హరిశ్చంద్రుండు మృగేంద్రుంబుఁ
గనుంగొనిన కరికలభంబు చందంబున నత్యంతభయంబును బొంది, 143

వ. మనసా మాత్రిజ్యవిభూతులెల్ల నిఁక నిమహాత్మునిచేఁ జాల నా
శనముం బొందకయుండునే యని మనస్తాపంబు దీపింప నొ
య్యన భార్యాయుతుండై యెదురేగుచు సాష్టాంగంబు పె
ట్టినఁ గోపంబునఁ దన్నె భూరమణుకోటీరంబు బీరంబునన్.

ఉ. తన్నిన మానసాబ్జమున దైన్యమొకించుకయు జాఱనీక య
త్యున్నతభక్తితో వినయ ముబ్బఁగ వెండియు మ్రొక్కి తెల్విమై
నన్నరనాథపుంగవుఁడు హస్తసరోజయుగంబు మోడ్చి యు
ద్యన్నవభానుతేజుఁ దగు తాపసకుంజరుఁ జూచి యిట్లనెన్. 145

చ. అనఘచరిత్ర మీచ్చుమపదాజ్ఞము మాయకరత్నయుక్తకాం
చనమకుటంబుతో నొసఁగి చాలఁగ నొప్పి వహించె నే నొన
ర్చినయపరాధ మేది యిటు సేయఁగ నాకతి యిందు నావుడున్
మునికులముఖ్యుఁ డిట్లనియె మో మరుణాంబుజకాంతి నీనఁగన్. 146

శా. ఓరీ రాజకులాధమా నృపులు తేరో వేఁట రారో మద
క్రూరాభీలమృగాదులం దునుమరో ఘోరాటవుల్ లేవో మా
యారామంబుఁ గలంచి జంతుతతి మాయంజేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి నొమ్రెఁదినా వేమిరా. 147

క. ఒకపాప మనఁగ నేఁటికి, సకలాంగంబులును నొచ్చె సాహసవృత్తిన్
మొక మోడక నీచేసిన, సకుటిలకృత్యములు మాకు జర్చింపంగన్. 148

క. ధరణీశ చంకమద్దును, శరణార్థియునన సెడుమాట సరివచ్చె మునీ
శ్వరబాధక మగునీదు,శ్చరితము పరికింప మిగులసాహసి వరయన్. 149

చ. ఇల గలరాజులెల్ల భజియింప మహోన్నతి జక్రవర్తివై
యలరుటయెల్ల దాపసజనాశ్రితభూముల కగ్గుసేతకే
తలువ భవద్వివేక మతిమున్నయ మారయ నివ్విధంబునన్
మెలఁగఁగ నీకు నెవ్వఁడు సమిద్ధమతిన్ సెలవిచ్చె జెప్పుమా. 150

ఆ. అసిమిలోని దొకటి యమ్మెడిదొకట్టి, నీచరిత్రమెల్ల నేడు తెలియ
వచ్చె మాట గపటవర్తనుఁడవు నీవు, చేరి నిన్ను విశ్వసింప జనునె. 151

చ. నృపతులు తొంటివారలు విజృంభణలీలఁ జమూసమేతులై
విపినముల న్విహారగతి వేఁటమెయిం జరియించుచుండరే

తపసులయాశ్రమంబులకు దద్దయు నీవటె నిష్ఠురక్రియం
గృప హృదయంబులో వదలి కీడు దలంపరుగాక యెన్నకుఁడు. 152

క. మాయాశ్రమసారంగము, బాయక వెనువెంట దగిలి బడలించుచు న
ర్న్యాయత్తచిత్తమదమున, న్యాయంబా నీకు మృగవనంబు చొరంగన్. 153

చ. అలరులు రాల్చుచుం దలిరుటాకులు దుంచుచు పక్వమైన స
త్ఫలములు కోయుచు న్వివిధపాదపశాఖలు పట్టి యూచి ప
క్షుల బెదరంగ దోలుచు విశుద్ధసరోవరవారిపూరముల్
గలచుచు గాసి సేయుపలుగాకుల మాన్పవు నీమభృత్యులన్. 154

వ. అదియునుం గాక.

మ. మరి నా సెంపుడుకూతులై వెలయు నీమాతంగవామాక్షులం
గరిణీయానలఁ బల్లవాధరల రాకాచంద్రబింబాస్యలన్
సరసాలాపకళావిలాసనిధుల న్సంగీతచాతుర్యలం
గరుణాహీనతఁ బట్టి సమ్మెటల నల్గం గొట్టఁగాఁ బాడియే. 156

తే. ఆశ నర్థింపవచ్చిన యట్టివారి,కీప్సితార్థంబు లిచ్చుట యెల్లమాని
నెట్టుకొని బిట్టు వాపోవఁ గొట్టుబెట్టు, రాజ్యమదమున నన్నుఁ దిరస్కరించి.

క. వికసితశరీమకోరక, సుకుమారశరీర సారశోభాన్వితలన్
మొకమాట మింత గలుగక, యకటా మోదంగఁ జేకులాడెనె నీకున్. 158

ఉ. మాయకరోషవహ్ని పలుమారును నుబ్బఁదొడంగెఁ బేర్చి నీ
వేమెయి నింక నాయెదుర నెక్కడికేగెదు దుర్మదాంధ యా
హైమవతీమనోరమణుఁ డడ్డము నిల్చిన నిల్పు సందియం
బేమియు లేదు పూని నిను నిప్పుడె ప్రాణవిహీనుఁ జేసెదన్. 159

వ. అనిన నమ్మహీపతి సంవర్తసమవర్తియుఁ బోలె మహోగ్రమూర్తి యైయున్న నమ్మునిచక్రవర్తిం గనుంగొని నదీయతనుప్రభాపటలంబు మిఱుమిట్లు గొలుప భయభ్రాంతుండై యేమియుం బలుకనేరక నివ్వెఱపడి యూరక యున్న నాభూమింజయుం జేరి మనస్తాపంబు మాన్చి హితోపదేశంబు చేయం దలంచి నిత్యసత్యవివేకకర్త యగుసత్యకీర్తి యి ట్లనియె.

సీ. మనుజేశ నీవు మూర్ఖునికీతి ని ట్లేల, మిన్నక భ్రమఁ బొంది యున్నవాఁడ
వానక ప్రాపించునట్టిది దైవంబు. విశదక మిగుల వివేకబుద్ధిఁ
దెలివినై మెలఁగఁ వలయు మానవునకు, దైవిక ఘటనలఁ దప్ప దెప్పుడుఁ
గావున నిమ్మునికంఠీరవుఁడు నీకె, ప్రార్థింపు మీ నపరాధ మనుచుఁ

సీ. గాలగా బడి ఘోర్ణిల్లఁ గవచు నీవని, భీషణం బైనదుర్వ్యాధిరోషవహ్ని
యుడికినే ద్విజుఁ జలఁకుడు లేమి చెప్ప, హరివిరించిపురందరాద్యసుర లైన. 161

క. తాను పసుపయి మాఁచి దాన్గాన, వాసుకికంకణుని కెత్తువచ్చు నిలెం డో
వాసవ మల్లభవంశజ, యీసఁయమిఁ బోలఁ గలరె యెవ్వరో దపసుల్. 162

మ. కరుణాపాంగనికేతుఁడస్ఫురణ నీగాథేయుఁ డొక్కింత యా
పరవృత్తిం గనుఁగొన్నయంతటన మోదం బొంది కల్యాణముల్
గొనకుఁడే మానవలోకసంతతికిన స్తోకప్రభావుండు భూ
వర యీపుణ్యుడె యర్థిగణ్యు డనయ న్వాచంయమశ్రేణికిన్. 162

ఉ. నావుడు వెల్వెలం బొంది నరనాథశిఖామణి ప్రేమ హస్తరా
జీవయుగంబు మోడ్చి మునిశేఖరు గన్గొని యోమహాత్మ నన్
గావ గదయ్య నావలన గల్గిన నేరము లెల్ల మాటికిన్
భావములోఁ దలంపకు మపారకృపారసమానసుండ వై. 161

క. మీకును కెదిరి నిల్వఁగ, నాకు దరం బగునె త్రిభువనస్తుత శక్తే
భాకల్ప శేషకల్పుల, నాకంపము నొంది భయము నందుదు రనినన్. 165

తే. వినయము దజ్ఞానినై చేయుతప్పు లెల్ల, గన్నతండ్రికి లోఁగొని కరుణ గావ
జనదె యిటు కూటికూరకు జంద్రిపోస, మెత్తురనె యేల నామీద నింతకినుక.

తే. మూఢమతి జెంది యపరాధములు గడంగి, నే నొనర్చితి జాల నజ్ఞాని నగుచు
వాని నన్నిటి లోఁగొని వత్సలత న, నుగ్రహింపుము మౌనిజనాగ్రగణ్య. 167

శా. నిర్లోపం బను శేషపన్నగము నామీద న్వడి నాగ్రిగ నా
కారుణ్యాత్మక నే మహాభయమునం గంపించుచున్నాడ నన్
జేరన్ రమ్మని నమ్మఁ బల్కి తనపై చే జేర్చి యూరార్చి నా
నేరంబు ల్హృదయంబులో నిడక మన్నింపంగదే మ్రొక్కెదన్. 148

తే. ప్రాణి శరణంబు వేడెడువాని నెట్టి, దుష్టశాత్రవు డైన నోదీష్టవర్య
యొగ్గు లెన్నక మతిశయం బెల్ల నుడిపి, ప్రోచుటయు సుస్తనంబు కారుణ్యమతిని.

తే. పాపహర్తవు నీవుచిత్తంబు నాదు, భావ్య మిందాఁకి దేవతాప్రణాతి గన్న
నన్ను శరణంబు వేడెద నీళ్ళు మంపు, పాలముంపుము నేయును బల్కనేల. 170

వ. అని హరిశ్చంద్రుండు సుతసతీసమేతుండై మహీతలంబున జాగిలిదండప్రణామంబు లతిప్రేమం గావించి లేవక దీనభాషణంబుల "నన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" యనుచు ప్రార్థింప గొంతసేపునకు నమ్మునిచంద్రావతంసుండు కొంతదయనిజ

స్వాతంబునం గీలుకొల్పి శాంతభావంబు వహించుచు నారాజశేఖరు మహానుభా
వంబు మదిలో మెచ్చుచు నతనిశిరంబు కరంబున నెత్తి లే లెమ్మని యిట్లనియె.

తే. నీవు చేసినదోషంబు నీకయుండె, దీర్ఘరోషంబు మాకు సాధింప నేల
మొగమునం దున్న నీదైన్యముద్రి జూచి. కరుణ జనియించె గాంచితి ధరణినాథ.

క. ఘనుడవగు కతన నీచే, సినదుండగములు సహించి చేపట్టితి నే
మనుజేశ యింక నాచె, ప్పినవాక్యం బొకటి సేయు బ్రియము దలిర్పన్. 173

ఉ. శోణితలేశ నాయనుగుగూఁ తుల వర్ణన సేయ నొప్పున
ప్రాణసిపువ్వుబోడులను బల్లవపాణుల జారుసైకత
శ్రోణుల గీరవాణుల మరున్మణివేణుల సర్వలోకక
ల్యాణుల నీవు నిచ్చెద బ్రియంబున వారి బరిగ్రహింపుమా. 174

క. నాపలు కుల్లంఘింపక, భూపాలక వారి బ్రీతి భోగినులుగా
జేపట్టి మమత నేలిన, గాపట్యము లేక నిన్ను గాచెద నెప్పుడున్. 175

డే. సూర్యకులవర్య నీమనస్థైర్య మెఱుఁగ, దలచి యూరక బలికిన పలుకు గాదు
మాకు నానంద మొదవ నమ్మానవతుల, నాదరకిబ్రియ దగ బెండ్లియాడవలయు.

వ. అని యివ్విధంబునం బలుకు నమ్మునీంద్రువాక్యంబు లమ్మహి కర్ణపుటంబులకు నస
హ్యంబు లగుటయు నమ్మహీవల్లభుం డుల్లంబున దల్లడిల్లి డిల్లపడి యెల్లవిధంబుల
గపటకృత్యంబులు గల్పించి యక్కల్లరితపసి చేయునుపద్రవంబు లాపాదింపక యి
న్నెలవు దొలంగిపోవ నీయం డే గాంచిన దుస్స్వప్నఫలంబు మిన్నకదొలంగునే
యని కౌశికునిం గనుంగొని.

తే. క్షత్రియత్వంబు వర్జించి సంయమీంద్ర, తగునె నాకిప్డు డీమాతెతల వరింప
నంటగా రానియన్వయం బకట యెట్లు, తెలియ కీమాట మీరానతిచ్చితి రిట.

సీ. అనినవిశ్వామిత్రు డవనీకళత్రుని, గినుకజనింప వీక్షించి పలికె
వివరించి చూడ భూవిభులకు దప్పని, ఘనతరనిరయదుఃఖములు ధరణి
నాథ 'రాజ్యాంతాని నరకాణి' యని పల్కు, సలలితస్మృతివాక్యసరణి వినవె
కావున నాయాజ్ఞ నీవెలివాడలేఁ, జిగురాకుఁబోడులఁ దగ వరించి

గీ. పూజ్యసామ్రాజ్యసౌఖ్యసంభోగమహిమ, జెందుటయ బుద్ధి దీనికిఁ జింత యేల
నెమ్మిఁ బరలోకసౌఖ్యంబు నమ్మ నేఁడు, దొరకులాభంబు విడుచు వేఁడుకనుగలదె

ఉ. నేరవు సౌఖ్య మొంద ధరణీశ యజీర్ణముఁ బొందునంచు నా
హారము మాని వెల్లొదవునాఁకటిచేఁ గృశమై చరించుటల్

సారవివేకమే తలఁపఁ జయ్యన నీయొలదిఁ గాఁబోఁడుటల్
గౌరవలీలఁ గైకొనుము కాదు సుమీ మఱి సంశయింపగన్.

తే. పసిఁడిమేడలలోనఁ బూఁబాన్పులందుఁ, బొసఁగ నీయిందువదనలఁ బొంది తేని
బొందితోడనె జంభారిపురికి ననుతు, ననఘవర్తనుఁ డగుభవజ్జనకుసట్ల. 181

తే. అనిన మనుజేంద్రుఁ డిట్లను మునివరేణ్య, మత్కులాచార మెడలి యీమానవతులఁ
గూడియుండుట వివరింప నోడ విడిచి, వదరు పట్టినయట్లుపో త్రిదశవంద్య. 182

తే. కులము దిగఁద్రొచి మీమాటలతల వరించి, కాంచు గీర్వాణలోకసౌఖ్యంబు లొల్ల
...తమున రాజ్యమైన వర్జింతుఁ గాని, చలముకొని యెన్ని చెప్పినఁ గులము విడువ.

సీ. అనిన భూ... యట్ల యగుఁగాక నీ కింకఁ, దిరుగనాడిన మహాదేవు నాన
నీసర్వరాజ్యంబు నేఁటితో వర్జించి, తడయక మా కిమ్ము ధార వోసి
సామ్రాజ్యసంభోగసౌఖ్యంబె మాకోర్కి, నీకారణంబున నేఁడు దొరకె
కరిచుఁ దోరణములఁ గట్టి నంతేవాసి, జనులఁ బంప వలయు సంతసమున

తే. వసుధ ప్రజలకుఁ దగ నానవాలు గాఁగ, నెలమి నీయంగుళీయక మిచ్చి పసుపు
మాయుమైశ్వర్యపుత్రపౌత్రాభివృద్ధిఁ, బొందు మా చంద్రతారకస్ఫురణ వెలయ. 184

వ. అనుటయు నవ్విశ్వామిత్రునకు విశ్వంభరాకళత్రుం డిట్లనియె. 185

మ. తగ మీయానతి సేయుకంటెను బ్రశస్తం బైనపుణ్యంబు లే
జగతిం గల్గునె నాకు బంధురతపస్సామ్రాజ్యసింహాసనం
బు గురుప్రాభవలీల నెక్కి మిగులం బొల్పొందు బ్రహ్మర్షి వై
దిగధీశస్తుతకీర్తి గాంచిన మహాతేజస్వి వీ వారయన్. 186

క. మీకోర్కె సలుపఁ గలుగుట, శ్రీకరబహుపుణ్య...చిరతరలక్ష్మిన్
జేకొనుట గాదె మునివర, యీకల్పముగాన నేఁ గృతార్థుఁడ నైతిన్. 187

ఉ. శ్రీలు తలర్చుచుండ మునిశేఖర మున్న టిదాఁక మున్ను మీ
రేలినభూమి గాదె యిది యిమ్మని నన్న నేల క్రమ్మఱం
బాలన మాచరింప మతిఁ బాయక వాంఛ జనించె నేని భూ
పాలలనామనోరమణసన్నిభ గైకొనుఁ డెల్లరాజ్యమున్. 188

తే. తెల్లముగ మన్మనశ్శుద్ధిఁ దెలియఁగోరి, పలికెదరు గాక మీకేమి భ్రాంతి యస్థి
రంబు లైనట్టియీమహారాజ్యసుఖము, లనిన ధరణీశుఁ జూచి యమ్మునివరుండు.

మ. సెలవింబొంకఁగ నవ్వుచుం బలికె నాక్షేపించి యీనేర్పు మా
టలు మాముందఱ సాఁగిరావు వెఱచోటం గాని భూపాల రా

జాలలోన న్నిను సత్యవాఙ్నియతుఁ డంచుం జెప్పఁగా ముజ్జగం
బులయందు న్వినుచుండు మప్పలుకు దాఁ బొంకయ్యె నీపట్టునన్. 190

సీ. ఇనవంశ మున్న నీ విచ్చెద నని పల్కి, జాఱ నాడఁగ నీకుఁ జనునె యిప్పుడు
మిన్నకఁ జన నియ్య నిన్ను మిథ్యాలాప, శీలతారతుఁ గాఁగఁ జేసి కాని
'నృపులు పల్కితి నాస్తి మీ రేగుఁ' డనినను, బోయెడ మాటలు వేయు నేల
యని పల్కుచుండంగ నావేళఁ జంద్రిమ, తీకాంత భూకాంతు దిక్కు చూచి

తే. తపసి గావించుకపటకృత్యంబు లనెడి, యమ్ములఁ దగిలితి మిఁక నేల యొండుతలఁపు
లేమి పలుకంగఁ జూచిన భూమిరమణ, బొంకు దొరయనిధైర్యంబు పూనవలయు.

క. మీ రిఁక నేమియుఁ బలుకక, ధారుణి యంతయును గాధితనయున కిచటన్
ధారాపూర్వకముగ నని, వారితమతి దాన మిండు వసుధాధీశా. 192

క. మితభాషణమందు సంభృత, వితతార్థచయమునందు నగుట వివరింపఁగ నూ
నృతసంపదయును వితరణ, చతురతయును గోరి కాదె సజ్జనుఁ డుండున్. 193

చ. మును ధర యేలి చన్ననృపముఖ్యు లనేకులు చర్చ చేసినన్
జనవర వారిలోన వినసన్మతిపాత్రగు లెవ్వ రైన సొం
పున, దమయింట నుంటి మొన మోపఁగఁ జాలినయంత మేరయుం
గొనిచనిరే ధరాతలము కొంకకు మీ యిల దాన మిచ్చుచోన్. 194

క. భూమితల మెల్ల మానుగ, వామనవటుమూర్తి యైనవనజాక్షునకుం
బ్రేమంబున బలి యొసఁగడె, యామరతరువితరణక్రియాదీపితుఁడై. 195

ఉ. ధీనిధి యైనవిప్రున కతిప్రియలీల ధరిత్రియొక్కెడన్
జేనెఁడుమేర యిచ్చినఁ బ్రసిద్ధయశస్స్థితి వాఁడు పూని యం
భోనిధివేష్టితక్షితివిభుత్వము, మీఱఁగఁ దాన యేలు భూ
దానముఁ బోల లేవు మఱిదానము లెవ్వియు మానవేశ్వరా. 196

క. దశదానంబులలోపల, విశదాధికమహిమ నొప్పు వేల్పులలోనం
బశుపతిగతి భూదానము, వశమే తత్ఫలము తెలిసి వర్ణింపంగన్. 197

క. వసుధేశపాత్రదానం, బొసఁగంగాఁ గలిగె మీకు నుర్వీచక్రం
బసదృశవితరణమహిమం, బెసఁగంగా ధారఁబోయుఁ డెలమి దలిర్పన్. 198

వ. అనినిజహృదయానుకూలంబును నఖిలభువనభరితయశోమూలంబును నిత్యసత్యాలవాలం
బునుగా బలుకు నన్నీలవేణివాక్యంబు లాకర్ణించి యమ్మహీకాంతుండు సంతోషి
తస్వాంతుండై. 199

క. ఆహా యీసతివిహిత, వ్యాహారము లెంత యొప్పె ననుకూలవరా
రోహలం గలిగిన జతులకు, నూహింప నలభ్యవస్తు వొకటియు గలదే. 200

క. తనచేయుధర్మమునకును, మనమున వేఱొండుతలపు మాని ప్రమోదం
బొనగూడ మెలఁగ నేర్చిన, తనుమధ్యయె వానిపాలి దైవం బరయన్. 201

వ. అని పలికి తూర్ణంబుగ సువర్ణకలశంబుల పావనజలంబుల దెప్పించి దేవబ్రాహ్మణ
క్షేత్రంబులు దక్క దక్కినధాత్రీతలంబు సర్వంబును సుమామహేశ్వరప్రీతిగా
మీకు సమర్పించితి నని యేర్పడం బ్రియపూర్వకంబుగా గౌశికునకు ధారవోసె
నయ్యవసరంబున- 202

సీ. సారసౌరభముల సకలదిక్కులయందు, గురిసెను మందారకుసుమవృష్టి
దివి నాదితేయవాదిత్రనిర్ఘోషము, ల్కర్ణసౌఖ్యంబులు గాఁగ బ్రబలె
గంధర్వగానముఖ్యక్రియాసహితంబు, లప్సరోనృత్తంబు లతిశయిల్లె
నింక నరుంధతీహృదయేశుఁడే జయించు, నని నభోవాణివాక్యములు చెలగె

గీ. నపుడు గాధిసుతుండు ధరాధినాథుఁ, జిత్తసమ్మద మొదవ నాశీర్వదించి
వినుతి గావించె దుగ్ధాబ్ధివీచికాస, మానవాచాపరంపరామహిమ వెలయ. 203

వ. అనిన విని కౌంతేయాగ్రజుండటు మీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 204

మ. కరహాటాంధ్రకళింగవంగమణికందర్ప పాంచాలబ
ర్బరహంసీగమనాలతాంతశర సౌరాష్ట్రాంగకాంభోజఘూ
ర్జరసౌవీరవిదర్భకోసలవయోజాతాననాదర్శకా
కురుకాశ్మీరమరాటలాటవిలసత్కోకస్తనీమన్మథా. 205

క. మందరపర్వతధీర పు, రందరవిభవాభిరామ రతిరమణాకన
త్సుందరకైలాసశర, త్కంధరసంకాశ విమలకమనీయయశా. 206

స్రగ్విణీ. లింగమాంబాసుతా శ్రీవిహాస్నైకపా
దాంగధ్యానలీనాత్మ గాంగేయగ
ర్భాంగనాస్తకీహారజిహ్వాస్థలీ
రంగ సారంగదృగ్రాజమీనధ్వజా.

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్రకౌండిన్యమునిచక్రవర్తిగోత్రసకలసుకవిజనా
నీకమిత్రదేచనామాత్యకుమారవినయవివేకవిద్యాలంకారశంకరకవి నామధేయప్రణీ
తంబయిన హరిశ్చంద్రోపాఖ్యానంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.



## తృతీయాశ్వాసము.



మహనీయపాత్రీభవ
హేమాచలరాజసైన్య హితబంధుజన
స్తోమా మద్ధాత్రీపతి
భామాజనపుష్పవల్లి బాలయ యెల్లా. 1

వ. ఆకర్ణింపు మహాపాండవాగ్రజునకు మార్కండేయుండిట్లనియె.

క. ఆపగిది గొనియాడి మ, హీపతి వీడ్కొనుచు మునికులేశ్వరు దరిగన్
భూపాలకమణియు నయో, ధ్యాపురమున కేగి సముచితస్థితి నుండెన్. 3

ఉ. అంతలొకనాడు కౌశికమహాముని యుగ్రతకాల్యకృత్యుడై
పేర్మి దలిర్ప శిష్యజనబృందము గొల్వ వసుంధరాధిప
గ్రామణి పూని బొంక నమకట్టు నుపాయము నాత్మలోపలన్
వేమఱు నూహించుచును వేడ్క నయోధ్యకు వచ్చె నచ్చటన్. 4

సీ. వచ్చి సర్వంసహాధవుడు గాంచి దీవింప, నత్యంతభయకంపితాంగు డగుచు
గద్దియ డిగ్గి భూకాంతుండు సాష్టాంగ, దండప్రణామంబు తగ నొనర్చి
మణికుంభపూర్ణ నిర్మలజలంబుల నర్ఘ్య, పాద్యాదు లిడి మధుపర్క మొసగి
సకలవైభవముల సామ్రాజ్యసింహాస, నాసీను గావించి యాత్మ నెంచ

గీ. సచివసామంతకింకరజనుల బ్రజల, వేగ రావించి వారితో విశదవాక్య
సరణి గౌశికునకు మహీచక్ర మెల్ల, ధారవోసినమాడ్కి మంత్రయును జెప్పె. 5

క. లోకముల కెల్ల నేలిక, యీకౌశికమౌనివర్యు డీతనిపదనా
ళీకములు గొల్చి యుండుడు, ప్రాకటతాత్పర్యవినయభక్తులు పొదలన్. 6

తే. సుతసతీయుక్తముగ నేను ధృతి దలిర్ప, విపినభూముల కేగెద వేడ్క ననిన
నధికశోకార్తులై వార లవనిభర్త, నడుగుదమ్ముల కెరగి యిట్లనిరి బెదరి. 7

ఉ. సల్లలితప్రతాప ఘనసత్యవచోరచనాకలాప మీ
చల్లదనంబునం బ్రిదికి సమ్మద మొందగ నేటిదాక నే

మెల్లమనోరథంబులు నధీనతఁ గల్గఁగ సౌఖ్యవృత్తిమైఁ
నల్లెడలుంగుబిడ్డలవిధంబున నుంటిమి యేపు చూపుచున్. 8

క. దారుణశార్దూలమునకు, సారంగములట్లు మము విచారింపక యీ
క్రూరునకు నప్పగింపఁగ, నేరూపున బుద్ధి పుట్టెఁ గృప వదలి నృపా. 9

సీ. రుచిరామ్రపల్లవారుణజటాపటలంబొ, పొలుపొందుఘనసితత్రిపుండ్రకంబొ
లాలితరుద్రాక్షమాలికాజాలంబొ, హరిసారంగచర్మాంబరంబొ
సురుచిరస్ఫటికాక్షసూత్రవితానంబొ, మండితదండకమండలువులొ
మహనీయజపహోమమంత్రతంత్రంబులొ, తరుణదర్భాంకురస్తబకచయమొ
గీ. తపమొ సంతతతపోవనప్రవృత్తంబొ, కందమూలంబులో వ్రతోపకరణచయమొ
యడవులనె పాయకుండుసంయముల కేల, వసుమతీనాథసామ్రాజ్యవైభవములు.

ఆ. ఇతని చిత్తవృత్తి నెఱిఁగి మే మేరీతిఁ, గొలుచువార మధికకోపి యితఁడు
మిహిరకులవరేణ్య మీ వెఱుంగఁ బోఁడొక్కని, యరుగవలయు మమ్ముఁ గరుణ ననిన.

ఉ. తోయజసంభవోడుఁ దలమూఁగఁగ నొప్పెడు పుణ్యమూర్తి గా
ధేయుఁడు మీర లీతనియుదీర్ణమహత్వ మెఱుంగ లేరు గాం
గేయ వసుంధరాధరము నెంటిన నెంటు సమస్తసన్నుతా
మేయతపఃప్రభావమున మిక్కిలి మేటి మునీంద్రకోటిలోన్. 12

తే. బ్రతుకవలసినఁ బ్రతికూలభావ ముడిగి, నాయనుడివిననుడువున నడవుఁ డనుచు
నుచితభంగుల వారల నూఱడించి, మనుజనాథుండు మునిశిఖామణికి మ్రొక్కి.

చ. వినయముతోడ భూప్రజలు వేయివిధంబుల సేవ సేయఁగా
మునికులముఖ్య వైభవసమున్నతి రాజ్యము సేయుచుండ నేఁ
జనియెద నన్న లేనగవు సారెకు నాననపంకజంబునన్
జనము నొంద నిట్లనియె సంయమివర్యుఁ డవార్యవైఖరిన్. 14

చ. ఇలకు నధీశ్వరత్వము వహించిననాకు ధరించు టొప్పుఁ గా
నలబడి నేగు మీ కివి యనర్హము లేటికిఁ జాల్ప నెందు ని
ర్మలమతి వంచు నాత్మ ననుమానము లేక తదీయరత్నభూ
షలు నిఖిలంబుఁ గైకొనియెఁ జయ్యన నిర్దయచిత్తవృత్తియై. 15

తే. కైకొనినఁ జాల్మి నెలఁగ భూకాంతుఁ డపుడు, సుతసతీయుక్తుఁడై గాధిసూనుపాద
పద్మయుగళికి మఱియును భక్తి మ్రొక్కి, పురము వెల్వడియల్లన నరుగు నెడను. 16

సీ. త్వరితంబ నృపుఁగూడఁ బఱతెంచి యల్లన, నలుక జనింప సంయమివరేణ్యుఁ
డలనాఁడు నిను మేము యజ్ఞార్థ మడిగిన, ధనము నీయొద్దనే యునిచినాఁగ

మాపి త్తి మీయక పోవంగఁ జూచెద, విది వివేకములోనిదే తలంప
ధరణీశ మఱచినఁ దలపింప వలదె య, న్యద్రవ్యమునకు దురాశ యేల
గీ. ఋణము దీర్పక యుండుట గుణము కాదు, మంచివారికి మది వివేకించి చూడ
నందులోపల మిగుల బ్రాహ్మణులసొమ్ము, నపహరించినఁ బాపించు నత్యఘంబు.
క. భూవల్లభ మను ధరణీ, దేవున కొడఁబడిన స్వాపతేయము పిదపన్
వేవేగ నీకయంకిలి, గావించినఁ దలఁపరాని కలుషము లొదవున్. 18
తే. ఎఱుఁగ కొదవించె నేనియు నిను కులేశ, విప్రదత్తాపహారణ ముర్వీశ్వరునకుఁ
జాలఁ గల్మష మొదవు సంశయము లేదు, మఱచి సర్వంబుఁబట్టినఁ గఱవకున్నె
చ. అనిన నృపాలుఁ డమ్మునికులాగ్రణి పల్కెడు కాఠిరవాక్యముల్
విని కర ముల్కి యాత్మఁ గడువేదన నొందుచు నోమహాత్మ మ
త్ఘ నతరరాజ్యసంపదలు దాఁచక సర్వము నీకు నిచ్చితిన్
దనివి వహింప కిట్లుఁ దగునా యపరాధము లెన్న మాటికిన్. 20
చ. ఉడుపతిశేఖరమూర్తి నని యొండుదలఁపులు మాని భక్తి నీ
యడుగులు గొల్చి కీర్తి మహిమాధ్యుఁడ నయ్యెద నంచు నున్న నా
యెడ హృదయంబులోఁ గృప వహించి తపోధనవర్య సారెకుం
బెడదలు చుట్టి యిప్పుఁ బయిఁ బెట్టక యింతటఁ దృప్తిఁ బొందుమీ. 21
వ. అనిన బాలకురంగంబు నాలోకించు నాభీలశార్దూలంబునుం బోలెనమ్మునిశార్దూలంబు
రోషాకారంబు వహించి హమ్మని యదలించి యిట్లనియె. 22
తే. నెయ్యమునఁ దొల్లి నీవు మాకియ్యకొనిన, ధనము వేడిన నిట్లాడదగునె నీకు
సత్యవాచాధురీణత జరపె దేని, విత్త మంతయు దెచ్చి వేవేగ నిమ్మ. 23
క. ఇలఁ బూర్వద్రవ్యమునకు, సెలవుగ నిచ్చితివె నిజము చెప్పుము నీమా
టలు నేటిదాఁక నన్నృతంబులు పొరయవు నేఁ డిదేల బొంకఁగ నీకున్. 24
చ. అనుటయు మేదినీరమణుఁ డామునివర్యుతలం పెఱింగి నె
మ్మనమున ధైర్యసంపదలు మాటికిఁ బాదుకొనంగఁ జేరి వం
దన మొనరించి యోమునిజనస్తుత యిప్పుడు జోకఁజేసి మీ
ధన మొసఁగంగ లేనిపరితాపమునన్ మిము నిట్లు పల్కితిన్. 25
క. సంశయ మేటికి నోముని, వంశాగ్రణి యిచ్చెదన్ భవద్విత్తము నేఁ
ద్రింశద్వాసరముల కిహిమాంశుఁడు చంద్రుండు సాక్షి యట్లీకున్నన్. 26
సీ. కొంచక మము వికర్ణయించి నైనను మీధనంబుఁ గైకొనుఁడు సర్వంబు ననిన
నట్లకా కని మానవాధీశు వీడ్కొని, యరిగి నత్వరగతి మరలి వచ్చి

యుక్తిశ పాడమె నా కొకవిచారము నము, పాఱుతం బగువిత్త మనుదినంబు
నన్ను పాపమ్ములప న్నిలు వెచ్చంబుఁ జేసిన నెంతయు మోసమరయ
గీ. ననుచుఁ దనకిష్యవితతిలో నధికకోపి, వివిధమాయాప్రకారప్రవీణబుద్ధిఁ
బరుషభాషణు నిర్దయు క్షయదచరితుఁ, గఠినచిత్తుని శను నక్షత్రకునిని. 27
వ. కనుంగొని కదియం బిలిచి తదీయకర్ణంబునఁ గొన్ని కపటక్రియావిశేషంబులుపదేశించి
నీ వీనృపకుంజరు వెనువెంటం జని మాయాసెలవులం గూడంబడిన ధనంబు సర్వం
బును వ్యయంబు సేయ నీయక క్రియంబు దక్కి రయంబునం గైకొనుచు
వేలనుం బోక్కనుం బోయక నిరంతరపథపరిశ్రాంతులం గుందించియు క్షుత్పిపాసా
పరవశత్వంబు నొందించియుఁ దారిద్ర్య మాలించియు దైన్యంబు గీలించియుఁ గాంభీ
ర్యంబు వదలించియు ఘనతరక్రోధంబున నదలించియుఁ దీర్ఘశద్వాసనంబులనుసీ వ
శేషంబునితం డొడంబడిన ధనంబుఁ దెమ్మనినియమించియమ్మహీపాలునాలోకించి.
తే. ఇతని మీవెంట నోడ్కొని యేగిభక్తి, గొనలుసాగంగ నను గనుంగొనినయట్లు
కనుగొనంపఁగు నాయాసమునకునోర్వ, లేడు సౌఖ్యంబు జరప్రడీ నేడు మొదలు.
మ. అని నక్షత్రకు నప్పగించి నృపముఖ్యా నిన్ను పుద్భూమిలో
ఘనదైన్యంబున నాళ్ళవెంట నడుగంగా నీను నీ వేవిధం
బున మావిత్తము నేకజేసెదవు నేర్పు ల్మెఱ దద్భంగి య
ల్లన నొక్కింత యెఱుంగ జెప్పదగు నీలాగు ల్నిరీక్షించెదన్. 30
ఉ. ఊరక దీనతంబొరయ కో ధరణీశ్వర యింకనైన నా
కూరిమికాంతులం గమరకోలకవిస్ఫురణాపహాసి వ
క్షోరుహభారసంచలితమాత్మతమోదరల న్వరించి వి
స్తారవిశేషరాజ్యరమ సర్వమునిచ్చెద బూను నావుడున్. 31
మ. వనజాతాసన ధీనిధీ వినుడు దేవబ్రాహ్మణక్షేత్రముల్
పనిలే వేమియు మాకు మున్నె వివరింపం తత్ప్రదేశంబులన్
ధనమార్జించి రయంబ మీ ఋణము సత్యస్ఫూర్తిమై దీర్చెదన్
ననుఁ బల్మాఱును మిన్న కేమిటికి సంతాపంబు బొందింపగన్.
తే. దయ మనంబున దలపక తలచితలచి, వట్టి కుచ్ఛితములు పన్న వలదు మమ్ము
వెతల బెట్టఁగ దెగి సాగి వెడలనిందు, కినుక చాలింపు డేను మీకింకరుండ. 33
క. అని కౌశికు నొడబడ జెప్ప నరేశ్వరు డరిగె నాత్మ బెనగొనుధైర్యం
బున మఱి యేమియు బలుకక, వనితా సుతసహితు డగుచు వనభూములకున్. 34

వ. అని చింతాక్రాంతుండై కాంతారత్నంబు నూరడించుచుఁ గరాంబుజంబు నవలం
బంబుగా నొసంగి నిజభుజాపీఠంబునం గుమారుని నిడుకొని ధైర్యం బణుమాత్రం
బును జెదరనీకఁ జనుచుండె నంత. 40

తే. దీనగతి లేనిబడలికఁ దెచ్చుకొనుచు, గపటవర్తనుఁ డైననక్షత్రకుండు
బెట్టునిట్టూర్పుఁ బుచ్చుచు మిట్టిపడ్డు, నేలఁగూర్చుండఁబడి మహీపాలుఁజూచి. 41

చ. అలసితి నింక నొక్కఁడుగు నైనను నే నడువంగ నోపమిం
గలయఁగ ఘర్మబిందువులు గ్రమ్మెఁ బదంబులఁ బొక్కు లుబ్బె శీ
తలసవిధక్షమారుహవితానమునీడకు నన్ను జేర్పు భూ
తలపతిముఖ్య దేహమున దాహభరంబు జనించె నెంతయున్. 42

తే. నీకు సత్త్రాణరక్షావివేక మాత్మఁ, సంభవించినయేని విశ్వంభరేశ
మేటిజవమున నరిగి యెచ్చోట నైన, విమలజలములు దప్పికి వెదకి తెమ్ము. 43

సీ. అనిన మహీకాంతుఁ డత్యంతదుర్వార, చింతాపరంపరాక్రాంతుఁ డగుచు
జనపదం బైన గోష్ఠం బైన నొక్కటి, వెదకి చేరక యుండ విఘ్న మయ్యె
మునికుమారుం డింక మూరెడు మేరయు, నడువలే ననుచు నట్టడవిలోనఁ
గదలకయున్నాఁడు గడు ప్రమాదము పుట్టె, పథపరిశ్రాంతి యెబ్భంగి నణఁగుఁ
గీ. పై తరువుకానఁగాఁగ నీబ్రహ్మచారి, నేలఁ దోడనె పంపె మునీంద్రుఁ డకట
యేమి ప్రాపించునో యింక నీశ్వరాజ్ఞఁ, గడవ వచ్చునె యెంతటి ఘనున కైన.

క. అని తల్లడించుచుండఁగ, నినకులవల్లభునిఁ జూచి యిట్లను హృదయం
బున దాల్మికలిమి వొడమఁగ, వినయోక్తులఁ జంద్రమతి వివేకస్ఫురణన్. 45

మ. నిరవద్యస్థిరసూనృతోక్తిరచనానిర్నిద్రధాత్రీతలే
శ్వర నక్షత్రకుఁ డెంతయుం బడలెఁ దీవ్రం బైనయెండం దనూ
స్ఫురణం బెల్ల నడంగె నింక నడవం బ్రొద్దేమియున్ లేదు భా
స్కరబింబం బపరాద్రికిం జనియెఁ గెంజాయ ల్విడంబింపఁగన్. 46

తే. మునికుమారుండు డస్సిన మోస మరయఁ, బెంపు దూలంగ నిఁక నడిపింప రాదు
పుత్రకుని నైన విడిచి నక్షత్రకుని, యెలమి రక్షింపవలయు నేఁ డిచట నిలిచి. 47

ఉ. శీతలనిర్మలాంబుకణసేచనకృత్యము లాచరించి ధా
త్రీతలనాథయూఁకటికిఁ జెయ్యనిపంక్తిను బెట్టి పల్లవ
వ్రాతవినిర్మితవ్యజనవాయువు లల్లన సోఁక ధీరతా
స్ఫీతమతి స్పృశించి తగ వీతపరిశ్రముఁ జేయుఁ డీతనిన్. 48

చ. అనవుడు నట్లకాక యని యమ్మహిపేంద్రుఁడు నెమ్మనంబునన్
మునిసుతరక్షణప్రవణముఖ్యకృపావిభవంబు మాటికిం
బెనఁగొన నీటికందువ యభీష్టగతి న్వెదకం దలంచి కా
ననతరువీథులం గలయ నాలుగుదిక్కులు చూచుచున్నెడన్. 49

వ. వెనువెంటం దగిలి యవ్వ్యాఘ్రాకారుండై చనుదెంచు విశ్వామిత్రుం డత్యంతకోపాటోపం
బున నమ్మహీపతికి నంతరాయంబు లాపాదించు నుపాయంబు నిజస్వాంతంబున జింతించి
దంతఘాతకుం డను నొక్కనిశాటునిఁ దనమాయాపాటవంబున గల్పించి యానక్తం
చరున కిట్లనియె. 50

తే. తపనుఁ డపరాబ్ధిఁ గ్రుంకునంతకుఁ ద్రిశంకు, సుతుని మాయలఁ బెట్టి యాచ్చోటనిల్పి
దారుణం బైనయల్లభేతాళవటము, క్రింద వసియింపఁ బనుపు మీ రేయి నతని. 51

ఉ. హాలహలానలప్రతిముఁ డవ్వటభూజమునందు నున్న భే
తాళుఁ డఖర్వగర్వమున దైవతకోటుల నైనఁ బట్టి యా
భీలగతి న్వధించు నని పేర్కొన మర్త్యుల నేమి చెప్ప శా
ర్దూలము జింకలం బొదివి త్రుంచువిధంబునఁ ద్రుంచు నగ్రతన్. 52

వ. కావున నీప్రయోజనంబు సమకూర్పు మనుటయు మహాప్రసాదం బని యాతం డంత.

సీ. రమ్యభూతిత్రిపుండ్రము లలాటంబున, నక్షీణరుద్రాక్షదామంబు లలిత
విపులసారంగచర్మము కటిస్థలంబునఁ, బాలాతపాభజటాళి మౌళి
సురుచిరస్ఫటికాక్షసూత్రంబు కరమునఁ, దరుణసర్వాంగకాంతులు వ్రేళ్ళ
నవకంపుఁ దామ్రకుండలములు వీనులఁ, బొందుగా నుదరబంధంబు నడుమఁ

గీ. చెలువు దీపింప భానుమండలముతోడఁ, దనతనూదీప్తివిభతి మంతనము లాడఁ
గపటవృద్ధతపోధనాకారుఁ డగుచుఁ, మానవాధీశుఁ డరుదెంచుమార్గమునను. 54

వ. మనోహరతపోవేదికాగ్రంబున వ్యాఘ్రచర్మాసనాసీనుండును సమీపవిన్యస్తదండ
కమండలుండును ముకుళీకృతనేత్రకమలుండును మిథ్యావిహితజపధ్యానతత్పరుండును నై
యుండుటయు మార్గవశంబున వచ్చి కనుంగొని యమ్మహీధవపుంగవుం డతని నిక్కం
పుమౌనిగాఁ దలంచి వినయపూర్వకంబుగా నమస్కారం బొనర్చి కోరకితకరసరో
రుహుండై యిట్లనియె. 55

చ. విలయకృశానుతుల్య మగు వేఁడిమి నీనిబిడాతపంబు మి
క్కిలి తపియింపఁ జేయ నతిఖేదము నొందె శరీర మెల్లమీ
లలితకృపావలోకనముల న్మనుఁ గన్గొని నామనంబు శీ
తలముగఁ జేసి వత్సలత, దద్దయుఁ బ్రీతి ననుగ్రహింపరే. 56

ఉ. ఓఋషివర్య దుష్టమృగయూథసమన్వితమైనగ్రామ్యకాం
తారములందు దుర్గమపథంబుల దిరిగ్మురి మత్పురాత్రితో
దారవిశేషపుణ్యముకతంబున దావకపాదపద్మముల్
చేరఁగ గంటి నొక్కఁడనె చేరితి ధన్యుడనైతి నావుడున్. 57

తే. పెద్దయును బ్రొద్దునకు నేత్రబిసరుహములు, విచ్చి భూసంజ్ఞఁజేసి భూవిభునిదిక్కుఁ
జూచి మారయూపరిజ్ఞానసుమచిరోక్తి, మహిమ నిట్లను బ్రత్యక్షమౌనికరణి. 58

క. ఎంతయును బడలితివి పథ, శ్రాంతి మహీకాంత పెంపు సడలి భవద్వృ
త్తాంత మంతయుఁ దెలిసితి, నంతర్జ్ఞానకళామహత్త్వమువలనన్. 59

సీ. సాంద్రకీర్తి ప్రథఁ జక్రవర్తిత్వంబు, గనిన యాహరిశ్చంద్ర మనుజపతివి
నీవు ప్రదాతవై నిఖిలరాజ్యమునొక్క, తాపసవరునకు ధారవోసి
యతనికి మున్ను మఖార్థ మిచ్చెదనని, పలికిన విత్తంబు పడయఁగోరి
పురము వెల్వడి సతీపుత్రయుక్తుండవై, వారణాశిపురి కరుగుచుండ

ఆ. ధనమునకుఁగాఁగఁ నీమీఁదఁ దపసియాజ్ఞఁ, బైతరువ వచ్చి మునితనూభవుఁడునొచ్చి
ఘనపిపాసాతురుండైన గాంచి వేఁడి, వచ్చితివి నీవు వెనక భూవరలలామ. 60

వ. అట్టయును సత్యైశ్వర్యంబును బొంది హరిశ్చంద్రుండ దతనికిఁ బునఃపునఃప్రణామంబు లాచరించి మహాత్మా నీచరణారవిందంబులు సేవించి నతుత్రికరణశుద్ధంబు భవదీయాశ్రమంబున నేఁను విశ్రమించెద నని మఱియు నిట్లనియె. 61

ఉ. శ్రావణవీథుల నెండకి యేను జలంబులఁ దెచ్చునంతకున్
జీవము నిల్వ నోపఁ డలసెన్ మునిపుత్రుఁడు దప్పి జెంది తే
నో విజితార్క నా కపయశోదురితంబులు రాకయుండ మీ
పావనకుండికాజల మహాకృపారతిఁ బోయఁగాఁ దగున్. 62

చ. అనవుడు మందహాసమున నక్కపటాత్ముఁడు భూమిపాలుతో
ననియె దినేంద్రవంశజ రహస్యమున న్మునివృత్తి పూని కా
ననముల నున్నమా వెలవున న్వసియింపఁగరాదు మీకు నె
మ్మనమున మా కపాయమగు మానినులం గనుఁగొన్న డాసినన్. 63

మ. సలిలం బల్పము మత్కమండలువులో సర్వంసహాధీశ త
జ్జలపానంబున మానినందనున కేచందంబునం దీఱెడిన్
దలమై పర్వినదప్పి యప్పలుకు దాఁ దర్కించినం బుద్ధి యే
తెలియం జెప్పెద నీటికందువ మనోదేశంబు మోదింపఁగన్. 64

సీ. విను మిచ్చటికి గూతవేటుదూరంబున, గల దొక్కహ్రదము నిర్మలజలంబు
తత్తీరభూమి విస్తారశాఖలచేత, విలసిల్లు నొకవటోర్వీరుహంబు
పుత్రికళత్రసత్పుత్రికసహితుండ, వై యల్లనల్లన నచటి కరిగి
మార్గపరిశ్రాంతి మానునట్లుగ బయః, పానం బొనర్చి యాపాదపంబు
గీ. క్రింద వసియింపు మీరాత్రి నృపవరేణ్య, యచటు దక్క నీకు నన్యప్రదేశ
మిరవు గాదని చెప్పి యదృశ్యుఁడయ్యె, గపటసంయమి యైనన క్తంచరుండు. 65
క. ఆయెడ నానాపక్షిని, కాయములు కిశోరయుతముగా మేఁతలకుం
బోయినవి మరలి వచ్చి కు, లాయంబులు చేరె గలకలధ్వను లెసగన్
క. మనుజపతి పొందుదుఃఖము, గనుగొనగా లేక చనినకైవడిఁ జనియెం
తనకిరణనికర మొయ్యె, య్యన మణుప్రచుఁ దపనబింబ మపరాంబుధికిన్. 67
సీ. కంధరపటలసంకాశంబు లగునంధ, కారము ల్తోరణగట్టె దిశల
వ్యోమసీమం జెల్లఁ దామెరయై తారక, స్తోమము ల్నిండి తోడ్తోనఁ బొదలె
విరహాగ్నిశిఖలచే వేఁగి రథాంగప్రంపర ల్మిగుల దుఃఖింపఁ దొడఁగె
భీకరానేకవల్మీకరంధ్రంబులు, వెడలి చరించె దర్వీకరములు
గీ. వెల్లువిల్లీనినదము ల్పిక్కటిల్లె, మిగుల దఱచుగ ఘూకము ల్మొలఁగి యాడె
నిబిడముగ శాకినీఢాకినీపిశాచ, భూతభేతాళసంచారములు చెలంగె. 68
వ. ఇట్టిభయంకరనిశాసమయంబున నమహీశ్వరమణుం డక్కపటతపోధనుండు చెప్పిన
వటవిటపిచక్కటికిం జన నమకట్టి పట్టిం దనభుజంబునం బెట్టుకొని నతుత్రికుని వీపు
నగడియించి చంద్రమతిం జెట్టు బట్టుకొని నిజభుజాదండమహోగ్రమండలాగ్రప్ర
భాపటలవిశదీకృతదుర్గమమార్గాంధకారుండై చనిచని. 69
తే. మత్స్యకచ్ఛపభీకరమకరనికర, సంకులంబును వన్యసలిలపాన
గళగళధ్వానపూర్ణదిక్పథము నైన, హ్రదముఁ గన్గొనెఁ దనదుకట్టెదుర నృపతి. 70
మాలిని. తొరము లై వికసించినకైరవతోయరుహంబులు మత్తమధుం
కారములుం బహుళంబుగఁ బర్విన క్రౌంచరథాంగబకవ్రజసం
చారములు న్వటసాలరసాలకుచందనభూజవితానలస
త్తీరములుం గడు సొంపు దలిర్ప నుతింపఁదగున్ హ్రదముజ్జ్వలమై. 71
వ. ఇవ్విధంబున నున్నహ్రదంబుం గనుంగొని. 72
సీ. తత్తీరభూమి నందఱ నిల్పి వారికి, సలిలపానక్రియాసౌఖ్య మొసఁగి
తానును బ్రక్షాళితశరీరుఁడగుచు సా, యంకాలవిధులు చయ్యన నొనర్చి

మధురంబు లైననిర్మలజలంబులు గ్రోలి, యధ్వపరిశ్రాంతి నపనయించి
ధైర్యవివేకగాంభీర్యముల్ వ్యాపయార, విందంబులోపల సందడింప

సీ. మానినందనునకుఁ జంద్రమతికి లోహి, తాస్యునకు నిద్రపోవ నగ్రస్థలంబు
వెదక దగు నని యొయ్యన వదన మెత్తి, కోరి నలుదిక్కులను గనుంగొనెడితతని.

ఉ. ఓలి ననేకఘూకనివహోగ్రరవంబులు గోటరాంతరా
ఖీలభుజంగఫూత్కృతులు జెల్లఁగ నొక్కట నిక్కటిల్ల భూ
తాళికి నాలయం బయి పురారికి నైన భయంబు జేయుభే
తాళవటంబు గాంచి వసుధాతలనాథుడు వీతభీతియై. 74

క. బహువిధశాఖాపటలీ, పిహితాఖిలదిక్తటంబు భేతాళవటం
బహిమకరకిరణసముదయ, విహరదుర్గమవటంబు వీక్షించె దగన్. 75

వ. ఇట్టిదారుణబహుపాదమహీరుహంబు నిరీక్షించి యవ్వసుంధరాధ్యక్షుండు. 76

తే. కడగి సాహస మొదవ శంకావిహీన, మానసుండయి చేరి యామ్రానిక్రింద
లేఁతకసవున శయ్య గల్పించుటయును, సారిది నక్షత్రకుండందు సుప్తుఁ డయ్యె.

చ. ధరణిశలేశుదేవియును దర్పకపద్మసమీపభూస్థలిం
బోరిబోరి గ్రమ్మదుఃఖమునఁ బుత్త్రుడు దానును నంశుకాంచలా
స్తరణమునందు హస్త ముపధానముగా నొనరించి వెండి దు
స్తరమగునాకటం బడలి దైవము దూఱుచు సుప్తి బొందెఁగన్. 78

మ. అపుడాచందనగంధి గంధకరిణీయానం గురంగాక్షి వం
శపవిత్రిన్నవపల్లవాధరపుట న్సంపూర్ణచంద్రాననం
జపలావల్ల్యుపమానదేహలతికన్ జాయన్విలోకించి యా
నృపవంశాభరణంబు మానసములో నెంతేవిచారంబునన్. 79

తే. అధిక మైనపథశ్రాంతి నావహించి, సుప్తి నొందెడువీరి కిచ్చోట దుష్ట
మృగపిశాచభయం బంకురింపకుండఁ, గావదగు నాకు జాగరూకత్వమునను. 80

చ. అని తలపోసి భాస్కరకులాగ్రణి యుగ్రకృపాణపాణియై
యనిమిషవంద్యు జంద్రధరు నార్తజనావనదక్షు శంకరున్
మనమున నిల్పి నీవ గతి మా కని పల్కుచు నాల్గుదిక్కులుం
గనుగొనుచుండె నెచ్చరిక గల్గి తలంకక వీతనిద్రుఁడై. 81

ఆ. అంత నర్ధరాత్రమగుటయు నవ్వటో, ర్వీరుహంబునందు విడువకుండు
భయదవికృతభూతచయము లూడలవెంట, నవనిభాగమునకు నవతరించి. 82

వ. ఇంతకాలంబునకు నిచ్చోట మనుష్యసంచారంబుకలిగెననిపరస్పరాహ్వానసంభ్రమం
బులు భయంకరహుంకృతిధ్వానంబులు ననూనంబులై దిశల జెలంగ నమ్మానవేంద్రు
నిగడిసి పొదివిన.

తే. శంక యొక్కింతయును లేక పంకజాప్త, కులవరేణ్యుండు తద్భూతకోటి నెల్ల
దగ్గఱకయుండఁ దఱిమి గాఢప్రతాప, వైభవంబున నెంతయు వాఁడి మెఱసి. 84

క. ఈయధమపిశాచంబుల, బాయక వధియించు టేమిపార్థివ మనితా
రోయుచు భుజగేంద్రమహో,గ్రాయతకౌక్షేయకమున నబ్భూతములన్. 85

వ. తూర్ణంబ కర్ణనాసికాచ్ఛేదంబు గావించుటయు నత్యంత ఖేదంబును బొంది నిజాధీ
శ్వరుండగు భేతాళునకు నన్నియుఁ దెలియవిన్న వించుటయు నతండును భీషణరోషా
వేశంబున. 86

శా. ఎట్టెట్టో మము నొక్కమానవుఁడు దా నెంతే నహంకారియై
బిట్టుల్కుం దెగి యింతచేసెనె కడున్ భీభత్సరూపంబుగాఁ
కట్టా యేగతి నింక వాఁడు నిలువంగా నేర్చు నాముందటన్
జట్టుల్ చెదరఁ బొట్టు వ్రచ్చెద భుజాశౌర్యం బవార్యంబుగన్. 87

ఉ. వెట్టితనంబు గాక యరవిందజు కైనను జేరరానినా
మట్టికెలంకున న్మనుజమాత్రునకు న్నిలువంగ వచ్చునే
యిట్టికినుండ శక్యమగునే వివరింప సివంగిచెంగటన్
జుట్టెదఁ దత్తనూపలలశోణితధారలు పొట్టనిండఁగన్. 88

శా. ఇం దాశూలికినైన విచ్చలవిడిన్ హేలం జొరన్ రాదు ని
స్సందేహంబుగ నావటంబు నరుఁ డేజాడం బ్రవేశించెనో
యెందు న్మిక్కిలి యద్భుతంబు మది నూహింపంగ వంటింటిలోఁ
గుండే ల్వచ్చినచంద మయ్యె నిది పెక్కు ల్మాట లింకేటికిన్. 89

వ. అని భయంకరాటోపంబులం బేర్చి పెల్లార్చుచు భూతప్రేతపిశాచఢాకినీసంఘాతం
తంబులు గణనాతీతంబులై సేవింపం బెంపు మిగిలి. 90

సీ. పరుసగుజుంజుఱుపల్లవెండ్రుకలజొంపము, మారుతమునఁ గంపంబు నొంద
విలయమేఘాకృతిఁ దలఁపింపగాఁ జేయు, నొడలిపైఁ జీకటి ముడివడంగ
జంద్రనిప్పులకంటె వేండ్రంబు లైనట్టి, కన్నులఁ గోపాగ్నికణము లురులఁ
బ్రేవులు నరములుఁ బెనఁచినతలకాయ, పేరులు గళమునఁ బెనఁగొనంగ

గీ. నుడుగ కందంద త్రావుచో నురముమీఁద, వఱదలై గ్రొత్త నెత్తురు గిరికొనంగ
గతుముల నున్న కుణపంబుఁగఱచికఱచి, పలలకబళంబు మెసఁగుచు భయదభంగి.

తే. కాలసర్పంబుతోడుత మేల మాడఁ, జాలుశాతత్రిశూలంబుఁ గేలఁ బూని
ప్రబలహుంకారఘోషంబు ప్రళయసమయ, మేఘగర్జాధ్వనులకు నామ్రేడితముగ.

వ. దీర్ఘనిర్ఘాతపాతనిష్ఠురచరణఘట్టనక్రియావిహ్వలీభూతపాతాళుండై యేతెంచునబ్భీ
తాళునిం గనుంగొని నిర్భయహృదయాంతరాళుండై భూపాలుం డస్తమితసమస్త
విరోధివరూధినీజాలం బగుకరవాలంబు జళిపించుచు. 93

తే. అభిముఖంబుగఁ గొంతదవ్వరిగి వాని, కడ్డమై నిల్చి యిటురాక యరుగుమోరి
నిగిడి యరుగక వచ్చిన నీదుప్రాణ, వాయువులఁ గ్రోలునాదుకౌక్షేయకాహి. 94

క. నావుడు నబ్బేతాళుఁడు, భూవల్లభుమోముసూచి పొరిఁబొరి ఘనరో
షావేశం బొదవఁ గను, గ్రేవల నిప్పు లుఱుల నెరలుచు బలికెన్. 95

సీ. ఎవ్వఁడ వీవు నా కెదిరి భాషించెదు, శంక యింతయు లేక సాహసమున
బులి యున్నపొదరిల్లు లలి జింక చొచ్చిన, గతి జొచ్చితి మదీయగహనభూమి
నెక్కడి కేగెద వింక నాముందర, మిగ్రింగెద నహి కప్ప మిగ్రింగుకరణి
గీర్వాణగంధర్వకిన్నరపన్నగ, యక్షరాక్షసముఖ్యులైన నన్ను

గీ. జెనక వెఱతురు నీ విట్లు చెనక నగునె, నాదువిహరించునట్టి క్రిందనె వసించి
తివిరి తదరిక్షకుల భూతనివహములను, భంగపఱచితి నామిత్రబాంధవులను. 96

క. శంకరుఁ డడ్డము వచ్చినఁ, గొంకక వారించి నాదుక్రోధాగ్నికి ని
శ్శంక నినుఁ బట్టుకొని యే, యంకిలియును లేక వేల్తు నాజ్యాహుతిగన్. 97

చ. అని భయదాట్టహాసములు నార్పులు బొబ్బలు హుంకృతిధ్వనుల్
గొనకొని పర్వ గర్వము నకుంఠితశౌర్యము నుప్పతిల్లను
బ్బున నిజకింకరోగ్ర బహుభూతచయంబులతోడఁ గూడి య
య్యినకులవల్లభుం బొదువ నిట్లని పల్కె నృపాలుఁ డల్కతోన్. 98

క. ఏనెక్కడ నీ వెక్కడ, మానవసామాన్యుఁ డనుచు మదమున నెఱుగం
గానేరక ననుఁ బొదివెద, హీనమతిం దొలఁగి యరుగు మెందుల కైనన్. 99

వ. అని పల్కి నయమ్మహీవరునిపైఁ గవిసి. 100

సీ. కినుకమై శూలంబు గేల నంకించి వై, చినఁ గలంగక దాని దునిమె నృపతి
మఱియును నతఁడొక్కమ్రాను పెఱికి భాను, వంశజునురము తీవ్రముగ గొట్టె
దద్ఘాత గదలక ధరణీరుహముతోడ, వానిహస్తము మహీజాని నఱికె
నందుచే గుండియు నతడు రెండవచేత, దఱచుగా బాషాణతతులు పఱపె

గీ. నాశిలాతతు లన్నియు బాసిపోవ, బెడిద మగువాడియడిదంబు బెట్టుత్రిప్పి
చేరి ఖండించె నానృపశేఖరుండు, చాలభీకర మైనభేతాళుశిరము. 101

వ. ఆసమయంబున మఱియును జలపట్టి యగ్గాధిపట్టి దయావిహీనస్వాంతుండై దుష్క-
రంబు లగు పుష్కలావర్తపయోధరచయంబుల భయంకరంబుగా వర్షంబు గురియ
నియమించిన. 102

సీ. ఘుమఘుమాత్కారనిర్ఘోషభీషణఘన, స్తోమసంఘాటితవ్యోమతలము
సంవర్తమృత్యుదంష్ట్రాద్యుతిప్రతిమాన, శంపాపరంపరాసంవృతంబు
కులసానుమద్గుహాకులమహాధ్వనిహేతు, పటుదీర్ఘతరాశనిపాతపటల
మాశామదావళీహస్తనీకాశవాః, పూరధారాసిక్తభూతలంబు

తే. తీవ్రతిమిరచ్ఛటాసక్తదిక్తటంబు, ప్రసులవర్షోపలానీకభీకరంబు
ఘనతరాభీలదుర్ధమకర్దమంబు, కురిసె వర్షంబు ధరఁగుంప గూల్చినట్లు. 103

క. వేళ్ళకు బెదపెదమ్రాకులు, పెల్లగిలం గొమ్మలెల్ల బెళబెళ విఱుఁగన్
బల్లిదపు గాడ్పు లేచును, బెల్లుగ జెలరేగి వీచె భీకరభంగిన్. 104

ఉ. ఆసమయంబున న్నరవరాగ్రిణి తా వటుబీజమాత్రమున్
వేసట లేక ధైర్యము వివేకము సత్యవచోవిలాసముం
బాసటయై మనోగతిని బాదుకొనంగ విపన్నరక్షకున్
వాసుకికంకణు న్మదనవైరి నుమావరుణుం దలంచుచున్. 105

తే. వాన దడియుచు గజగజ వణకుచున్న, సుతసతీమానిపుత్త్రుల జూచి వగచి
తొడలపై నిడుకొని వారిదుఃఖ ముడుగ, నూఱడించుచు దలఁక యుండుటయును.

క. సూర్యకులభర్తహృదయ, స్థైర్యంబున కాత్మ గాధితనయుఁడు కడు నా
శ్చర్యమును బొంది యీనృప, వర్యుని బోలంగ గలరె వసుధాధీశుల్. 107

తే. తగిలి నాచేయుకపటకృత్యముల నొగిలి, చిక్కఁ డయ్యె వృథాశ్రాంతి జెందె నకట
వెతగనై యీయరుంధతీవిభునితోడ, గలహ మేల యొనర్చితి దెలియ కేను. 108

మ. పురుహూతాదిసుపర్వులున్ మునిజనంబు ల్ప్రీతి బొందంగ నే
దురహంకారము రాజసంబు జలముం దోడ్తోన యుబ్బంగ దు
ష్కరసంధావచనంబు లేమిటికి మాత్సర్యంబునం బల్కితిం
జిరకాలార్జితమైనమత్తపము సంక్షీణంబు గాకుండునే. 109

క. మానుగ గార్యాకార్యము, బూనిన మది దెలిసి యాడ కొగి పెద్దలతో
దా నూరక కలహమునకు, బూనెడువా డపజయంబు బొందకయున్నే. 110

తే. ఇంక నిస్సంశయంబుగ ఋషివరేణ్యుఁ, డగువసిష్ఠుప్రతిజ్ఞాక్రియానిరూఢి
నెఱయ నీరేడుభువనవర్ణితముగాగ, ననుచు దనుదాన నిందించుకొనుచునుండె. 111

వ. అంత. 112

ఉ. సారెకు గూయ జొచ్చె బరుషధ్వని కుక్కుటరాజి మౌక్తిక
శ్రీరుచి వేగుజుక్క పొడిచెం దలమాపె ననూరురేఖ కా
సారతరంగిణీవిటపిసంతతి బర్వె శకుంతనాదముల్
మారము లయ్యెఁ జీఁకటులు మూరుపు దెల్వి వహించె వేకువన్. 113

క. అరవిందవనం బెందిం, దిరముల కొమెఁతలు వెట్టె దిననాథుఁడు ప్రా
గ్ధరణీధరశిఖరంబున, నరుణచ్ఛవి బొలిచె జనుల కతిముద మొదవన్. 114

తే. సూర్యుఁ డుదయింప నృపతియచ్చోటువాసి, యరిగిముందఱనొకసరోవరముగాంచి
యందు సంధ్యాదినిత్యకృత్యములుఁ దీర్చి, తాల్మికల్మి మనోవీథిఁ దళుకు లొత్త.

క. నానాతటినీతతులును, గాననములుఁ బర్వతములుఁ గ్రామములు మహా
స్థానీయంబులు గడచి య, హీనగతిం జనుచు నుండ నింతటిలోనన్. 116

వ. విశ్వామిత్రుఁడు వైశ్వానరుం బ్రియంబున నాకర్షించి యతనితో ని ట్లనియె. 117

మ. వసుధాధ్రంబుల నైన నీదుభయదజ్వాలావళిం జేర్చి యే
ర్చుసమర్థ్యము గల్గునీ కితరులం జోద్యంబె కో మర్త్యులం
బస మాల్చుట నీప్రభావము నుతింపన్ శక్యమే యేరికిం
బ్రసవాస్త్రుం బొరికొంటి వీవ పురజిత్ఫాలాగ్రనేత్రాకృతిన్. 118

క. తవిలి హరిశ్చంద్రమహీ, ధవు డరిగెడుమార్గభూమి దావకకీలా
నివహంబులచే నెంతయు, నవరోధ మొనర్పవలయు నత్యుగ్రముగన్. 119

వ. అనుటయు నట్ల కాక యని యక్కరువలిచుట్టంబు మహీవల్లభుం డరుగు తెరవునఁ
బ్రబలి యత్యంతదుర్గమంబుగా నిర్గళమారుతపరిచలితమహీరుహానోన్యసంఘర్షణం
బులవలనఁ బ్రచండగతిం బ్రభవించి యెండి రాలినకారాకుప్రోవుతండంబులఁ
దవిలి రవులుకొని భుజభుగాయమానంబులై పెల్లెగయుచు నిబిడాంధకారితవ్యో
మంబు లగుధూమంబులు జిటజిటాయమానంబులై యభంగురంబు లగువిస్ఫులింగం
బులును ధగధగాయమానంబులై మింటి నంటు నెఱమంటలును బెరిఁగి యొక్క మొ
గిం బిక్కటిల్లి చనుదెంచునద్దావానలంబు వీక్షించి మానవాధీశ్వరుండు మనంబునదుర
పిల్లుచుఁ జింతాక్రాంతుండై నిజకాంతామణిం గనుంగొని. 120

క. భీకరమై యెటుఁజూచిన, నోకాంత తరింపరానిహుతభుక్కీలా
నీకము కడుఁ బ్రబలెను నా, ళీకాసనువారిత గడవ లే రెవ్వారున్. 121

తే. తరళలోచన కాశికాపురముఁ జేరి, ఋషిశిఖామణి కౌశికు ఋణముదీర్చి
నిత్యసత్యవచఃకీర్తి నెగడకుంట, నిచట నంకిలి యయ్యె నింకేమి యనఁగ. 122

సీ. హరిణలోచన మన కగునపాయమునకుఁ, జింతింప నాత్మ నొక్కింతయైనఁ
దాపసాత్మజునకుఁ బ్రాపించుచున్నవి, మాదంబునకుఁ జాలఖేద మొదవు
గావున నొండు మార్గంబు లన్నియు మాని, చయ్యన నే బ్రవేశం బొనర్ప
హవ్యవాహనుఁడు మత్ప్రాణాహుతుల సంత, సిల్లి మీరెడ దయ సేయుఁ బిదప

గీ. ననుచు హృత్పంకజంబున నఖిలభక్త, గణవశంకరుఁ డైనశంకరుని నిలిపి
యతిభయంకర మైనకార్గ్గి కెదురు, చనియెఁ దెగువ హరిశ్చంద్రజనవరుండు. 123

వ. ఇవ్విధంబునం జనుజీవితేశ్వరుఁ గనుంగొని శోకవ్యాకులితమతి యయ్యు నమంద ధైర్యవతియై చంద్రమతి యి ట్లనియె. 124

తే. ప్రాణనాయక ధైర్యంబు పాయఁబెట్టి, యివ్విధంబున నానతి యియ్యదగునె
నిమిష మైనను నినుఁ బాసి నిల్వఁ జాల, నేన చొచ్చెద నీవహ్నిలోన మున్ను. 125

ఉ. ఇందుకు నేమియుం బలుక కీ చన వీఁదగు నాకు నావుడుం
గుంది దివేంద్రవంశజుఁడు కోమలి కిట్లను నోమృగాక్షి యో
చందనగంధి యోమతివిశారద నీకిటువంటితెంపు నే
యందగునే మదీయహృదయంబు గలంగఁ గురంగలోచనా. 126

వ. అని యశ్రుధారాపూరితనేత్రుం డై యున్నయమ్మహీకళత్రునకుం జంద్రమతి వందనం బొనర్చి కరారవిందంబులు మొగిడ్చి. 127

సీ. ఇనవంశవర్య నామనవి చేకొనఁదగు, నింక నేమియు నానతియ్య వలదు
దటిమి యేతెంచు దవానలం బీక్షించి, యనయంబుఁ దలఁకెడు మునికుమారు
ప్రాణంబు గాచునుపాయంబు చింతింపుఁ, డంతరంగంబున నతినయంబ
యాతండు బ్రదికిన నపకీర్తి గాకుండ, నుండంగఁ గల్గు భూమండలేశ

గీ. తడయఁ జనదింక నదెవచ్చె దావజాగ్ని, నన్నుఁ బనుపుఁడు ధృతినిల్పి మున్నటంచు
మాటికిని వేఁడుకొనంగ నమ్మనుజేంద్రుఁడు, దీర్ఘనిశ్వాసపవనంబ డీటుకొనఁగ. 128

వ. శిరంబు వంచుకొని కరంబు విచారంబున నేమియుం బలుకనేరక యూరకుండుటయు నది యంగీకారంబుగాఁ గైకొని యసుక్కురంగనయన హరిశ్చంద్రునకుఁ బ్రదక్షిణపూర్వకంబుగా బునఃపునఃప్రణామం బొనర్చి యాలస్యంబు దక్కి యాభీలదావానలజ్వాలాజాలంబులకుఁ దూలక యభిముఖురాలై చనుచుండఁ దనవెంటంగూడి తొలంగక తోడునీడయుంబోలె నేతెంచుచు నేనునుం జనుదెంచెదఁగొనిపొమ్మని పోరుపెట్టుచుఁ గరంబులఁ గొంగుఁబట్టి తివియు ననుంగుఁబట్టిని లోహితాస్యునిఁ గనుంగొని మోహాతిరేకంబున ననేకవిధంబుల లాలనంబొనర్చుచు సమగ్రవిచారంబునఁ గుమార యమూరమణుకారుణ్యంబున దావపావకంబు శమియింపంజేసితూర్ణంబు

చనుదెంచెదఁ బూర్ణచంద్రప్రసన్నవదనా యన్న మీయన్న యున్న యెడ నావచ్చు నంతకుఁ గదలక యచ్చోటన యుండుఁ డీ యని కుస్తరించి తదేకనిష్ఠాపరత్వంబున.

తే. నియమ మొప్పంగఁ బుట్టంబు నెఱికఁ గట్టి, ప్రాణవల్లభు నిజమనఃపద్మ మునిచి ధైర్యంబు తళుకొత్త నుత్పలాక్షి, కృష్ణవర్త్మకు భక్తిమైఁ గేలు మొగిచి. 130

సీ. పరమపావనతేజ పావక సదయాత్మ, హరిణాంకమౌళిపర్యాయకాయ
యనఘ పాతివ్రత్యమున మనోవాక్కాయ, కర్మవిస్ఫూర్తిచే ధర్మనిరతిఁ
బూని చరించితి నేని మత్ప్రాణేశ్వ, రుఁడు సూనృతవచోరూఢి మెఱసి
భూనుతవర్తివిభూతిశోభితుఁ జేని, శీతకరాకృతి మానిశిష్యునకును

తే. విశదవాత్సల్యమున ముమ్మ కుశల మొసఁగి, పిదపఁ గౌశికుఋణము సంప్రీతిఁదీర్చఁ గూడునట్లుగఁ జెనిమిటిఁ గొడుకుఁ గరుణ, నరసి రక్షింపవయ్య జోహారు నీకు. 131

క. అని పలికి యరుణసరసిజ, వనముఁ బ్రవేశించునంచవశువున ధైర్యం
బును భూరివివేకంబును, మనమునఁ బెనఁగొనఁగఁ జంద్రమతి శిఖిఁ దఱిసెన్. 132

వ. ఇట్లు తఱిసి తద్వియమధ్యంబునఁ బుష్పితాశోకవనాంతరంబునఁ గీరకిశోరంబునుం బోలెఁ జరమసంధ్యారాగంబులోపలఁ దరుణతుషారమయూఖరేఖయుంబోలె నిలిచి యెలమిం జెలఁగియుండుటయు నాతన్వంగిపాతివ్రత్యశీలతపోవిశేషంబులకుఁ బర మాశ్చర్యంబును బొంది పురందరాదిబృందారకసందోహంబు లమందానందకందళిత హృదయారవిందంబులం గ్రిందుకొని యందంద తొరఁగుకరుణారసంబుల దొప్ప దోగి యిందిందిరంబులకు విందు లొనర్పం జాలు మకరందబిందుబృందంబులు చింద నితాంతలతాంతవర్షంబులు గురియించి రయ్యవసరంబున. 133

తే. భీకరజ్వాల లొయ్యనఁ బెం పుడుగ గ, డింది నిప్పులగములవేఁడిమి శమింప ధూమ మంతయు సుడివోవ దోడుపడిన, గాలి యుడుగంగ వనవహ్ని జాల మడఁగె.

తే. ఈవిధంబున దావాగ్ని యెల్ల నణఁగి, పోవుటయుఁ జాల నద్భుత మావహిల్ల నెలమి జెక్కుచెమర్ప కాయిగురుబోడి, మందహాసవికాసంబు కందళింప. 135

క. తొల్లింటి యట్ల వచ్చి స, ముల్లసితప్రీతి సుతుని ముద్దాడుచు భూ
వల్లభునకు భక్తిం బ్రణ, మిల్లిన నాసృపుఁడు పల్కె మెఱుగుంబోడిన్. 136

ఉ. ఓవనితాశిరోమణి పయోరుహలోచన నీసుశీలతా
శ్రీవినుతప్రభావమునఁ జేసి మహాద్భుత మావహిల్లఁగా
నీవనపావకం బడఁగె నెల్లశుభంబులు గల్గు నింక నీ
పావనవర్తనంబు కడు బ్రస్తుతి కెక్కె ధరాతలంబునన్. 137

తే. రాజముఖి నాకు నపకీర్తి రాకయుండ, నీవ ప్రోచితి వీసంయమీంద్రతనయుఁ
గాన నాకసి చూడ నీకారణమున, మానిధన మిచ్చి సత్యంబు బూనగల్గు. 138

వ. అని సముచితసంభాషణవిశేషంబుల నవ్విశ్వంభరావల్లభుండుదన ప్రాణేశ్వరింబ్రశం
సించి యాదరించె నాసమయంబునఁ ద్రిభువనైకదేశికుం డగుకౌశికుండు తదీయప్రి
కారంబు విలోకించి విస్మయం బంది కల్పాంతవహ్నియుంబోనియనల్పంబైనయద్దావ
పావకంబునం బ్రేలి కూలక యప్పల్లవాధరావల్లభుండునుం దానును దొల్లింటియట్ల
సుహానందంబును బొంది నందనోపలాలనంబు సేయుచుఁ దేజోవిశేషంబశేషంబై
యుండ దీపించుచున్నయది యని వెండియు. 139

తే. లోలలోచన మిసిమింతురాలు గాక, వహ్నికీలంబో నిట్లు వన్నె చెడక
యున్న దిది చాలచిత్ర మోహో తలంప, వినియుఁగనియు నెఱుంగమివ్విధము నెపటు

క. మామకనిశ్చలభూరిత, పోమహిమల మించి మిగుల బొలుపొందెనె యీ
భామినిపాతివ్రత్య, శ్రీరుచిహితగభీరగుణవిశేషము లరయన్. 141

క. విపదంధకారపబలీ, తపనవయూఖములు పతిహితక్రియ లెపుడుం
జపలాక్షీ కవియ చాలవె, యపగమితాభీష్టఫలదయంబుల నొసగన్. 142

క. కావున బాతివ్రత్యక, ళావిభవముచేత నీవిలాసిని ధృతిమై
దావానలకీలావళి, సేవంబయు బొంద కలరె నెలమి దొలంకన్. 143

ఉ. ఇంక నుపాయ మేది గల దీకమలాక్షకులావతంసముఁ
బొంకముఁ జేయ హేమగిరి బోలెడుధీగత యంచరింప నే
యంకిలి బొంద కెట్టిభయదాపద లైనను నిస్తరించుమన్
శంక వహింప కుండెడిని జంద్రమతీసతికారణంబునన్. 144

వ. అని డోలాందోళితమానసుండై యమ్మునిపుంగవుండు వెండియు గడంగి యంతరం
గంబున జలంబు దలంబుగా నెక్కొంచి నిజాకారంబు దక్కినవారల కేరికగోచ
రంబు గాక యుండ నక్షత్రకుం గదిసి యాలింగనాదిసంభావనంబులఁ బ్రీతుని గా
వించి వాత్సల్యంబున నిట్లనియె. 145

తే. వాసి కెక్కిన నాశిష్యవరులలోన, మిగుల మాన్యుని గా నిన్ను మెలపినాడ
నాకు బ్రత్యుపకార మొనర్పవేళ, యదియుచూ నీకు బరికింప నిద్ధచరిత. 146

ఉ. నీకపటక్రియామహిమ నేర్పు దలిర్పగ జోకజేసి య
స్తోకవివేకభూరమణుతో డుతగూడి చరింపకుండ నీ
కోకకుచాశిరోమణి నకుంఠితబుద్ధివిశేషధీగతా
శ్రీకమనీయభర్తృహితశీలనుతం బెడవాపు చయ్యనన్. 147

వ. అని బోధించి గాధినందనుఁడు తిరోధానంబు నొందెఁ దదనంతరంబ. 148

తే. చంద్రమతి జూచి పలికె సత్యవ్రతుండు, తెలియ భవదీయవిమలపతివ్రతాప్ర
భావ మభినుతి సేయంగ బద్మజునకు, నహికులాధీశ్వరునకైన నలవిగాదు. 149

క. తామరసభవునిసతియుఁ బులోమజయు నరుంధతియును లోపాముద్రా
భామయు ననసూయయుఁ గా, కీమహిలో నీకు నెవ్వ రీడు పురంధ్రీ. 150

ఉ. ఎట్టితపం బొనర్చెనో మహిం బరమేశుడు మెచ్చునట్లుగా
నెట్టివిశేషదానము లహీనత జేసెనొ యెట్టితీర్థముల్
మెట్టెనొ పుణ్యశీలమున మించి జగన్నుతి గాంచినట్టి ని
న్నట్టపుదేవిగా బడసె భానుకులోత్తము డంబుజాననా. 151

క. భీకరదావాగ్నిశిఖా, నీకముపా ల్పడకయుండ నిరుపమకరుణం
జేకొని నను బ్రోచితి కాం, తా కల్గె న్నీకు బ్రాణదానఫలంబున్. 152

క. ఇందుకు బ్రత్యుపకారము, పొందుగ నిక నీకు నొకటి పూని యొనర్తుం
జందనగంధి వినందగు, మందేతర బుద్ధి జెంది మద్వచనంబుల్. 153

సీ. కౌశికమౌనిపుంగవు వేడి యతనిచే, గ్రమ్మఱ సామ్రాజ్యభారము వడసి
శిక్షింప మూర్ధాభిషిక్తుని గావింతు, నీపుత్రు సుజనవర్ణితచరిత్రు
దోకొని మరలి సంతోషంబుతో నయోధ్యాపట్టణమునకు నరుగుదెమ్ము
విశ్వసింపు మదీయవిహితోపదేశంబు, మృష గా దలంపకు మీననయన

తే. నా నుడువు బుద్ధి వినక నమ్మానవేంద్రు, గూడి వెనువెంట దిరుగగ గోరితేని
జలజనేత్ర బహుప్రయాసముల నొంది, తిరుగుచుండంగవలయు దిగ్దేశములను. 154

చ. కలఁగక దావపావక శిఖానివహంబు లణంచినట్ల యో
నెలత యణంప శక్యమగునే మదనాహితఫాలలోచనా
నలమునకంటె నుగ్రితఘనంబయి హాటకగర్భకైటభా
రులఁ దలఁకించు గౌశికునిరోషహుతాశన విస్ఫులింగముల్. 155

తే. అదియునుంగాక యోకురంగాయతాక్షి, నేఁడు మొదలుగ నింక నెన్నికకు వాస
రములు పది చిక్కె సంయమిప్రవరుతోడ, నవనిభర్త గుఱించినయట్టిమితియు. 156

చ. మునిఋణ మేగతిన్ మొదలు ముట్టఁగఁ దీర్చెద రొక్కచిన్నమున్
జనపతిచేత లేదు జలజాతదళాయతనేత్ర యెవ్విధం
బున సమకూడెడిన్ మితికి బొంకగ నేరడొకింతయైన నీ
వెనిమిటి యిట్టిశీలమున బృథ్వి జరింపగ బోల దేరికిన్. 157

చ. అలుక జనింపఁ గౌశికమహాముని యేచుటేపాటు భీమభం
గుల జనుదెంచి మాధనము గొబ్బున దెచ్చుమని యానబెట్టినం
గలగుచు నేయుపాయమును గానక నిన్నును నీతనూజుఁ గొం
దలమున విక్రయించు వసుధాధవు డెవ్వరికైన జెచ్చెరన్. 158

తే. ఇంతపట్టున నిశ్చయం బిగురుఁబోడి, నాకు జూడంగ నదిగాన నాదుపల్కు
నమ్మి యేతెమ్ము క్రిమ్మఱ నందనుండు, నీవు సాకేతపురికి రాజీవనయన. 159

వ. అనిన నయ్యిందువదన మందస్మితసుందరవదనారవిందయై కర్ణపుటంబులం గరకమలం
బులు జేర్చి హరస్మరణంబు సేయుచు నమ్మనితనూజుంగనుంగొని యస్తోకవివేకవిశేష
భాషాకౌశలం బొదవ ని ట్లనియె. 160

క. సతి కిహపరసౌఖ్యములకు, బతియె నిదానంబు చూనె పరికింపంగా
బతి నెడబాసి చరించెడు, సతికిన్ వ్యర్థగావె సకలసౌభాగ్యములున్. 161

ఉ. కోరికలెల్ల జాల నొడఁగూర్చుప్రియుం డెడబాసినట్టిపం
కేరుహపత్రలోచనకు గీరము వైరము హార మెంతయున్
భారము మంచికప్పురపుబల్కులు ముల్కులు పచ్చవెచ్చ శ్వం
గారవనాంతరాళశశికాంతపువేదులు నూదు లారయన్. 162

క. ఓమునిరాజతనూభవ, సోముని నెడబాసియున్న జూడం దగునే
యామిని యట్ల తలంపఁగ, భామినియును బ్రాణనాథు బాసినవేళన్. 163

శా. వాలుంగంటికి నింటియాతడు మనోవాంఛాప్రదానక్రియా
హేలాలోలుడు నీలవేణికి బ్రియుం డేప్రొద్దు నొప్పారఁగ
త్సాలంకారము కాంతకున్ మగడు నిత్యానందసంపాది యిం
కేలా వేయును జెప్ప నేర్డడయు.బ్రాణేశుండ తన్వంగికిన్. 164

ఉ. కావున నిత్యసత్యగుణగణ్యుఁడు పుణ్యుఁ డితండు భర్తయున్
దైవము కామితార్థఫలదాతయు నాకుఁ దలంచి చూడనీ
భావజమూర్తి వైభవునిఁ బాసి చరింపఁగ నెట్లు నేర్తునే
నోవటువర్య యీయనుచితోక్తులు పల్కఁగ నీకు ధర్మమే. 165

క. గాధితనూజునిమాయాం, భోధిన్ మద్భర్తయేల మునిఁగెడి గిరిక
న్యాధవుసేవాద్రోణిక, సాధనముగ నిస్తరించు సంశయ మేలా. 166

తే. ఇంద్రసన్నిభుఁ డగుహరిశ్చంద్రవిభుని, ధైర్యగాంభీర్యశౌర్యసుస్థైర్యవైభ
వంబు లెఱుఁగక విప్రలాపంబు లింక, పలుకుచున్నాఁడ వోవెఱ్ఱిబ్రహ్మచారి.

సీ. అపరపద్మాసనుం డగుకౌశికుండును, నీవును నింద్రాదిదేవతలును
మేలు మేలని చాల మెచ్చి నుతింప ని,శ్చలుఁడు హరిశ్చంద్రచక్రవర్తి

ధూర్తరక్షణశాలి వార్త కెక్కినపేటి, మార్తాండకులకర్త మర్దితారి
నిత్యసత్యస్ఫూర్తి నిర్మలతరకీర్తి, ప్రబలి హిమాద్రిజాభక్తకరుణ
గీ. బడసి క్రమ్మఱఁ బాలించు ప్రాభవమున, నక్రమేమియులేక భూచక్రమెల్ల
ననిన నిదియంతయును నిక్కమనుచు మ్రోసె, మిగులనద్భుతమొదవంగ గగనవాణి.

వ. అంత నమ్మహీకాంతుం డమ్ముద్దియంగనుంగొని యుద్దినంబు మనకు నిచ్చోట నాలస్యంబు సేయంబనికాదు పురోభాగంబుల గవ్యూతిత్రయమాత్రంబున గాత్యాయనీకళత్రునివాసంబును గమనీయసంపద్విలాసంబును గలుమలతావితానశితాసియును నగు కాశీనగరంబు ప్రకాశించుచున్నయది యప్పురంబు ప్రవేశించి కౌశికుబుణవిమోచనోపాయంబు చింతింప వలయునని కాంతాసమేతుండై కొంతద వ్వరిగి ముందట. 169

సీ. జాహ్నవీనిర్మలజలపరిక్షాళిత, బహుదోర్ఘీకరపాతకంబు
విశ్వనాథకిరీటవిధుకళాకౌముదీ సముదయాచ్ఛాదిక సౌధవీథి
కేశవస్వామ్యగ్రరోదేశపరిష్కల్పావన, మాలికాగంధవాసితంబు
కాలభైరవభుజాకలితఘకర్కాఖీల, ఢమఢమధ్వనిమహాడంబరంబు
నిండుమతి ఢుంఢివిఘ్నేశుఁ దుండిభూమి, యన్నపూర్ణావిశాలాక్షు లాటుపట్టు
శ్రీకరంబైన వారణాసీపురంబు, గనియె వేడ్క హరిశ్చంద్రజనవిభుండు. 170

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డటమీఁదివృత్తాంతం బెఱిఁగింపు మనుటయు. 171

## ఆశ్వాసాంతము.

మ. హితచేతోజలజాతసప్తహయ సాహిత్యక్రియాభోజ సం
స్తుతనిర్వక్రపరాక్రమక్రమణమంధగ్రావసంక్షోభిత
ప్రతిపక్షక్ష్మాజనీధవప్రబలగర్వప్రాభవాంభోనిధా
న తనూవిక్రమచంద్రికావికచకాంతాలోచనేందీవరా.

క. శాండిల్యగోత్రవర్ధన, పాండిత్యాభరణ దానపాటవనవమా
ర్తాండతనూభవవిభవా, ఖండల దుర్వారవైరిగర్వాద్రిపవీ. 172

మాలినీవృత్తము. ద్యుమణివిమలతేజా తోయజాక్షీమనోజా
శమితవిమతలోకా సాధుగణ్యావివేకా
కమలభవకులీనా కల్పవృక్షోపమానా
హిమగిరిసమధైర్యా యెఱ్ఱనామాత్యవర్యా.

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకలసుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలంకారశంకరకవినామధేయ ప్రణీతం బయినహరిశ్చంద్రోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.



## చతుర్థాశ్వాసము.



శ్రీచాయసదన పదసే
వాచరణనితాంతనియమహర్షితనీహా
రాచలకన్యావల్లభ
బాచయయొల్లా ప్రధాన బంధునిధానా.

వ. ఆకర్ణింపు మహాండవాగ్రిజునకు మార్కండేయుండిట్లనియె నట్లు హరిశ్చంద్రుండు కాశికాపురంబుఁ గనుంగొని తదీయపరిసరంబున. 2

ఉ. రంగదనేకనిర్మలతరంగఁ బ్రఫుల్లసరోరుహాభ్రమ
ద్భృంగఁ దటద్వయీప్రబలదీపితపుష్పలతాకుడుంగఁ బ్రా
తాంగఁ జగద్విధాంగకలహంసముఖాంబుపతంగ జాహ్నవీ
గంగఁ బ్రియాతిరేకమునఁ గన్గొనియెం బ్రమదాంతరంగుఁడై. 3

ఉ. వారిధికార్మిరాణి రతివల్లభవైరికిరీటభాగమం
దారలతాంతమాలిక జనంబులపాలిటి వేల్పుటావు ధా
త్రీరమణీకుచాగ్రతటదీపితమౌక్తికహారవల్లి భా
గీరథి చెప్పనొప్పెసఁగుఁ గిల్బిషభూజకుఠారధారయై. 4

వ. ఇత్తెఱంగునం బొల్పు మన్నయ త్తరంగిణిం గనుంగొని నమస్కరించి. 5

శా. తల్లీ మిన్నక నిన్ను నాడిరజనుల్ తా రర్థిఁ గైవల్యభా
స్వల్లక్ష్మిం దగఁ బట్టుగొందు రనినన్ వాంఛించి ప్రేమంబు సం
ధిల్ల న్నిన్గొనియాడువారి కరుదే నిర్వాణసౌభాగ్యముల్
కల్లోలాపహృతాఘపంక త్రిజగత్కల్యాణి భాగీరథీ. 6

తే. జాహ్నవీ నీదుజలములు సదమలములు, లఘువులును శీతలములుఁ దలంప వ్రింక
లిడినవారికి నల్లనామెడలు, జడలు గట్టు లలాటబా [illegible] నయను. 7

వ. అని ప్రశంసించుచుం గడిసి భక్తి తాత్పర్యవినయసంభ్రమంబులు మనంబునం బెనం గొనుచుండ సుతసతీసమేతంబుగాఁ గృతస్నానుండై పరమధ్యానపూర్వకంబుగా మాధ్యాహ్నికక్రియాకలాపంబులు నిర్వర్తించి ముహూర్తమాత్రంబు తదీయసైకత క్షేత్రంబున వసియించి గమనాయాసంబు దొలంగుటయు నచ్చోటువాసివచ్చుచుం గాశీపురశోభనప్రభావంబభివర్ణనాపూర్వకంబుగా వినిపింపఁదలంచి యిట్లనియె. 8

శా. ఏతత్పట్టణవైభవంబు లరయన్ హేలావతీ ధాతకున్
వాతాశప్రభు తారకాహితులకున్ వర్ణింపగా శక్యమే
చేతోజాతభయంకరుండు సుజనక్షేమంకరుం డిచ్చటం
బ్రీతిం గాపుర ముండు శంకరుఁ డుమాబింబాధరాయుక్తుఁడై. 9

క. పంచాస్యగర్భ! యిచ్చటఁ, బంచత్వముఁ బొందె నేని పరికింపంగాఁ
బంచమహాపాతకుఁ డగు, పంచజనుం డైనఁ బంచబాణారియగున్. 10

సీ. క్ష్మాధరంబులు పాఁతు గదలం నేవేళ, నొలిని సప్తవాయువులు విసరు
ద్వాదశరూపము ల్దాల్చి యుగ్రమయూఖుఁ, డేవేళఁ బచరించు నెండఁ గరము
దుష్కరంబులుగాఁగ బుష్కలావర్తాభ్ర, జాల మేవేళ వర్షములు గురియ
భువనంబు లెల్ల నంభోనయంబులుగాఁగ, విపరాసు లేవేళ వెల్లివిరియు

గీ. జంతునివహంబు లేవేళ సమసి పోవు, నట్టిదుర్దాంతభయదకల్పాంతవేళఁ,
బొరయ దాపద యణుమాత్రమును గురంగ, నేత్ర యిక్కాశికాపుర క్షేత్రమరయ.

తే. ప్రసవకోమలి! యీపురబాహ్యసీమఁ, గోరి వసియించుచండాలకులజు లైనఁ
బోలఁ గాలంబు నిర్జరపాలకుండు, గలవు ధర్మార్థకామమోక్షంబు లిచట. 12

తే. వనజలోచన! యుత్తరంబునను, దక్షిణమునఁ గొనియాడఁ దగువరణయును నసియు
సరితుభాగీరథీదక్షిణమునఁ బరఁగు నాఁగయును, బశ్చిమంబునఁ దుండియుఁ బ్రణుతిఁ గాంచె. 13

క. వారాణసి వారాణసి, వారాణసి యనుచు భక్తివశుఁడై నరుఁ డం
భోరుహముఖి ప్రోదయవే, ళానంతంబునఁ దలంప నడఁగు నఘంబుల్. 14

తే. వనరుహానన! యంగారుజనసహనోన, థార్థము లైనబహుపుణ్యతీర్థములకు
రాజు శ్రీకాశికానగరంబు సకల, వేదశాస్త్రపురాణార్థవిశ్రుతంబు. 15

క. కమలాయతాక్షి యిచ్చట, గను పంచక్రోశములను రాజీవభవా
ద్యాగమనుతనిత్యంబులు, శమితాఖిలభయదకలుషసముదాయంబుల్. 16

సీ. నీలవర్ణాంకుఁ ద్రిశూలహస్తునిఁ గాల, భైరవుఁ జాల సద్భక్తిఁ గొలిచి
యన్నపూర్ణను విశాలాక్షిఁ గాశికాదేవ, తా ధేనువులకు వందన మొనర్చి
సిరిఁ జేరుకంబునఁ జెలువొందఁ జేర్చిన, కేశవస్వామికిఁ గేలు మొగిచి
ప్రత్యూహవార్వాహపటలికాగంధవ, హుని దండివిఘ్నేశు వినుతి చేసి
గీ. ప్రమథలీలల లోలార్కుఁ బ్రస్తుతించి, దండపాణికి సాష్టాంగదండ మొసఁగి
రూఢి నాసవభాండేశ్వరుని భజించి, యపగతాఘంబు ముక్తిమండపముఁ గాంచి. 26
వ. వెండియుఁ గల్గు విశేష దేవతాస్థానంబులు దర్శించి కృతార్థుండ నైతి నని యొక్క-రమ్యప్రదేశంబు చేరియున్న నాసమయంబున నపాంగంబున నంగారకణంబులు రాల నృపాలశిరోమణిం గనుంగొని కపటక్రియావత్సుం డగు నక్షత్రకుం డిట్లనియె. 27
చ. ధరణిప నేఁడు నెల్లియును దక్క-వ గా నెలనాళ్లు నయ్యె నే
నరసితి లెక్క- బెట్టితిమి యాయము లే దొకవీస మైన నే
వెరవున నింక మాఋణము వేగమె తీర్చెదొ కాక మన్న కే
సరి గాదవో వివేకగుణశూన్యత బొంది యసత్యవాదివై. 28
క. భూవరయిత వినవు యాల, స్యా దమృతంవిష, మ్మటంచు నార్యజనంబుల్
మేదిని నెల్లవేఁ జెప్పఁ బ్ర, మాదము మితి గడచె నేని మానీంద్రునిచేన్. 29
తే. మనుజనాథ వృథాప్రయోజనము నందుఁ, దెలియనేరక యూరక దినదినంబు
బొద్దుపుచ్చుచు మాయప్పుసుద్దియెల్ల, మఱచియున్నాఁడ విది భావ్యమా తలంప.
చ. ఇఁక నొకమాట మాత్ర నొకయించుక నిల్వక గూర్రవృత్తిఁ గా
శికమునిమీఁద నాన యిడి చెచ్చెర నంగడి నడ్డపెట్టి పా
యక బహుబాధలం బొదలునట్లుగ జేయక మాధనంబు రా
దకట నృపాల యిట్లు తగవా నను నిష్ఠురుఁ జేయ నేటికిన్. 31
ఉ. ఎంతయు గోప మయ్యె ముని యెప్పుడు వచ్చునొ వచ్చినప్పుడే
కొంతయు స్వాపతేయమిదె కొమ్మని యియ్యక యున్న రోషిత
స్వాంతుఁ డగున్ మునీశ్వరుఁడు సంశయ మించుక యైన గల్గ దా
కంతువిరోధికిం దరముగా దణపంగ దదీయకోపమున్. 32
క. వీతజపహోమనియముఁడ, నై తిరిగియు నిన్ను గూడి యరకా సయినం
జేతికి వచ్చినయది లే, దీతుదకుం గినుక వొడమ కెట్లుండు మదిన్. 33
క. ఇదె యిచ్చెద నదె యిచ్చెద, నదపదు డని యాస జూపి పలుదెఱఁగుల నా
హృదయము నొప్పించితి విఁక, నుదితోర్రెద నేఁడు నిన్ను గొంకక యిచటన్. 34

తే. అడుగుపడఁగనె కూర్చి మాయప్ప దీర్చి, పొమ్ము నీవన్న బోమె యీపోరు మాని
బడలి జీతము వెట్టనిబంటు నగుచు, వెఱచి నాకేల నీవెనువెంటఁ దిరుగ. 35

చ. నినుఁ గిరియందు జాల కవనీధవ గాధితనూజుమానసం
బున కెడయై లఘుత్వమును బొందగ నేటికి నాకు నీవ నె
మ్మనమున బుద్ధి యీది యొకమార్గము జేసెదవంచు నుంటి గు
ర్వనఁ దొలఁగించి నీదౌరతనం బడపం దడవా తలంపగన్. 36

వ. అని యిత్తెఱంగున నక్షత్రకుండు పలుకునిష్ఠురాలాపంబులు బాణంబులుం బోలె మనోఘాతంబు సేయుటయు నారాజన్యచూడారత్నంబు వ్రీడాదైన్యంబులు ముఖారవిందంబున సందడింప నమందవ్యాకులత్వంబుం బొంది పుత్త్రుండును గళత్రంబునుం దక్క దక్కినవిత్తం బణుమాత్రంబునుం గద్దమికి జింతాఘనస్వాంతుండై చంద్రమతిం గనుంగొని యేమియుం బలుకనేరక యూరక బెట్టునిట్టూర్పులు నిగుడ్చుచు నానతశిరస్కుండై యుండుటయు నవ్విధంబు నిరీక్షించి యాపురంధ్రిశిరోమణియుం గితాకారభావజ్ఞతావిశేషగుణధుర్యయుం వినయవివేకభాషాచాతుర్యయు నై జీవితేశ్వరుం గనుంగొని. 37

ఉ. నిండినవేడ్క లోకములు నిత్యము సన్నుతిసేయ ధారుణీ
మండల మెల్ల నేలినసమగ్రయశోవిభవుండ వీవు మా
ర్తాండకులేశ యీధునివిధంబున భ్రాంతి వహించి చింతమై
నుండుట పాటిగాదు ధృతి యుల్లమున న్విలసిల్ల జేయుమీ. 43

ఉ. మిక్కిలి దీనతం బొరయ మీ కిది యేటికి నేడు నెల్లియుం
దక్కువమాచినన్ మితిదినంబు మహీరమణాగ్రగణ్య యీ
యక్కఱ కేయుపాయమున నైనను విత్తముఁ గూర్చి కీర్తి సొం
పెక్కగ మౌనివర్యుఋణ మిప్పుడ తీర్చుట మంచి దారయన్. 39

తే. మోస మగు నప్పుడీక్షకమున్న యొక్క, గడియ తడవైన మితి సరిగడిచెనేని
క్షితితలేశ్వర నిన్ను బొంకింపఁ బూన, కంకణము గట్టుకొన్నాఁడు గాధిపట్టి. 40

చ. పలుమఱు మిమ్ము నిన్నటువు పాయక యుగ్రతబల్కు నిష్ఠురో
క్తులకు నొకింతయైన మది దుఃఖము బొందకుఁడీశ డెన్నిభం
గుల గడుమాననీయుఁడు తగు న్మన కీతనియాజ్ఞ సేయ నో
జలజసఖాన్వయాభరణ సత్యవచో విభవప్రతిష్ఠకై. 41

ఆ. పార్థివేశ యడవి పాలు ద్రావించిన, చెడద మీమునీంద్రనందనుండు
కినిసి ఋణముదీర్పుమని మిమ్ము మాటికి, బరుషభాషణములు పలుకుటెల్ల. 42

తే. అనృతభాషణుకంటె దోషాధికుండు, సత్యవాచాన్వితునికంటె నిత్యసుకృతి
వెదకిచూచిన బొడమఁ డుర్వీతలేశ, పవనభుఙ్మానవామరభువనములను. 53

క. దారసుతాదులమోహము, గోరెడువారలకు దగదు కూడఁగ నవి వి
స్తారమతి సూరిజనములు, ధీరత దనోర్మిమాలతల ద్రెంపుదు రనఘా. 54

మ. ప్రతికూలోక్తులు పల్కఁగా వలదు భూపాలాగ్రణీ యుత్తమన్
ధృతి జిత్తంబున నిల్పి దిగ్భరితకీర్తిస్ఫూర్తితోఁ గూడి సూ
నృత వాక్సంపద బొందు భూజనులు వర్ణింపంగ నామీఁదిమో
హతమఃపుంజముఁ బాపు చిన్మయవివేకాదిత్యబింబంబుచేన్. 55

వ. అని దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగుడ్చుటయు నగ్గంధగజగామినిం గనుంగొని వసుంధరావల్లభుం డుల్లంబున నొక్కింత దైన్యం బవలంబించి యి ట్లనియె. 56

తే. ప్రసవకోమలి విను నాఁడు భయద మగుచుఁ, జేస్పుకార్చిచ్చు చొరఁగఁబంపినవిశేష
దోసకారికిఁ గఠినచిత్తునకు నాకు, నిప్పు డీతెంపు సేయుట యెంతపెద్ద. 57

శా. ఏణీలోచన నానిమిత్తమున నీ కీపాటు పాటిల్లె నే
క్షోణీనాథునిరాణివాసములు చక్షుఃకౌతుకాపాదిని
శ్రేణీలాలితహర్మ్యవాటికలలోఁ గ్రీడావిశేషంబులన్
బ్రాణేశాన్వితలై నిరంతరసుఖప్రాప్తిన్ వినోదింపఁగన్. 58

తే. సకలరాజన్యకన్యకాజనము లపుడు, నీకుఁ బరిచర్య చేయుచు నెమ్మిఁ గొలుతు
రుత్పలేక్షణ యిపుడు నిన్నొక్కరునికి, దాసిఁగా విక్రయింపఁగఁ జేసె నజుఁడు.

మ. తనుమధ్యన్ హరినీలవేణి బిసహస్తం బక్వబింబోష్ఠిఁ జం
దనగంధిం బికవాణిఁ బీనకుచఁ గాంతామౌళిరత్నంబు నా
కనుసన్నన్ మెలఁగంగ నేర్పుగలరాకాచంద్రబింబాననన్
నినుఁబాపె న్విధి నేఁటితోఁ గలువకంటీ నిర్దయస్వాంతుఁడై. 60

తే. తరుణి నామాట కడుఁగు దాటవెఱతు, వతివ నామానసమునఁ బాయక వసింతు
వింతి నాకన్న పెన్నిధి వెన్నిచూడ, లలన నాపూజ్యసామ్రాజ్యలక్ష్మి వీవు. 61

సీ. మందిరారామసీమంబులై విలసిల్లు, భయదాటవులు పద్మపత్రనయన
కనకహర్మ్యంబులై కనుపట్టు సానుమృద్గహ్వరాంతరములు సింహమధ్య
పట్టెమంచముమీఁది పఱుపులై శోభిల్లుఁ, బూరిపాసుపులు కర్పూరగంధి
శాల్యోదనంబులై చవులు పుట్టఁగఁజేయు, శాకపాకాదులు సదమలాంగి

గీ. గరిమ నినుఁగూడి చరియించుకతన నాకు, నిందుబింబాస్య యిన్నాళ్ళ కిపుడు నేఁడు
పొగడఁదగు నాదురాజ్యవిభూతు లెల్ల, నెరియఁ నెడఁబాసిపోవుట యెఱుకపడియె.

క. ఏణాక్షి నిన్నుఁ బాసినఁ, బ్రాణంబులఁ బాసినట్లు భవదీయగుణా
క్షీణప్రతిభావిభవము, ద్రోణికిగా నేఁ దరింపుదుఁ గా విపదబ్ధుల్. 63

వ. అని చింతాపరంపరాయత్తచిత్తుండై యున్న నృపోత్తముం గనుంగొని వెండియుఁ
బ్రచండకోపంబునం దాపసకుమారుం డిట్లనియె. 64

శా. ఆలస్యం బొనరింప నేటికి నృపాలా తెమ్ము మాసొమ్ము స
త్యాలాపంబులు నిల్పు దేని మతి మోహం బెయ్యెడన్ మానుమీ
జాలిం బొందెద వాలి నమ్మటకు సంసారంబుపై భ్రాంతివో
యీలాగు ల్మనమెచ్చు గావు తుది నిన్నెంతైనఁ బోనిత్తునే. 65

క. ఇక్కులువకంటి నమ్మక, దక్కిన వేఱొండు గలదె తర్కింపఁగ నీ
యక్కఱకు ధనము గూర్పఁగ, గ్రక్కున నంగడికి రమ్ము కాంతయు నీవున్. 66

ఉ. పోయిన యంతవట్టునకుఁ బోకడ పెట్టుము శిష్యవృత్తిమై
నీయుడురాజబింబముఖి నేటికి నూరక మాటిమాటికిన్
మాయలు చేయ నీకు నిది మానవనాయక హేయమైన గా
థేయునితోడ నొక్కపతి తెంపున నాడు మసత్యవాక్యముల్. 67

వ. అని కేలు గేలం గీలించి తివియనుద్యోగించుటయు నమ్మునికుమారునిష్ఠురవచనంబుల
గలంగి యయోధ్యాదిమచక్రవర్తి కులాంగనావిక్రయార్థం బప్పట్టణవిపణిమార్గంబున
కుం జనుదేర నయ్యవసరంబునఁ బౌరజనసమాజంబు లత్యంతసంభ్రమంబునం జను
దెంచి. 68

సీ. ఆజానుదీర్ఘ బాహాదండయుగళంబు, మేరుసానువుఁ బోలు పేరురంబు
ప్రాభాతజలజాతపత్త్రనేత్రంబులు, జాలవెడల్పైన ఫాలతలము
నాకాశమణిబింబనీకాశ తేజంబు, గంబుబిబ్బోకంబు గలగళంబు
పద్మరేఖాస్ఫూర్తి భాసిల్లుపదములు, సింహంబు తలపింప జేయుగతియు

గీ. గలిగియొప్పారి రెండవకైటభారి, మాడ్కి నున్న హరిశ్చంద్రమనుజవిభుని
ననిమిషేక్షణముల విలోకనమొనర్చి, యుల్లమున సమ్మదంబులు వెల్లివిరియ. 69

ఆ. ఇమ్మహానుభావుఁ డెవ్వఁడో యెఱుఁగంగ, బోల దధికతుహినజాలవిహిత
కమలసఖుఁడుపోలె గానంగ నయ్యెడు, నెచటినుండి యొక్కొ యితని రాక. 70

చ. శిరమున బూపచందురుఁడు చెన్నువహింపని మేరుధన్వియో
యురమున గౌస్తుభంబు చెలువొందని యిందిరప్రాణనాథుడో

కరమున శైలభేది యగుకైదువ లేనిశచీకళత్రుఁడో
తిరముగ నీతఁ డంచు వినుతించిరి హంసకులావతంసముల్. 71

వ. ఇట్లు వినుతించి యతనిపిఱుందం జనుదెంచు నా త్రైలోక్యసుందరి యగుచంద్రమతిం గనుంగొని. 72

సీ. అరుణాబ్జచరణ కాహళీజంఘ కదళికా స్తంభోరువు పులినతలనితంబ
యావర్తనాభి పంచాననమధ్య చక్రస్తని బిసహస్తకంబుకంఠి
బింబోష్ఠి దాడిమీబీజరదన చారు, తిలపుష్పనాస యిందీవరాక్షి
గారుత్మకభ్రూయుగ కైరవాప్తశకల, ఫాల పురందర నీలవేణి

గీ. మత్తగజయాన చంద్రికామందహాస, ప్రవిమలస్వర్ణ కేతకీప్రసవగర్భ
దళతనూవర్ణ పరిపూర్ణ ధవళకిరణ, వదన యీయింతి చెలువంబు వశమె పొగడ. 73

చ. అని కొనియాడుచుండ వినరయ్య కృపామతి పౌరులార స
జ్జనసుతకీర్తులార గుణసాగరులార మదీయమైనవ
ర్తనము సమస్తముం దెలియ దాచక జెప్పెద నంచు బల్కె ని
ట్లని జననాయకాగ్రణి ముఖాంబురుహంబున దైన్యముబ్బగన్. 74

తే. జలహితవంశజుఁ డనుద్రిశంకుభూమణి, జానిసుతుఁడ హరిశ్చంద్రజనవిభుఁడను
ద్రుహిణనిభుఁ డగుగాధిపుత్రునకు ధాత్రి, దానమిచ్చినవాఁడ నుదారమహిమ. 75

చ. అనిమిషలోకవర్ణితమహామహిమాస్పదమూర్తియైనయ
మ్మునికులచక్రవర్తి కట మున్ను మఖార్థము పేర్మి నిత్తు నే
నని యొడఁబడ్డవిత్తమున కర్థి నుపాయము లేమి నీకథా
జనమణి నమ్మ బూనితి నసత్యము బొంద మనంబు గొల్పమిన్. 76

ఉ. అత్రిసమానులు న్రవిసుధాంశుకులీనులు మన్మథద్విష
న్మిత్రనిభార్థవంతులున మేయబలాఢ్యులు నైనబ్రాహ్మణ
క్షత్రియ వైశ్యశూద్రకులసంభవులార మదీయభార్య స
త్పుత్రవతిన్ ధనార్థినయి పోకడ బెట్టెద రండు విల్వఁగన్. 77

సీ. నిద్దంపునునుమించుటద్దంబు బ్రహసించు, ముఖమండలము గలమోహనాంగి
వెలిదమ్మిరేకు లవిభ్రమంబులగుల్చు, కన్నులు గలకలకంఠకంఠి
పూవుగుత్తులతోడ బోరాడ నోపువ, క్షోజముల్గలమృగరాజమధ్య
గొదమతుమ్మెదలకు గోద ఘటింపఁగఁ జాలు, కుంతలంబులు గలగురునితంబ

గీ. బచ్చిపగడంపు దీగకు హెచ్చు జూపు, కెంపునాతెఱ గలరాజకీరవాణి
ప్రణుతి గాంచిన నాపాలిభాగ్యలక్ష్మి, విక్రయించెద గొనరయ్య వేగ వచ్చి. 78

క. కడుభక్తి మ్రొక్కి జనుచో, గుడిమీదం బడినయట్లు కువలయపతికిన్
బడిపడి దానము లియ్యగ, దొడిపడఁ గౌశికునిచేత దొసఁగులు దగిలెన్. 90

సీ. కాపట్యమును దీర్ఘకోపంబు గర్వంబు, యతుల కేటికి మహీపతులయెడల
నలఘువివేకశూన్యులు భూమిదివిజులు, విపరీతములు వీరివృత్తు లెల్ల
విశ్వసింపఁగ రాదు వీరి వెయ్యైన న, త్యంతమాయావాదు లరసి చూడ
నుపకార మొనరించినపరమపుణ్యుల, కపకార మొనరింతు రదను వేచి

గీ. బలిదనుజుఁ జేరి వామనబ్రహ్మచారి, మును పదత్రయమాత్రంబు భూమి వేడి
పిదప నాతని బంధించి పెంపు డించి, పూని త్రోయఁడె పాతాళభువనమునకు.

చ. అరయఁగ గశ్యపాదివసుధామరవర్గము జామదగ్న్యుచే
ధరణితలంబు సర్వము నుదంచితలీల బరిగ్రహించి యా
నిరుపమదానకల్పకము నెమ్మదికోణమునందు నైన సు
స్థిరముగ నుండనీక నతిశీఘ్రముగన్ వెడలంగఁ ద్రోయరే. 92

ఉ. ఇన్నియు నేల కౌశికమునీంద్రుఁడు తొల్లి వసిష్ఠునింటి ని
ష్ప్రాన్నములన్ భుజించి తుది నాతని కెగ్గొనరించెఁ బూని నేఁ
డిన్నరనాయకోత్తము నహీనవితీర్ణనిధాను నిత్యస
త్యోన్నతుఁ జాల లాఘవము నొందఁగఁ జేయుచు నున్నవాఁ డొగిన్. 93

తే. అనుచుఁ బలుకుచు నుండంగ నందులోన, నొక్కకొందఱు పాణిపయోరుహములఁ
గర్ణపుటములఁ జేర్చి దుఃఖము జనింప, విశ్వనాథునిఁ గాశికావిభునిఁ దలచి. 94

క. విత్తము గల దని నరనా, థోత్తము కామినులఁ గొనఁగ నుచితం బగునే
యొత్తిరి వారల నడిగెడుఁ, దొత్తులఁగా నేలఁ జాలుదురె మనబోఁటుల్. 95

క. మన మెక్కడ నివ్వనజా, ననయెక్కడ గరమున ధనంబిడి తెగువం
గొను టెక్కడ వరవుకుఁ గాఁ, బనిగొను టెక్కడఁ దలంప భావ్యం బగునే. 96

ఉ. కోరి తలంప సింహమునకున్ సతి సింహమె కాక దండ పెం
పారఁగ జంబుకం బవునె యబ్ధిపరీతసమస్తధారణీ
భారము పూని కీర్తిగనుఁ బాయనియాతని కెందుఁ బ్రాపుకా
శీరమణుండు దేవగణసేవ్యుఁడు శంభుఁడు గాక మర్త్యుఁడే. 97

వ. అని యుగ్గడించుచు మన కిచ్చెడువ విలువం గర్తవ్యంబు కాదని పురజనంబులు నిజ
మందిరములకుం జనిరంత. 98

సీ. గాధినందనునిచే బోధితుండై శనై, శ్చరుఁ డటమున్న యప్పురికి నరిగి
వికృతమహీసురవేషంబు గైకొని, కపటవృత్తిక్రియానిపుణుఁ డగుచు

గణన చేయఁ దరంబు గానిసమగ్రసం, పద గల్గి యనుభవింపంగ లేక
పచ్చపైకం బైన వెచ్చంబు చేయుట, స్వప్నంబునకు గానివాని గాఁగ
గీ. వడ్డి కడువెక్కసంబుగా నొడ్డి పెక్కు, చోటుల ఋణంబు లిచ్చి నిష్ఠురతఁ బూని
కాలకౌశికుఁ డనుపేరఁ జాలదీన, భావమెల్లను దలయందుఁ బాదుకొనఁగ. 99

ఉ. ఈభువిఁ బాముకుం బలియు నీఁగకుఁ గాటును నీక యెంతయున్
లోభపరాయణాత్మకులలోనఁ బ్రసిద్ధుఁ డితం డనంగ ని
ష్ప్రాభవవృత్తిఁ బూని కలుషంబున కోడక మానసంబునం
దా భయ మేది యుగ్రతరదానము లోలిఁ బరిగ్రహించుచున్. 100

తే. మెలఁగువాఁ డంగడికి వచ్చి మేదినీశు, మాట లాలించి మిగుల సమ్మదము బొంది
దమ్మఁ డీఁక నేఁడు నాచేతఁ దగులుపడియెఁ, గౌశికునిఁ బ్రీతిబొందింపగలిగె నాకు.

సీ. ఎదురయ్యె నాఁడుఁబోయినతీర్థ మద్భుత, మావహిల్లంగ నీయవసరమునఁ
గపటకృత్యంబులు కల్పించి వెఱపించి, బెదరి పోవంగఁ జేయుదు నృపాలుఁ
గాదేని మదిలోనఁ గరుణారసము పుట్టి, నుచితవాక్యంబుల నూరడించి
వక్రించి కులకాంత విక్రయించుతలంపు, సర్వంబు నుడుపుదు జతురలీల
గీ. నంతలో నేఁడు నెల్లియు నరిగెనేని, కడచుమితి బొంకుపారయు భూకాంతునుడువు
ననుచు గృతనిశ్చయుం డయి యాక్షణంబ, నృపశిఖామణిముందఱ నిల్చుటయును.

సీ. దేవురించుచు వాజెదేఱెడు మొగమును, బడబాఱుచుఁ డెడిబడుగుటొడలు
బొలుపేది మెదుకకంపును నీనుసిగయును, బల్లమీసములును బిల్లికనులు
జింబోతుగడ్డంబు జెడ్డచూపులు జాల, జివికినకోలయు జిఁపిగొడుగు
బాతదోవతులును బంచాంగమును ఫాల, తలమున బట్టైవర్ధనము గలిగి
గీ. ముష్టి యెత్తిన ధాన్యము లుమ్మడిచినట్టి, ముఱికిబట్టలు మూపుపై దఱచు వ్రేల
నేవ మొనరించుమాయామహీసుపర్వు, గాలకౌశికుఁ జూచె భూపాలకుండు. 103

వ. చూచి యతనియఱుతం బెనంగొనియున్న యజ్ఞోపవీతంబులకతంబున మహీదేవునిం
గా నెఱింగి కరారవిందంబులు మొగిడ్చి వందనంబు జేసిన మందహాసంబొనర్చి యా
రాజమందారునకు నతం డిట్లనియె. 104

తే. నీదువంశంబు నడకయు నిశ్చయముగ, దెలియునందాక నాశీర్వదింపరాదు
మాకు నెఱుగంగ జెప్పుమా నీకులంబు, వర్తనంబు నిజంబుగ వలయు దెలియ.

క. ఎవ్వండ వీవు నీవా, రెవ్వరు నీనామధేయ మెయ్యది మిగులన్
నివ్వటిలుచులుకదనమున, నివ్వనితన్ విక్రయించె దేయక్కఱకున్. 106

సీ. వివరింప బందికాఁడవువలె నున్నాఁడ, వవయవస్ఫురణచే నదటు గల్గి
కూలిపనులు చేయ హాలికవృత్తికి, నోపుదు వీకృత్య ముచిత మగునె
దూరదేశము పోయి చోరమార్గంబున, బలిమిమై దెచ్చినపరవధూటి
గలుషంబునకు దలంకక భార్య యని చాంకి, విక్రయించుట మాకు విశద మయ్యె
గీ. నారెకులు చూచి రేని మహాప్రమాద, మీవిలాసిని విడిచి నీ వెచటి కయిన
వేగ మఱుఁగుము కాదేని విశ్వసించి, నాయుపదేశించుబుద్ధి వినుము. 107
ఉ. బానిసెగాఁగ నీవికచపద్మదళేక్షణ ధారపోసి స
న్మానము మీఱ నాకొసఁగుమా భవదీయకృతాపరాధముల్
పూనిక నేను గైకొని ప్రభుత్వము గానఁబడంగ నిల్పి యె
వ్వానికి లోఁగ కెంతదొర వచ్చిన గాచెద నిన్ను గూరిమిన్. 108
క. అని యీఁగతి బల్లఱపులు, గొనకొని యఱవంగ విప్రకులజులతో న
మ్మనుజేంద్రుఁ డధికధైర్యం, బున నిట్లని పలికె శంక బొందక తెలివిన్. 109
చ. అవివేకంబున విప్రలాపముల నేలా పల్కెదీలాగునన్
రవివంశుండ త్రిశంకునందనుఁడ నే రాజ్యంబు పాలించుచో
భువిలో నెన్నఁడు చోరశబ్దము వినన్ భూదేవ యిన్నాళ్ళకున్
జెవి సోకెన్ మదిలో నసహ్యముగ నీచేతన్ మహాదోషముల్. 110
చ. అతిశయరోషసంయుతమహాహిభయంకరమండలాగ్రఖం
డితరిపుదంతికుంభతటనిర్మలమౌక్తికరాజి బూని యా
యతజయలక్ష్మికిన్ బరిణయాంగముగా దలబ్రాలు పోయుపా
త్రత గలక్షత్రియవంశజుకరంబులు హాలికవృత్తి కోర్చునే. 111
చ. భయమును బొంది దైన్యమున బాఱను వచ్చి మఱుంగు జొచ్చినం
దయ దళుకొత్తగా నభయదాన మనూనము గాఁగ నిచ్చి ని
శ్చయమతితోడ బ్రోచు టది క్షత్రియధర్మము గాక నాకు ని
న్నియును బరిత్యజించి మహినిర్జరుచాటున నుండ బాడియే. 112
క. ఆలాగున జరియించిన, నేలా ధరియింప విల్లు నిషువుల నెల్లన్
వాలు గరవాలు నసువుల, కీలు ఘనశ్రీలు విపులకీర్తుల మేలున్. 113
క. చెట్టు దగ మోపవచ్చిన, పట్టున ధైర్యంబు వదలి పలుమఱు మిగులన్
రట్టుపడి తమికి మదిలో, నట్టిట్టనె నేని నవ్వరా సరివారల్. 114
సీ. సర్వసర్వంసహాచక్రంబు గాధినం, దనునకు నేర్పడ ధారపోసి
యాజటిలోకబిడౌజున కటుమున్న, యజ్ఞకారణము నెయ్యమున నియ్య

కొనినవిత్తమునకు వనజాయతేక్షణ, విక్రయించంగ నుపక్రమించి
నాఁడ హరిశ్చంద్రనామధేయాంకుఁడ, నీలీల దుర్భావ కేల నీకు
గీ. మిన్నకుండుము కాకున్న మెలఁతగొనఁగ, జాలితివయేని హేమనిష్కములుకోటి
జట్టిగా నిచ్చి మన్మనస్తాప మెల్ల, బాసి కొని పొమ్ము విప్ర యీ పద్మముఖిని. 115
ఉ. నావుడు బ్రాహ్మణుండు నరనాథున కిట్లనుఁ గొంత సత్యవా
చావిభవంబు గానబడె జయ్యన నియ్యెడ మాకు గణ్యసౌ
ఖ్యావహ మయ్యె నీవచన మాగయ నీకు నభీష్టసిద్ధియౌ
భూవర యింతదైన్యమును బొందఁగ నేటికి జక్రవర్తికిన్. 116
చ. విను మిఁక నొక్కబుద్ధి పృథివీతలనాయక నాదువాక్యముల్
మనమున వేఱె యొండుగఁ దలంపకు పౌరులు గేలి సేయ నం
గన గొనరయ్య యంచు నధికం బగుదీనత వాడవాడలన్
గొనకొని పల్కుచుండు టిది కూళతనంబు తలంచి చూచినన్. 117
క. రేయును బగలును నయమున, బాయక నడియాస జూపి భ్రమయించుచు దా
నేయెడ నప్పుండీర్పక, ద్రోయుటయే జాణతనము దుది బరికింపన్. 118
క. ... ... ... ... ...
వేసరి పలుమఱు నడిగి ప్ర, యాసమునకు నోడి తారు యరుగుదు రెందున్. 119
క. నేర్పున నప్పులు గొని తుదిఁ, దీర్పక దక్కించుకొనెడి తెరువులు నే నీ
కేర్పడఁ జెప్పెద విను మ, హార్పతికులతిలక మిగుల ననువుపడంగన్. 120
సీ. తనభూమి వదలక ధనవంతు లగువారి, యిండ్లకు నెపతాప చెల్లఁబ్రొద్దు
జేరి మిథ్యానమస్కారము ల్సేయుచుఁ, బ్రియములు నయములు బెక్కు చూపి
విశ్వాస మొదవించి వృద్ధికి జడియక, తఱుచు పూఁటలును బత్రములుఁ బెట్టి
యధికవిత్తముఁ గొని యరిగినపిదపఁ గొ, న్నాళ్ళకు దమవస్తువములు తెలిసి
గీ. యంగడికి దెచ్చి కోపించి యాన వోడిచ్చి, యడ్డపెట్టిన దలకక యాసమీద
నిలిచి మానంబుసిగ్గును నెఱయవిడిచి, యుఱక మిసిమింతుఁడునుగాక యుండవలయు.
శా. ఈరీతిన్ దల డాయి చేసికొని వా రేమన్న మార్మాటకున్
నో రొక్కింతయు నెత్తకున్న గని మందుం డీతఁ డీకష్టునిన్
జేరన్ విత్తము పోయెగాక మరలం జేగోరనే యింక నే
లా రోతల్ వల దంచు బోదురు నృపాలా తారె కొన్నాళ్ళకున్. 122
క. ఇచ్ర్హి నసత్యవాక్యం, బమ్మెన్ తా కెడి వలవ దణుమాత్రంబును
నెమ్మనమున శంకింపక, బొమ్మా సతి నమ్మవలదు బొంకిన జాలున్. 12

ఉ. ఎంత వెనంగినన్ గృహిణి యిప్పటికి న్నమ్ముడు పోదు నా కుపా
యాంతర మేమియుం బొడమ దర్థము కూడదు కల్ల లాడితిన్
బంతము తూలె నంచు మది పల్కక యిన్నక యున్న నిన్ను భూ
కాంత వధింపగాఁ జనునె కౌశికమౌనికి నింత యేటికిన్. 124

వ. అనుటయు దరహసితవదనుండై హరిశ్చంద్రుం డద్ధరిత్రీదేవునిం జూచి నీవంటిలోకోత్త
గుణవర్తనులకు నేతత్ప్రకారంబు లుపన్యసింపం దగు గాక మాకు బొందుపడునే
నీవింక నేమియుం బలుకక తలంగి చను మనిన నక్కాలకౌశికుం డమ్మహీపాలుని
సూనృతాలాపప్రభావంబునకు మనంబున నత్యాశ్చర్యంబు నొందియు నమ్మహీపాలా
నీకు నీయపాయవిమోచనంబునకు నుపాయంబులు గలిగినం గోపించెదవని మఱియును

శా. భార్యం బోకడ బెట్టి నీవు మది దాపం బేమియున్ లేక గాం
భీర్యం బొందగ నున్నవాడవటు యోపృథ్వీశ మా కేటికిన్
ధైర్యం బెంతయు వీటిబుచ్చి వగవన్ దర్శించి నీమీది తా
త్పర్యస్ఫూర్తిని బుద్ధి జెప్పిన విరుద్ధం బయ్యె నీకింతయున్. 126

తే. అనుచు నడిగినవిత్తంబు నాతఁ డంబు, యిందు మని పైడిటంకంబు లెన్ని పంక
జాప్తవంశజునకు నిచ్చి యమ్మహీశు, రాఘవుఁడు మానసమ్మున గోర్కి మెసగ.

క. ఆననపంకజసౌరభ, మానెడియళు లవగ బొల్చునాచంద్రమతీ
మానవతికురులు వేగ న, హీనగతిం బట్టి తిగిచె నెంతయు బలిమిన్. 128

తే. కొంతదవ్వట్లు తిగుచుచు ఘోరభంగి, బుండరీకంబు ధేనువు బోలె బోవ
దూడకై వడి జని తల్లి గూడముట్టి, యాగి వాపోవుసుతు లోహితాస్యుఁ జూచి.

మ. ధరణీనాథుఁడు దుఃఖితాత్ముఁ డగుచుం దైన్యంబుతో గద్గద
స్వరవాక్యంబుల గాలకౌశికుని దుష్టస్వాంతునిం బల్కె భూ
సుర గోవుం గొని క్రేపు బాపుదురె మత్సూనుం గొనం డిచ్చెదన్
శరదిందుప్రతిమాననుందరతనూసౌభాగ్యసంపన్నునిన్. 130

తే. జట్టి లేనికి హేమనిష్కములు గోటి, తెచ్చి యిమ్మనుటయు ధరిత్రీసురుండు
భానుకులమణి జూచి భూపాల నీదు, పల్కు నిక్కంబ యింకొక్కపాటి వినుము.

క. ధేనువు గొనుచో గ్రేపునకును, ధేనువుతో బ్రతివిలువలో నీయ కాక మహిన్
ధేనువునకు గ్రేపునకును, క్ష్మానాయక వేఱువేఱుజట్టుం గలవే, 132

వ. అనుటయు గాలకౌశికునకు నమ్మహీపాలుం డిట్లనియె. 133

తే. ఇంక నోవిప్ర దుర్గ్రాహ మెల్ల నడిగి, నాడు వేడినవిత్త మంతయును నిచ్చి
సుతసమేతంబుగా నీప్రియాంగనఁ, దోడుకొని పొమ్ము కాదేని దొలఁగు మీవు.

వ. అని యివ్విధంబున నమ్మహీసురుండును నమ్మానవేశ్వరుండును గలహింప నక్షత్రికుండు నిరీక్షించి యోవసుంధరాధ్యక్ష మీ కిరువురకు బరస్పరాక్షేపంబులగోపంబు లేమిటికి మదీయవాక్యంబులు ప్రియంబు లగు నేని మీ కిరువురకుమనంబు లైక్యంబు బొందునట్లుగా నేను మధ్యస్థుండనై యథావిధి దగవు గావించెద వినుం డని యమ్మహీపాలకుం జూచి. 135

సీ. ఈచంద్రబింబాస్య నీభూసురేంద్రున, కీవు మొదల విక్రయించువేళ
నీవిల్లాలినివా డీనందనుండు గాడు, వేఱె పుత్రునికిని విలువ వలయు
నని తేటతెల్లగా నప్పుడు వివరించి, పల్కక దొడిబడ బడతి నతని
కమ్మితి వటుగాన నాత్మజసహితంబు, కాలకౌశికున కీకాంత దక్కె

గీ. నింక నీ వేమిపల్కిన నృపవరేణ్య, పనికిరాదు గతోదకబంధనంబు
వలవ దింక నని యద్ధరావరునితోడ, వసుగు చెప్పినపాడికి గడక బొదలి. 136

వ. కాలకౌశికుం డత్యంతకుతూహలావేశంబున నక్షత్రకుని గదియ దిగిచి యుపగూహనాదిసంభావనంబుల నాదరించినం గనుంగొని యారాజపురందరుండు తనడెందంబున. 137

తే. తగవు ధర్మంబు విడిచి సత్యంబు వదలి, యతడు పిలువని పేరంటమేగుదెంచి
పాడిజెప్పెద ననుచు దబ్బఱలు పలికెఁ, గాలకౌశికునకు నిచ్చకంబుగాక. 138

తే. కరుణ వర్జించి మృగశాబకంబు గ్రోలుఁ; బులికి నిచ్చినయట్లు యీపువ్వుబోడి
విక్రయింపంగ వలసె బ్రధ్మీసురునకు, దరమె యేరికి గడవంగ దైవఘటన. 139

మ. అని చింతించుచు నున్నభూరమణుఁడీనాకార మీక్షించి య
వ్వనితారత్నము ధైర్య మెంతయును నిజస్వాంతంబులో నిల్పి నం
దనుడుం దానును వచ్చి పాదములమీదన్ వ్రాలి శోకంబు నె
క్కొన బల్కెన్ ఘనబాష్పబిందువులు దృక్కోణంబులన్ జాఱగన్. 140

శా. ఓప్రాణేశ్వర యోగభీరజలధీ యోధైర్య హేమాచలా
యోప్రాలేయమరీచిరూపవిభవా యోరాజచూడామణీ
యోప్రత్యర్థిమదేభపాటనహరీ యోనిత్యసత్యవ్రతా
యోప్రాభ్రాతదినేశతేజ నిను నేయోజం బెడంబాయుదున్. 141

శా. దీపింపంగ నొనర్చు వెల్లపుడు నర్థిన్ మన్మనోమోదముల్
కోపం బింతయుఁ జూప వోడుదువు పెక్కుల్ నేరముల్ గల్గినన్
నాపూర్వం బగుకర్మ మెట్టిదియొ సంతాపంబు పాలంబడన్
బాపెం దైవము నేఁటితోడ నను నీపాదాంబుజద్వంద్వమున్. 142

క. కౌశికసంయమిమాయా, పాశంబులచేతఁ గట్టుపడితిమి మదిలో
లేశము ధైర్యము వదలకు, మీ శాశ్వతకీర్తి సత్యమే యొనగూర్చున్. 143
క. క్షితినాథ 'యతో ధర్మ, స్తతో జయ' మటన్నపలుకు సకలపురాణ
స్మృతులు దెలుపంగ వింటిమి, సతతము సుకృతంబు నిలుపు సదమలబుద్ధిన్. 144
మ. మకరగ్రస్తుని హస్తిరాజు ననుకంపాబుద్ధితో మున్ను బా
యక రక్షించినలీల నో ధరణిపాలాగ్రేసరా నిన్ను గౌ
శికమానీశ్వరపీడితుఁ గుణనిధిన్ జేపట్టి రక్షించున
ధికమారీరమణుండు చక్రధరుఁ డెంతే వత్సలత్వంబునన్. 145
శా. శ్రీకంఠుండు పినాకపాణి గిరిపుత్రీవల్లభుం డార్తర
క్షాకేళీనిపుణుండు బాలశశిరేఖామౌళి వేదాద్రిసీ
మాకంఠీరవమూర్తి శంకరుఁడు నేమం బార సంప్రీతితో
నీ కాశీపురవిశ్వనాథుఁడును నీకిచ్చున్ మనోభీష్టముల్. 146
మ. విను నానోముఫలంబునన్ మగుడ నీవిశ్వంభరామండలం
బనివార్యస్థిరకీర్తివైభవుఁడవై యాచంద్రతారార్కమిం
పునఁ బాలించెదు మానినీమణుఁడిపు డీభూదేవుపక్షంబు లా
డె నటంచుం బరితాప మందకుము నీడెందంబునం జేమియున్. 147
క. నీరజబాంధవుఁ బొదివిన, ధారాధరతతులయట్లు ధరణీధవ నిం
డారంగ నిన్ను బొదివిన, భూరివిపత్సముదయములు పోరిఁబోరిఁ బాయున్. 148
తే. మమ్ము బఱవుము సత్యంబు మఱవకెపుడు, నిను మృషావాదిఁ జేయుమనుచు నిచలమున
గాధినందను డొనరించుకపటకృత్యములకుఁ జలనంబు నొందక నిలుపు మధిప. 149
వ. అని వెండియు బ్రాహ్మణవరకామినీజనంబులకు వందనం బొనరిచి సన్నిలవేణిం
గని కాలకౌశికుం డత్యంతరోషావేశంబున.
తే. కపటములుపన్ని యిపుడు నన్నగ్గమొఱఁగి, సుమహాజ్ఞానవేషఁజూపుమ్ము నిన్ను
గనికరము మానసంబున గదియనీక, దాసిగా జేసి యేలుదు వాసి యుడిపి. 151
వ. అని యక్కాలకౌశికుండు. 152
తే. తిరిగి యింటింటు ముష్టియెత్తిన యనేక, ధాన్యముల గూడు లన్నియు దనదు మూఁపు
మీఁద నున్నవి తొలగించి మిగుల బరువు, గాఁగ నా శేషపత్రల మోపు గట్టి నెత్తి.
తే. వేగ మింటికి బదపద జాగు మాని, నీటుసేయక నడువుము నెలత యనుచు
గుంభినీసుతః పదలింప గొనకుచెట్టె, బట్టుకొని చాల బాహ్యల తోడ్కొనంగ. 154

చ. బడిబడి గన్నులం దొరఁగుబాష్పజలంబులచే నురోజముల్
దడియఁగ గండపాలికలపట్టుపుఘర్మకణంబు లుబ్బ నె
న్నడు మసియాడ గొంకుచు మనంబున నార్తజనైకరక్షణున్
మృడునిఁ దలంచుచుం జనెడిమానవిలోచన జేరి చూచుచున్. 155

వ. కాశికాపురవీథులం దొలంగక సందడిగొనుపురంధ్రీజనంబులు డెందంబులు వగలం బొంది తమలో నిట్లనిరి. 156

చ. కలితశిరీషపుష్పమునకంటె మృదుత్వము కల్గి యున్న దీ
లలనశరీర మిట్టిశశిలాంఛనబింబనిభాస్య నక్కటా
తలపయి మోపు మోవనిటు తామరమాలి యొనర్చె నాత్మ ను
మ్మలికము లేక యీబరువు మానవతీమణి యెట్లు పూనెడిన్. 157

క. సంపూర్ణపూర్ణిమాశశి, సొంపు దలపింపఁ జాలు సుకుమారతనూ
సంపద గలయీబిడ్డను, కంపింపక యెట్లు నేర్చె గమనింపంగన్. 158

క. ఈవిప్రాధముఁ డతికలు, షావహావర్తనుడు ధూర్త హరహర వీరిన్
దా విలిచి నిర్దయుండై, కావించుచు నున్నవాఁడు ఘనతరబాధల్. 159

ఉ. ఈతని విప్రుగాఁగ విధి యెట్లు సృజించెనొ లేశమాత్రమున్
భూతదయావిశేషమును భూసురతేజము శాంతభావమున్
బూతచరిత్రముం సుకృతశుద్ధియు లేదు దలంచి చూచినన్
వీతవివేకు లోభగుణు వృత్తచరాభకురూపు నెంతయున్. 160

వ. అని యీలాగున పౌరవిలాసవతీజనంబులు తన్ను నుపలంభింప నక్కుంభినీసురుండు కోపించి నిజకరావలంబిత యష్టిదండంబునఁ బ్రచండంబుగా నప్పుండరీకలోచనలం గదిసి వ్రేసినం గలకలం బెసంగ గలంగి తొలంగి చనుచుండ నప్పుడు ధూర్తవిప్రుంగనా ప్రేరితులై బ్రహ్మచారిజనంబు లక్కాలకౌశికుం బొదివి. 161

సీ. శిరముష్టిదండ మొక్కఁడు తీసి పోవైచె, నంజ కొక్కఁడు సిగ గుంజి యడిచె
యొడిసి గడ్డముపట్టి యొక్కఁ డుయ్యాల లూఁగెఁ, జెదరక దోవతిఁ జించె నొకఁడు
తవిలి యొక్కఁడు జన్నిదంబు లన్నియుఁ దుంచె, వెసనాతపత్రంబు విఱిచె నొకఁడు
కినిసి యొక్కఁడు పుచ్చుకొనియెఁ బంచాంగంబు, వెలికిలఁబడఁద్రోచె నలుక నొకఁడు
గీ. ఓలిఁ గుక్కల నుసికొల్పె నొక్కరుండు, పెనఁగి యొక్కఁడు పట్టెవర్ధనము నాఁకె
నుమిసెఁ బుష్పక మొగమునై నొక్కరుండు, బెట్టుఁ బొర్చుచు దొడలఁ గొట్టె నొకఁడు.

వ. ఇట్లు [illegible] వీఁకలు సేయుబ్రహ్మచారిజనంబులఁ బ్రియంబున వం
ద[illegible] ప్రియంబుగా నీభూదేవునిం బోవం దగునని పలుకుచుండ్రి,

మతిం గనుంగొని తదీయగంభీరభాషణంబులకు సముజ్జృంభిసుకుమారు లనురాగసం
భరితాంతరంగులై. 163

ఉ. ఓతరలాక్షి ధర్మగుణయుక్తచరిత్రవు గాన నీమనః
ప్రీతిగ నీదురాత్ముని నపేతవివేకునిఁ గ్రూరభాషణున్
ఘాతకలోకవర్తనుని బాధ యొనర్పక సత్కృపారసా
న్వీతులమై భయం బుడిపి నేటికిఁ గాచితి మావు వేడఁగన్. 164

తే. అనుచు బ్రాహ్మణబాలకు లనుగుతయును, గొంతభయమేదివిప్రుఁడయ్యతిఁ జూచి
యెట్టకేలకు నొయ్యన నీరెలుఁగున, బలికె నవివేకపరుషభాషలు చెలఁగ. 165

ఉ. కొంచక నన్నుఁ బట్టుకొని క్రూరత నూరక యీసురేఁగి బా
ధించుచునున్న యావటుగుదిర్మ్మరులం బరియారెకల్ విస
ర్జించి మహోగ్రతం బొదవి శిష్టుల యందఱ నేపు దూలఁ గం
డించక యుండ నీకుఁ దగునే యిటు వాండ్ర నొలంగ బంపఁగన్. 166

వ. అని కినిసిపలుకుచు మెల్లమెల్లనఁజని గృహప్రవేశంబుసేయు నెడఁబురోభాగంబున,

సీ. పల్లచింపితితల పాలఁబు నుడియును, ముడిబొమ్మలును జప్పిముక్కుడొప్ప
చెవులుఁ బిల్లికనులుఁ జెక్కిటిపులిపిరి, గొగ్గిపండ్లును ముదికోఁతిముఖము
కొంగమెడయు నిడుగూనివీఁపు నొలుగు, బోయిన రొండియు బొక్కబొమ్మ
నింకుమఁజన్నులు వంకచేతులుఁ, గడుపల్లమోనగానునపంటినడుము

గీ. దొడ్డకాళ్ళును నల్లనిచెడ్డయొడలుఁ, గలిగి యత్యంతనీరసాకార యైన
కలహకంటకి నవ్విప్రుకాంతఁ జూచి, భయము జనియింప ధారుణీపాలుఁడేవి. 168

వ. బిడాలంబుం గనుంగొనిన కీరకిశోరంబునుంబోలెఁ దల్లడిల్లుచున్న నప్పల్లవాధరం గనుం
గొని యిది యెక్కడిమిటారిం గొనితెచ్చితి వని తటాలంపుమాటలాడుచు మగం
డునుం దానును గచాకచిం గడంగి. 169

చ. పొరి బొరి నిష్ఠురక్రియలఁబూని పెనంగుచు నున్న ధారుణీ
సురమిథునంబు జూచి ధృతి సొంపు దలిర్ప బతివ్రతాగుణ
స్ఫురణము గానుపింపఁగ వచోనిపుణత్వము మీఱ బల్కె సం
బరమణివంశభూషణుని పట్టపుదేవి వివేక మేర్పడన్. 170

చ. కలరు ధరిత్రి నాలును మగండును నిక్రియ దారుణోద్ధతిన్
గలహ మొనర్చువార లది కర్మమకృత్యము గాదె చూచినన్
గెలనికి మెచ్చుగాదు పరికింపఁ సిగ్గొకలేశమాత్రముం
దలఁపదు వాదులాడి జనంబులు సారెకు నవ్వుచుండఁగన్. 171

తే. మగఁడు దను మెచ్చ దాసును మాఱు మెచ్చ, రాజముఖి గాత్రమనూకరమై జనించు
భర్త కోపించి మఱి యెన్ని పల్కెనేని, వలఁదు ప్రతిభాషణంబులు వనజముఖికి.

చ. కలశభవాత్రిగౌతముల కాంతలు భర్తృపదాబ్జసేవ ని
ర్మలతరభక్తి జేయుచు సమస్తజనంబులు బ్రస్తుతింపగా
వెలసిరి గాన భామలకు వేఱొకటిప్రియహేతుకృత్యముల్
సలుపుచు నుండఁగా వలయు సంతతముం గడుఁ బ్రేమతోడుతన్. 173

సీ. కుసుమకోమలులకు గుజ్జుమామిడిపండు, ప్రాణనాయకు పాదపద్మసేవ
శాతోదరుల కఱచేతి మాణిక్యంబు, ప్రాణనాయకుపాదపద్మసేవ
కీరవాణులకు మురిగిటిపెన్నిధానంబు, ప్రాణనాయకుపాదపద్మసేవ
కుటిలకుంతలులకు కొంగుబంగారంబు, ప్రాణనాయకుపాదపద్మసేవ
గీ. వలవ జేనోములను నోమ వనరుహాక్షు, లకు మనోహరుపదకమలంబు లెపుడు
ముదముతోడ భజించిన నదియె చాలుఁ, దలఁచి చూచిన నభిమతార్థంబు లొసఁగ.

తే. అనుచు బెక్కువిధంబుల మనుజవిభుని, వనిత పల్కు సతీధర్మవాక్యములకుఁ
గనలి మోమున నరుణిమ గ్రమ్మ విప్రు, డెంతె భీషణగాఢధ్వనిస్వనమున. 175

ఉ. మించినకాలకౌశికునిమీఁది మహాగ్రహ మెల్లభూమిభృ
చ్చంచలనేత్రిపై నిలిపి చాలఁగ నిష్ఠురభాషణంబులన్
గొంచక పల్కెఁ గన్గొనలఁ గోపహుతాశనకీల లుబ్బ న
క్తంచరిపోలెఁ జూపఱకు దారుణలీల భయంబు జూపుచున్. 176

తే. తావు జెప్పంగ నిన్ను బ్రార్థన మొనర్చి, యెవ్వ రిచటికి దెచ్చి రోచివ్వలాడి
నీవు చెప్పక యుండిన నేమెఱుంగనొ, పుడమి వర్తించుమగనాలినడత లెల్ల. 177

చ. పతిహితచర్య లీకరణిఁ బాయక నీవుపదేశ మియ్యఁగా
సతతము నింత నీవొడువు చందమున న్విహరించుచున్న నే
యితరులయట్లు నైఁపు మొకయించుక నేఁపు సమస్తకార్యసం
గతులును లెస్స చేసెదను గ్రక్కున నేటికి వేసరింపగన్. 178

తే. నన్ను జెప్పంగ నెఱుంగవు మున్ను నీవు, మృత్యువైనను వెఱచు నాయెదుర నిల్వ
నిరుపహరులవారికి నెల్లజుక్క, యెమరు నాయిల్లు వేయును నేల యింక. 179

చ. గనుఁగనుఁగొన్న యప్పుడ ఘనం బగుభీతి నడంచుచుండ నా
పెనిమిటికిన్ భయం బుడిపి బీరము నెక్కొన మాఱు మెత్త నో
య్యన సమకట్టి తెచ్చి కలహంబుగఁ బుర్కొల్ప తంచుభూ
జనమత పుణ్యశీల యగుచంద్రమతిం దలపట్టి యీడ్చుచున్. 180

క. వ్రేసి పదతాడనంబుల, వాసిం గొలగించి నొంచి వదలక వటియున్
గాసిం బెట్టుచు నడిగెపు, దాసిం గా నేలుచుం డెదయ లేక నృపా. 181

వ. అట హరిశ్చంద్రనరేంద్రుండు పురంధ్రీరత్నంబును విక్రయంబు గావించి విత్తంబు సమస్తంబును సమర్పించుటయుఁ గైకొని యమ్మునికుమారుఁ డత్యంతసమ్మదంబున నాసార్వభౌము నాశీర్వదించి. 182

తే. కౌశికునియాజ్ఞ నీవెంట గడుబ్రియాస, మున జరించిన వాసరంబులకు నెల్ల
బత్తెసెల వయ్య ధారుణీపాల యిపుడు, నీవు నాకిచ్చినధనంబు నేటితుదకు. 183

చ. ఇనకులవర్య కౌశికమునీంద్రు ఋణంబును వేగఁ దీర్చి స
మ్మనిచి సమగ్రసూనృతమహత్త్వముఁ జెందుము నీవు నావుడున్
జనపతి నవ్వి యిట్లనియెఁ జయ్యన నాతనిఁ జూచి పల్మఱున్
దనతల యూచుచున్ మిగుల దైవముచేఁతకు నాత్మ నూలుచున్. 184

తే. నిన్ను నామీఁద దరువుకానిగ నొనర్చి, యనుప్రుచో నీకు బత్తెమిమ్మనుచు గాధి
తనయుఁ డేమియు నాతోడ ననఁగలేదు, పాడియే నీకు నను నేఁడు బత్తె మడుగ. 185

క. సారం బైనవివేకివి, చారం బింతయును లేక సారెకు నాపై
నూరక మిథ్యావాదము, లీరీతిం బలుక భావ్యమే మునితనయా. 186

క. నావుడు నతఁడిట్లను డో, భూవర నీవెంట నన్ను బుత్తెంచుతఱిన్
భావించి నన్ను దగ్గఱ, రావించి రహస్యవాక్యరచన చెలంగన్. 187

క. దినమును నీచే బత్తెము, గొను మని కౌశికుడు చెప్ప గోపం బేలా
మనుజేశ యేను మిన్నక, పనిపడి నీవెంట దిరుగ బంటునె చెపుమా. 188

ఉ. ఆతపశీతవాతముల జంకక నే నిను గూడి పర్వత
వ్రాతము లెక్కి వాహినులవారణ దాటి మహాటవీస్థలుల్
భీతి దొలంగి చొచ్చి కడుబేలతనంబున డస్సితిన్ ధరి
త్రీతలనాథ నాకు వలదే తనబత్తెము మాత్ర మియ్యగన్. 189

ఉ. సంతతవేదపాఠమును సంధ్యయు నగ్నియు నుజ్జగించి నే
నెంతయు మూఢవృత్తి ధరణీశ్వర పాపము గట్టుకొంటి నీ
చెంత వసించి కౌశికునిశిష్యులలోపల నేటిదాక ని
శ్చింతమతిన్ యథావిధిగ జేయను దప్పక నిత్యకృత్యముల్. 190

సీ. విను నృపాలక యూళ్ళవెంబడి సేవర, గుళ్ళపంచల జేరి కూతిల గుడిచి
యడిగి తెచ్చిన నీరసాన్నముల్ భుజియించి, బడలితి నెంతయుఁ బడసి తివిసి

యెంచఁగ నేఁటికి గామంచితనం బీవ, యెఱిఁగెద వని యంటి విచ్చలోన
నే నొందినప్రయాస మెఱుఁగంగ లే వైతి, వించుకంతయును నింకేమి యనఁగ
గీ. దాల్మి దిగనాడి యలుకమై తరువు కాని, చేఁత లన్నియుఁ బలుమాఱుఁ జేసి నీవు
వాసి యొకపక మొగమోటువలనికార్మి, నూరకుండిన నపరాధ మెదవె నాకు.
ఉ. నావుకు భూమిపాలుఁడు మనంబునఁ గోపము సంభవింపఁగా
నావటుధూర్తుఁ జూచి వసుధావర యీగతి నిష్ఠురోక్తు లే
లా వచియింప నీకు మొదలన్ దినబత్తెము నేనొడంబడన్
నీవు గురుప్రయోజనము నెమ్మి నొసఁగ్వఁగ వచ్చి తిమ్మెయిన్. 192
క. ఎల్లెడఁ బరదేశులకును, గుళ్ళుం బంచలును రచ్చకొట్టంబులు నం
గళ్లును గాక తలంపఁగ, జల్లనియున్నంపుపల్లసాలలు గలవే. 193
ఉ. నీ కిటు నన్ను దూఱఁ జనునే పలుచోటుల నీరసాన్నముల్
గాక సుఖప్రకారమునఁ గల్గఁగ నేర్చునె పాయసాన్నముల్
చేకొని యిండ్లవెంట నిరసింపఁగ బిచ్చము లెత్తువారి క
య్యో కరుణింపఁగా వలదె యోపిక గల్గి మనంబులోపలన్. 194
క. అమృతము ద్రావిన నోగసె, దగుకంబునఁ గినిసి విషముఁ ద్రావినరీతిన్
మమత మును మేలు గావించి మఱి యిట్టి కిప్పు డెగ్గు చేసెద వనఘా. 195
సీ. పరుషభాషణములు పలుమాఱు పలుకక, యిల్లియు నేఁడు సహింపుమాత్మ
నరసి నే నేయుపాయంబున నైనను, మిథిలఁ జెల్లి తు మీధనంబు
నిప్పు డిచ్చినవిత్త మప్పులోపలిదియు, కాఁగ నైనోను నిమ్ము సటుబుద్ధి
ననఘ విత్తంబు హార్పించునట్లుగా, బత్తెంబు నిత్తు నేపాటినైనఁ
గీ. దొలుతఁ గౌశికసంయమీంద్రునిఋణంబు, మొదలుముట్టంగఁదీర్చి నామునికుమార
కీర్తిఁ బొందెదు ననుఁ గటాక్షింపవయ్య, కరుణ యుల్లంబులోపల నిరవుకొనఁగ.
వ. అనిన మందహాసంబు చేసి యమ్మునినందనుండు నృపవరేంద్రునిం జూచి. 197
క. భూపాల యిప్పుడు రొక్కము, చేపడిన ధనంబు విడిచి సీమాంతరముల్
నీప్రజ్ఞఁ దిరుగుచుండఁగ, నాపాపమె యింత యేల నలి పెట్టంగన్. 198
తే. క్షితితలేశ్వర నన్ను నీచేతిహేతిఁ, బూని వధియించి నతి కొనిపొమ్ము ధనముఁ
బచ్చనైకంబు నిందులో వెచ్చపఱుప, నెన్ని చెప్పినమాట లింకేటి కనిన. 199
ఉ. ఓపరమేశ్వరా యని పయోరుహబాంధవవంశవర్ధనుం
డాపరుషోక్తికిం గడురయంబున వీనులు మూసి యాత్మ సం

శాపము నొంది యివ్వడుగు దానతిపాతకుఁ డిట్టి కట్టిడిం
జేపడె మున్నుగా ధనము చేరునె క్రమ్మఱ నాకు నేమియున్. 200

క. ఏపగిదిఁ దీర్తునిఁక నేఁ, దాపసవరుఋణము నిజము తప్పక యుండన్
నాపలికినమితిదినముల, లోపలనె సమస్తజనములుం గొనియాడన్. 201

వ. అని చింతాక్రాంతుఁడై యున్నయమ్మహీకాంతునింగనుంగొని కపటక్రియానిపుణుం
డగు నక్షత్రకుం డిట్లనియె. 202

క. ఊరక చింతించుచు నీ, వీరీతిం గదల కున్న నృప మావిత్తం
బేరీతి వచ్చు వేగమ, రా రమ్ము ధనమ్ము దెమ్ము రసికత వెలయన్. 203

సీ. అనిన నిట్లని పల్కె నవనీకళత్రుండు, నక్షత్రకునియాననంబుఁ జూచి
మునిపుత్ర యే నొనర్చిన యపరాధముల్, పెక్కులు గల వేల పేర్కొనంగ
నరవిందలోచన నమ్మునవిత్తంబు, తోడఁబడ సర్వంబు దొరకె నీకు
మునిఋణం బిఁకఁ దీర్చుకొనఁదగు స్వాపతే, యంబున కొం డుపాయంబులేదు

గీ. కాన వేగంబ నన్నుఁ గింకరునిఁగాఁగ, వీటిలో నెవ్వరికి నైన విక్రయించి
నిరవశేషంబుగా నప్పు నేటితోడ, నంతయును దీఱునంతద్రవ్యంబుఁ గొనుము.

వ. అనుటయు నట్లు కాక యని సమ్మతించి నక్షత్రకుం డవ్వసుంధరాధ్యక్షునిదక్షిణహ
స్తంబు నిజపుస్తకసూత్రంబున బంధించి. 205

తే. రమ్ము నీవని కొంపోయి నెమ్మనమున, శంక యేమియు లేక యాసార్వభౌము
బట్టణములోన విక్రయింపంగ దొడగె, బౌరజనహారవంబులుఁ బ్రబలుచుండ. 206

సీ. క్ష్మాచక్రమెల్ల విశ్వామిత్రమునిశిఖా, మణికి నర్పించిన మంచిదాత
నేడుదీవులను విజృంభించి బహుజయ, స్తంభమున్ నిల్పినశౌర్యశాలి
బేతాళుఁ డనుపేరిభూతంబుఁ దెగటార్చి, మునులభయంబు మాన్పినమహాత్మ
నిత్యసత్యవ్రతస్తుత్యుఁడై కీర్తి వి, స్ఫూర్తిచే వెలసినపుణ్యమూర్తి

గీ. నర్కకులవార్ధిపూర్ణేందుఁ డగుత్రిశంకు, కూర్మిపట్టి హరిశ్చంద్రకువలయేశు
విక్రయించెద నడిగినవిత్త మొసఁగి, గరిమ గొన రండు పౌరలోకంబులార. 207

వ. అని యిప్పగిది నప్పట్టణవిపణిమార్గంబుల నమ్మహాశయుం బున నటుమున్న నిజతపస్సా
మర్థ్యంబున విశ్వామిత్రుండు మణికర్ణికానికటంబున నొక్కచిల్ర్పవనంబు నిర్మించి
యునువర్తిం తలంచిన. 208

ఉ. దండము కేలఁ బూని జలదప్రతిమానతనుప్రభావళుల్
మెండుకొనంగఁ గింకరులు మిక్కిలి భక్తి భజింపఁగాఁ గృతాం

తుం డరుదెంచి తత్పరత ధూర్జటిసన్నిభుఁ డైనమౌనిమా
ర్తాండున కెంతయుజ్ దృఢతరం బగుభక్తి నమస్కరించినన్. 209
క. కౌశికముని వైవస్వతు, నాశీర్వాదం బొనర్చి యాదరమోదా
వేశం బొదవఁగ నిట్లను, వైశారద్యానవద్యవాచాగరిమన్. 210
సీ. మార్తాండనందన మన్మనఃప్రీతిగా, నీవు మహాద్భుతం బావహిల్ల
మాయాశ్వపచవేషివై యతిపేన నీ, పురిప రేతని కేతనమునకు నాధి
పత్యంబు గైకొని నిత్యసత్యమునకై, నా కొడంబడిన ధనంబు లేమి
నమ్మెడు వోయెకునాదిత్య కులవార్ధి, చంద్రు హరిశ్చంద్రసార్వభౌము
గీ. విలిచి హుంకార మెల్లను వీటఁ బుచ్చి, కింకరునిఁగాఁగ నేలి నిశ్శంకలీల
ననుదినంబును హేయంబు లైనపనులు, చేయ నియమింపు దైర్యంబు చెదర నందు.
వ. అనిన నట్లుకాక యని యాతఁడంబ. 212
సీ. నడునెత్తిఁ గొప్పుఁ గన్నములఁ గీలించిన, తెల్లనిముడుసుఁ జెండిరపుబొట్టు
మొలఁ గాసెఁ రోసినముటికిపాతయు నందు, నడుము బిగించిననరపవాలు
దలనిట్లునట్లుగా నలసి యొల్లమిగాఁగ, జెనచిచుట్టినకావి పేర్లికయును
దైఁదిప్పి కప్పినపాత్రిదోలంపాయయు, జే నున్న నీలయష్టియును గలిగి
గీ. కోరి పసరపునంజుటిగుడియు గల్లు, బుంగయును బూని తనమేని పొలుసుకంపు
లలముకొన వీరబాహునునాహ్వయమున, గపటచండాలవేషసంకలితుఁ డగుచు. 213
మ. మదిరాపానవికారచేష్టల నడుజ్ మత్తిల్లి రక్తాక్షుఁడై
యెదురుం దన్ను నెఱుంగలేక మిగులన్ హేయంబు వాటిల్లఁగా
బదముల్ తొట్రుపడంగ జొక్కుచు మతిభ్రాంతిన్ బడం బాఱుచున్
గుది గొంచున్ వెడపాటఁ బాడుచు దురుక్తుల్ పేర్లుచున్ సోలుచున్. 214
తే. మొగమువైఁ జిమ్మజీకటి ముడివడంగ, మాటిమాటికి మీసాలు దీటుకొనుచు
జనియె సంబళి సంబళి యనుచు బంక, జాప్తకులపుంగవుఁడు వచ్చునంగడికిని. 215
వ. ఇట్లు చని యయ్యంత్యజుం డత్యంతహేయంబుగా మొగంబున గల్లుకంపు వెల్లుబ్బ
తబ్బిబ్బు లగుపల్కుల నిట్లనియె. 216
తే. ఓరియోరంతపాత్రుడునా యొద్దఁదల, కుండియుడిగంపుపనులు సేయుచు బ్రియంబు
చెలఁగ మెలఁగెదవేని యాచిఱుతబాప, డడగినంతధనంబు నే దడయకిత్తు. 217
వ. అనుటయు నాపారుణితలోచనుండై భూపాలుం డాచండాలుం జూచి. 218
శా. ఓరీ మాల దురాత్మ నీమనములో నొక్కింతయున్ శంకలే
కీరీతిన్ దురహంకృతిన్ బలుక నోరెట్లాడెరా నీకు నా

హా రాజీవసఖాన్వయుఁడ విలువ నీ వష్టాండవే పొమ్మ నన్
జేరన్ రాకుము మద్యపానకృతదుశ్చేష్టావికారంబునన్. 219

క. ఏ నెక్కుడ నీ వెక్కుడ, మానిసిమాయనకు నిష్టుసతికడుఁ జూడలం
గా నొసఁగెడుధన మెక్కుడ, హీనకులుఁడ తొలఁగు మనిన నిట్లనువాఁడున్. 220

సీ. దండహస్తుండనై తప్పు లారసి మనుష్యుల నెల్ల శిక్షింతు వలసినట్ల
యనిమిషులకు నైనఁ గినియంగ రాదు నా, యెడ నీకు నిట్లేల హేయపడఁగ
జండాలుఁ డని సారెసారెకు నన్ను నీ, వీసడించుట పాటియే తలంప
ధర నుతిఁ గన్నమీ తండ్రివంశమునకు, నాదువంశమునకు భేద మెద్ది

గీ. మునిశిఖామణిబుణ మెల్ల మొదలుముట్ట, నేనె తీర్చెద నెవ్వఁడ నైన నేమి
దురభిమానంబు మాని యీదొసఁగు వెడలఁ, గోరి నాచేత విత్తంబు గొనుము వేగ.

క. ఇంతదొరవయసవాఁడవు, పంతంబున నుండ కేల ప్రాభవ మెడలన్
వంతం బొందుచు నోభూ,కాంతా యివ్వధుగుచేత గాసిం బడఁగన్. 222

క. పలుమఱు నీతో నాకున్, గలహింపఁగ నేల ధనము గలవారికి దా
సులు లేరె యరసి పిలిచినఁ, దొలఁగుము చెప్పకుము నీదు దొడ్డతనంబుల్. 223

వ. అని హరిశ్చంద్రనృపుండును నాచండాలుండునుం బట్టిచూడ నట్టియెడం గదిసి
నక్షత్రకుండు. 224

మ. మును నాతోడుత నీవుపల్కినక్రమంబుం గాదె భూపాల యె
వ్వని కైనన్ నను విక్రయింపు మని గర్వస్ఫూర్తి వర్జించి నీ
వనవే యీగతి నేటికిన్ దిరుగ సత్యప్రౌఢిఁ బోనాడి యీ
తని హీనుండని మాటిమాటికిని నింద ల్పల్కు నీ కేటికిన్. 225

క. ఇతఁ డెవ్వఁడైన నేమగు, క్షితినాయక ధనము మాకుఁ జెల్లించినవాఁ
డ తగినమాన్యుఁడు తలఁపఁగ, నతివేగమ విత్తమునకు హరు వీఁక జెపుమా. 226

శా. ఈచండాలునిచేత మాధనము నేఁ డిప్పించెనో కాక నీ
వాచాడంబర మెల్ల మాని యనృతవ్యాపారశీలుండ వై
యాచంద్రార్కము ధాత్రిపై నిలుచుసత్యస్ఫూర్తి వర్జించెదో
ధీచాతుర్యము మీఱ నిం దొకటి నర్థిం బూనుమా చెచ్చెరన్. 227

మ. వినుమీ నాదుప్రతిజ్ఞ యింకొకటి యీవిత్తంబుకున్ రెట్టి యి
చ్చిన నొండొక్కని కమ్మ నీతనికె నిన్ శిక్షింప నే నమ్ముదున్
బెనఁగొన్నట్టిచలంబుతోడ ననుచున్ బృథ్వీశ్వరుం బల్కఁగా
విని చండాలుఁడు సంతసిల్లి పలికెన్ విప్రోత్తమున్ జూచుచున్. 228

తే. అవుర మెచ్చితి నోబాపనయ్య నిన్ను, దిరుగ కీమాట నీమదిఁ దిరము సేయు
హీనకులుఁడని యితఁడు నన్నేవగించి, పలికె నాయాత్మకది యంపములికియయ్యె.

ఉ. నీబుణ మెల్లఁదీర్చి యవనీపతి గింకరుఁగాఁగ నేలుదున్
గోరుము నీదుచిత్తమునకున్ మితి యెయ్యది యన్న సమ్మదం
బారగ బల్కె మౌనిసుతు డంత్యజు గన్గొని యింతపట్టు నీ
పేరుగ జేసి నామదికిఁ బ్రీతి యొనర్చుము నీవు దాతవై. 230

తే. జనుఁడు దంతావళము నెక్కి చాలనిక్కి, గగనతలమునకై రత్న మెగిరి పోవ
వైచినంతయుబోడవు ద్రవ్యంబు దెచ్చి, రాశిగా బోసి మాకిమ్ము రాజు గొనుము.

క. నావుడు నంత్యజుఁ డిట్లను, నీ వడిగినవిత్త మెల్ల నే నీకిత్తున్
వేవేగ యడుగు తిరుగక, యోవడుగ జనించె శంక యొక్కటి నాకున్. 232

క. తనదేశం బెడఁబాయక, జను లెఱుగగ నాలు బిడ్డ సంసారము గ
ల్గినవానిఁ గాక యొంటరి, ననుమానము లేక నమ్మ నగునే నాకున్. 233

చ. పగలును రేయు దత్పరత బాయక నా కుడిగంబు సేయుచున్
దగవరివై మదాజ్ఞ గుఱి దాఁటక నుండగ బూట యెద్ది నె
వ్వగ బొరలంగ నోప నొకవంక కిఁకఁడు తొలంగి పోయినన్
మిగుల బ్రమాద మౌ విపద మిన్నక యేగతి విశ్వసింపుదున్. 234

వ. అనిన దాపసకుమారుం డమ్మహీపాలుం గనుంగొని నీవిమ్మాతంగునకు సమ్మతంబగు
నట్లుగా నమ్మ బలికి మాధనంబు సమస్తంబును ద్వరితంబ తెప్పించి యిప్పింపవలయు
నని బహువిధంబుల మనంబు నొవ్వం బలికి నెవ్వగం బెట్టు నవ్విడుగునిస్సారకృత్యం
బులకుం గలంగి హరిశ్చంద్రుం డివ్విధంబున నైనఁ బూని యీతనివిత్తం బొక్క
చిన్నంబునుం గడమ గాకయుండ సమర్పించి నేటితోడనే కౌశికుని మాయాపయో
రాశి యుత్తరింతు నని చిత్తంబున నిశ్చయించి వీరబాహుం జూచి యిట్లనియె.

క. నామీద నవిశ్వాసం, బేమిటి కనుమాన ముడుగు నే సూనృతవా
చామహిమ నిల్పఁగోరి ధ, రామరునకు దక్కినాడ నమ్ముడు వోవన్. 236

క. జననీజనకులు సత్యం, బును సుజ్ఞానంబు వినయమును ధైర్యంబున్
దనయుఁడు మిత్రుండును నా, కనుజుఁడు సుకృతంబు శాంతి యాలు దలంపన్. 237

ఉ. వాసవవల్లభాన్వయుఁడ వర్జితదోషుఁడ సార్వభౌముఁడన్
భాసుర సూనృతప్రతిభ బాయఁగ జాలక చేరి నీకు నే
దాసుఁడ నయ్యెదన్ వినుము తప్పనిమాటయ నాకు బూట యీ
భూసురబాలకాగ్రణికి బొందుగ నిమ్ము ధనమ్ము సర్వమున్. 238

చ. హృదయములోపలన్ గపట మించుక యేనియు నిల్ప కెంతయున్
సదమలభక్తి యుక్తి ననిశంబును బాయక నీదుసేవ సే
యుదు మఱి సేయ కుండిన మహోగ్రత నాదుశిరంబు ద్రుంచి నీ
పదములమీద నిల్పెదను బాలసుధాకరమౌళి సాక్షిగన్. 239

వ. అని యమ్మహీపతి యతులప్రతిజ్ఞావచనంబులు పలుకుటయు విశ్వసించివీరబాహుం
డు నిజానుచరవ్యూహంబుచేత నగణితం బగుధనంబు దెప్పించి యమ్మునికుమారు
సమ్ముఖంబున. 240

ఆ. కొండపాడవు గాగ గొనకొని ప్రోగు వో, యించి ప్రియ మెలర్ప నిచ్చి వినతుఁ
డగుచు నరుగు దనిన నగుఁగాక యనుచు నా, కొని మునీంద్రసుతుఁడుకుతుక మొదవ.

వ. సంకల్పసిద్ధియగుంగాక యని ప్రియపూర్వకంబుగా నాశీర్వదించి చనియె ననినఁ
గాంతేయాగ్రజుం డటమీఁదివృత్తాంతం బెఱింగింపుమనుటయు. 242

ఆశ్వాసాంతము.

శా. సాధుస్తుత్యచరిత్ర బంధుజనతాస్వర్భూజ గాంభీర్యవా
రాశిధుర్యాధరితామృతాంబునిధినైర్మల్యోర్మి సంఘాత ది
క్పాలస్తవ్యత్రసుధాయుతోజ్జ్వలయశస్సౌభాగ్య యోగ్యక్రియా
బోధానందమయాంతరంగ పురజిత్పాదాబ్జకళాకుంభజా. 243

క. వ్రతియతిజనసంరక్షా, చతురచనీషావిశేష సాగరతనయా
పతితానాపేక్ష్యత్వ, క్షితిగత యమిత్రజైత్ర శౌర్యాటోపా. 244

చ నమయూరవృత్తము. ఉల్లసితకీర్తిమహిమోన్నత దివౌక
స్సల్లలితమహావిభవ ధర్మగుణభాషా
వల్లభ సుధామధురవాక్చతుర యీడూ
రెల్లన నృపాలసవివేంద్ర రుచిచంద్రా. 245

గద్యము. ఇది శ్రీరుద్రాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యస మునిచక్రవర్తిగోత్ర సకలసుకవి
జనానీకమిత్ర దేచనామాత్యపుత్ర వినయవివేకవిద్యాలంకారశంకరకవి నామధేయ
ప్రణీతంబయినహరిశ్చంద్రోపాఖ్యానంబనుమహాప్రబంధంబునందు జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.



## పంచమాశ్వాసము.

---



రూపధృతివిజితత్రి
స్మారతవారిజనాభశంబరవిద్వి
ణ్మారవిశాలవల్లభ యీ
డూరల్లామాత్య బుధపయోజాదిత్యా.

వ. ఆకర్ణింపు మహాపాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె నట్లాశీర్వదించినతత్రికుం డమ్మహీకళత్రునిం జూచి. 2

తే. ఇనకులాధీశ నీవు మా కియ్యకొనిన, విత్త మంతయు నేఁడు ప్రవేశ మయ్యె
శంకరుఁడు విశ్వనాథుండు సాక్షిగాఁగ, నిలుపుకొంటివి సత్యంబు నిత్యముగను. 3

క. అని హస్తాహస్తం బొ, ప్పన చేసె మహీశువీరబాహునకుఁ దనూ
జనితాతిహేయకారణ, ఘనదుర్గంధాత్తమక్షికావ్యూహునకున్. 4

సీ. ఆసమయమునం దాకాశపథమున, వసియించి సర్వగీర్వాణవరులు
కరుణాకటాక్షవీక్షణములఁ జూచుచు, నత్యంతవాత్సల్య మంకురింప
జండాలగృహమున నుండునన్నాళ్ళకు, నాకలి దప్పులు లేకయుండ
శిఘ్రింబ చండాలసేవానివృత్తిగా, వరము లిచ్చిరి మహీవల్లభునకు

గీ. నంత నిజమందిరమ్మున కరుగఁ దలఁచి, వీరబాహుండు కడునహంకారలీల
మదము కన్నులనిండారఁ బొదువుకొనఁగ, క్షత్రకులపుంగవుం డని శంక లేక. 5

క. తనచేత మాంసభారం, బును మదిరాపూర్ణకలశమును జతనమునం
గొని రమ్మని యదలించుచుఁ, గనుఁగొని ధరణీకళత్రుకరమున కిచ్చెన్. 6

వ. ఇచ్చినం బుచ్చుకొని పొరపొచ్చెంబు లేనిమచ్చికం ధరణికులపుంగవుం డంతరంగంబున నొక్కింత హేయతం బొందక లజ్జింపక వానిపజ్జన తదీయపూర్వకింకరులం గూడి చని ముంగట.

సీ. బహువిధపశుకళేబరసమాకీర్ణంబు, దుర్గంధలహరికానర్గళంబు
పలలక్షతజకుతూహలసారమేయంబు, కాకగృధ్రానీకకలకలంబు
పక్షికాచ్ఛాదితమాంసదోరణరాజి, చత్వరాస్తరణార్ద్రచర్మపటలి
ప్రబలవిస్ఫురఘుర్ఘురధ్వానపూర్ణంబున, సవిధక్షమాభాగసంభృతాస్థి
గీ. వారుణీపానకృత్యదుర్వారజనిత, మదభకాలసచండాలమండలేత
రేతరాకర్షకలహసంజాతరవము, గనియె మాతంగవాటము మనుజవిభుఁడు. 8
చ. కనుఁగొని చొచ్చి ధైర్యగుణగౌరవము ల్చెదరంగ నీక నె
మ్మనమున సేవగింపక క్రమంబున నంత్యజునింటి కేగి వా
డనుదినము న్మనోద్ధతి నహంకృతి జెప్పెడు నష్టకష్టపుం
బను లొడఁగూడ జేయుచును బాహ్యవస్త్రము దుండె భృత్యుఁడై. 9
వ. వీరబాహుండును బ్రతిదినంబును గృతాపరాధంబులెన్నుచు నొక్కయుపాయంబుఁ
గాంచి సూనృతజ్ఞానంబు వసల వీని ప్రతిజ్ఞాభంగంబు గావించి గాధిసంభవునకు మన
స్సంతోషం బొనర్తు నని నిశ్చయించి యొక్కనాటినిశాసమయంబున నద్ధారుణీపతి
యూరుపీఠంబున జరణంబులు చేర్చిన నతం డంతఃకరణంబున భక్తి నివ్వటిల్ల
బదంబు లొత్తుచున్న ముదంబునం గనుఁగొని. 10
తే. ఓరి నీమీద విశ్వాస మొదవె నాకు, నే నొనర్పుప్రయోజనం బీవు జేయ
నేఁడు మొదలుగ నాయాజ్ఞవాడ వగుచు, వినుము చెప్పెద నీకు దద్విధము దెలియ.
క. ఈవీటిపరేతక్షితి, నావశమై యుండు గొన్ని నాళ్ళుగ బ్రీతిఁ
నీ వట్టియాధిపత్యము, శేవం బైకొనుము సంఘటితకార్యుఁడవై. 12
గీ. వినుము నీనామధేయంబు వీరదాసు, వసల కే బాల్చ నీవుప్రగుడియ బూను
మనుచు దనచేతి కిచ్చిన నావరచుక, బుచ్చుకొని వేడ్క రంజిల్ల వచ్చి యెడఁగ. 13
వ. అత్యంతభయంకరం బగుపరేతనికేతనంబు విలోకించి కించిన్మాత్రంబును జిత్తంబున
భీతిల్లక ప్రవేశించి యమ్మహావల్లభుం డహోధైర్యంబున నిజకృపాణప్రభాప్రభాసమా
నుండై నానాభూతవ్రాతంబులం గూత లిడం బట్టి కొట్టి యిట్లనియె. 14
సీ. అనుదినంబును మీర లత్యంతసంభ్రమం, బున నేగి వీరబాహునిగృహమునఁ
బగ లెల్ల సుడిగపుంబనులు చేయుచు రాత్రి, గడక నీశవభూమి గాచుచుండు
డస్మదీయం బైనయాజ్ఞ నుల్లంఘించి, నడచితి రేని దండన మొనర్తు
నిన్నాళ్ళవలెను గా దింతటనుండియు, మీకు విచ్చలవిడి మెలఁగ రాదు
గీ. హీనకులుఁ డని యనక మదీశ్వరునకు, నాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి
మించు నట్టుగ నాశీర్వదించి రండు, మోదమున బ్రహ్మరాక్షసముఖ్యులార. 15

వ. అని యిత్తెఱంగున భూతసంచయంబుల నియమించి సమీపవర్తియు సమున్నతమూర్తియు నగునొక్కబేతాళునిం బిలిచి నీ వింక మదీయకింకరుండవై యచ్చోట నొక్కమంచె పెట్టించు మనుటయు నట్ల కాక యని కృతనమస్కారుండై యతం డరిగి యతిత్వరితంబున సముత్తుంగమ్మణిమయవేదికాబంధురంబును ఘనశిలాస్తంభ సంభృతంబునుం గా మంచె గల్పించి విచ్చేయుం డని విన్నవింప నప్పంచజనాగ్రి గణ్యుం డమ్మంచెపై నిలిచి విపత్తిహరణదక్షుం బగునిజభుజాకౌక్షేయకంబు సహాయంబుగా మహాశౌర్యంబునఁ గావలి యుండె నంత నక్కడ. 15

సీ. అతిధైర్యమతి యగునాచంద్రమతియును, సర్వంసహాసుధాశనునియింట
హంసనారి యనెడునభిధానము వహించి, దాసియై తొంటి విలాస మెడలి
చెందినవగ నుదాసీనకృత్యంబుల, నత్యంతదీనత యావహిల్లి
తనలోన బలుమాఱు దైవంబు దూఱుచు, గొడుకును దానును నిడుమ బడలి

గీ. పాడమునాఁకలిడప్పుల కడచిపడక, కలహకంటకి మనసురా మెలఁగుచుండ
నరిగె ద్వాదశమాసంబు లంత నొక్క, నాఁడు విప్రుండు రాజనందనునిఁ జూచి.

సీ. ఓరోరి లోహిత యీరీతి రేయును, బగలును బానిసఁ బాసి రాక
యేపని చేయక యిట్లుండెదవు నిన్ను, గనుగొన్న గోపంబు గదురకున్నె
యని చిన్నకూకటి బెనచిన జడపట్టి, గుంజి యీడిచి చెంప గొట్టి తిట్టి
నేడు మొదలుగాక నీవింక నిత్యంబు, నీయీడువడుగుల నెమ్మిఁ గూడి

గీ. యర్కుఁ డుదయించుతఱి నరణ్యమున కరిగి, కుశసమిత్పర్ణఫలములు గొంచు రమ్ము
కడుబ్రియత్నముతో నని నుడువుటయును, దైన్యమునుబొంది యేడ్చుచు దల్లిఁగదిసి.

చ. కనువగ బాష్పబిందువులు గ్రమ్మ బదంబులమీఁద వ్రాలు మం
దను గినుక న్మహీసురు డదల్చిననిష్ఠురభాష లెల్ల జె
ప్పిన విని యాత్మలోనఁ గడుభీతి వహించుచు నార్తనాదయై
తనయుని జంక బెట్టుకొని తామరసానన చింత నొందుచున్.

చ. అకటకటా విహీనదయ నర్భకు నిన్నును జూచి కాలకౌ
శికులకు రోషభంగి బని చెప్పఁగ నేగతి జిహ్వ యాడె గా
నకు నిపు డీవు పోయిన మనంబున ధైర్యము నిల్వ నేర్తునే
వికచపయోజతుల్యముఖవిభ్రమ భానుసమప్రభానిధీ, 20

క. జనపాలతనయు లెంతయు, వినయంబునఁ జేరి కొల్వ విహరించెడు నీ
కనయము నొకవిప్రాధము, కినుకను లోబడఁగ వలసెఁ గింకరవృత్తిన్. 21

సీ. అనపాయభాగ్యరేఖాన్విత యైనట్టి, రాజముఖీశిరోరత్నమునకుఁ
బుట్టక పాత్రితరంభోజబాంధవతేజ పట్టి, నా కేటికిఁ బుట్టె తయ్య
నిమిషార్ధ మైనను నినుఁ బాసి మదిలోనఁ, దాలిమి నిలుపంగఁ జాల నేను
వనమున కేగతిఁ బనుపుదు గౌశికుమాయ, ని న్నింకేమి చేయఁ గలదొ

గీ. యరయ నిది యెంతపని యైన నయ్యెఁగాని, యొసరిలవచ్చునే మన కొడయఁడైన
బ్రాహ్మణుఁడు కోరి చెప్పినపనుల కెల్ల, బూని వేగంబ యరుగక మానరాదు. 22

వ. అని యత్యంతచింతాభరంబును జెంది యప్పురంధ్రీరత్నం బతిప్రయత్నంబున సకల
దేవతా ప్రార్థనంబుం జేసి వియచ్చరనిశాటపన్నగభూతదుష్టమృగపక్షివారితంబుల
వలనం గుమారునకుఁ బ్రాణభయం బొదవకుండునట్టుగా నాశీర్వదించి యభిమంత్రిం
చి దక్షిణకరంబున నొక్కరక్షాబంధనం బొనర్చి యనుపుటయుఁగాననంబునకు న
మ్మానవతీసూనుం డరుగ నుద్యోగించు సమయంబున. 23

సీ. చలము కోపము మానసంబులో దళముగా, గాధినందనుఁ డహంకారలీలఁ
దనమంత్రిసామర్థ్యమునఁ దక్షకాఖ్యప, న్నగరాజు నాకర్షణంబు చేసి
దక్షుతమై నీవు తక్షక మా కొక్క, హితకార్య మొనరింపు మతిశయముగ
సార్వభౌముఁడు హరిశ్చంద్రుఁ డరుంధతీ పతిపూన్కి యాదేశ్వ మతిఁ దలంచి

గీ. విదితసత్యంబు నిర్వహించెద నటంచుఁ, బ్రతిన తాఁ బూని యున్నాఁడుధృతివలర్ప
నతని సత్యంబు లాడింప ననువుపడక, వెకవు వెదకుచు నున్నాఁడ వినుము నేను.

చ. బహువిధమాయ లెల్లెడలఁ బన్ని యనూనవిపత్పరంపరా
సహితునిఁ జేసి ధైర్యగుణసాహసము ల్తొలగంగ జేసి యా
మిహిరకులేంద్రువాక్యములు మిథ్యలు చేయఁగఁ బూనినాఁడ నో
యహివర నాకు నిప్పుడు సహాయము గావలయుం బ్రియంబునన్. 25

క. భవదీయవిషాగ్నులచే, నవనీధ్రము లైన బగులు నారసి చూడన్
భువిలోపల దక్కినమా, నవులకు నిలువంగ వశమె నాగకులేంద్రా. 66

ఉ. కావున నామనఃప్రియముగా నతివేగమ నీవు పోయి త
ద్భూవరపుత్రుని న్విపినభూమికి బోయినలోహితాస్యునిన్
జీవము పోవునట్లుగ నశేషవిషానలఘాతకృతిస్ఫుటా
రావమహోగ్రతం గఱచి రమ్మని పంచిన దక్షకాహియున్. 27

సీ. పనిపూని యప్పుడ చని యల్లపిత్పవన, సీమాసమీపంబు చెఱువు పొంత
వటమహీరుహమున వల్మీకరంధ్రంబు, శీఘ్రంబ తాఁ బ్రవేశించి యుండ

దవనకూలముగాఁ దనశిష్యవితతుల, బోధించి పలికె నగ్గాధిసుతుడు
వటుశిఖామణులార వారక మీ రేగి, నృపకుమారుని గూడి విపినభూమి
గీ. కలయ జరియించి వాని నేకతమ్మున, బూని పే రేచి తోడ్కొనిపోయి తత్కురా
హివల్లభకుమారు విషాగ్నిశిఖల, పాలుగా ద్రోచి రం డని పనుచుటయును. 28
వ. అత్యంతరయంబునం జని లోహితాస్యునిం గనుంగొని. 29
ఉ. ఓనృపపుత్త్ర మద్గురువియోగమునం జని యేము నిత్యముం
గాననభూముల న్ఫలయుకాయలు పండ్లును దర్భ లిధ్మముల్
మానుగ గోసి తెత్తుము క్రియుంబున నీవును మమ్ము గూడి ర
మ్మా నిఖిలంబు చూపెదము మక్కువతోడుత వాని యిక్కువల్.
వ. వీని యొడంబఱచి యిక్ష్వాకుకుమారునిం దోడ్కొనిచని కాననమార్గంబులుజూంపి
తత్ప్రదేశంబులఁ గొంతసేపు మనోహరవిహారంబులు సలిపి వివిధమధురఫలంబులు
దర్భలు నిధ్మంబులు తృణంబులును గోసి మోపుకట్టి శిరంబునం బెట్టి చనుమనుటయు
చ. పొడ వగుడప్పిచే మిగులఁ బొల్పఱి కుత్తుక యెండుచుండ బె
ల్లుడుకగ ఘర్మబిందుతతు లొక్కట మోమున నంకురింపగా
వడఁకుచుఁ జిన్నిచుంచు చెలువం బెదలంగ బదాంబుజాతము
ల్తడబడ దేహ మంతయు గళింకము నొందుచు ధూళి గ్రుంగగన్. 32
సీ. నడచి నిట్టలసి పన్నగముచ్చు యూమజ్జి, మొదల నొయ్యన తలమోపుఁ జేర్చి
డస్సికి నచటితటాకతో యంబులు, గ్రోలి రాకొమరుండు కొంతదడవు
తదనంతరచ్ఛాయ నిదాఘమిగ్రితాపర్తి, పవళించి సహచరబ్రహ్మచారు
లెజీఁగిరప మేల ని యింకాక ... చతి, సనుచు నాపలు గొయుననువు వెదకి
గీ. యొక్కపాదం... పుష్టిమై నునిచి యెండు, పొడ నవనీరుహంబునై నూడ్రెక్కి
క్రిందికొమ్మకు మెల్లన కేలు చాచి, యందికొని కోయఁ బూనునయ్యవసరమున. 33
మ. ప్రళయారంభకృతాంతభీకరకరాజ్జ్వాలపాశంబుతోఁ
దులఁదూగం గలయాకృతిం బొదివి వాతూలాశస్వామి నా
ల్కలు సెల్లార్చుచుఁ జుట్టలో వెడల యుగ్రస్ఫూర్తిమై గోప మ
గ్గలమై పర్వగ రాసుతుం గఱచె ఘ్రాణాకారంబు తోరంబుగన్. 34
ఉ. భూతలనాథనందనుకు భూరివిషానలకీల లుబ్బ సం
జాతశరీరవేదనకు జాలక ధారుణిమీద వ్రాలె లా
లాతతి నోర నిర్గమ్మ మిసల న్నయనాంతమూర్ఛ నొందె హా
మాత యటంచుఁ దన్ను బడ మర్త్యము రూపజీయె న్రియంబునన్. 35

చ. నిజవిమవహ్నిచేత నవనీధ్రము లైనను నీరు సేయునా
భుజగవిభుండు భూరమణుపుత్రుని జంపఁగ నోపఁ డయ్యెఁ బం
కజనయనాశిరోమణియుఁ గల్మషదూరయు నై ధరిత్రిపై
సుజనతఁ గన్న తజ్జననిశుద్ధపవిత్రచరిత్ర మెట్టిదో. 36

వ. ఇవ్విధంబున మూర్ఛిల్లిన నమ్మహీవల్లభుతనయునిం గనుంగొని యక్కుమారులు మహా
ద్భుతంబును బొంది. 37

ఉ. ఈవసుధేశనందనుఁ డహీంద్రమహావిమవహ్నికీలలన్
జీవములం దొఱంగక విచిత్రగతి న్గరళంబు మిగ్రింగి మూ
ర్ఛావశుఁ డైన హేమగిరిచాపునిరూపున నున్నవాఁడు మై
చేవయు మోముకాంతియును జెన్నతి యుండ నొకించు కేనియున్. 38

తే. గాజు వాఱదు చరణపంకజయుగంబు, హస్తతలముల కెంజాయ లడఁగి పోవు
కాదు వేఱొక్కరూపంబుకన్ను దోయి, యొడలిలో బ్రాణములు దాఁగియుండఁబోలు.

తే. కొడుకువలకేల నెంతయు గుశలనియతి, యమర నీకతు న్గ్రైదు సమయమునను
దెలివి నే మని యాశీర్వదించినదియొ, తల్లి లోకైకవినుతకాంతామతల్లి. 40

వ. అని యతిత్వరితంబునం బురంబునకుం జని మిథ్యాప్రవాదంబున నవ్వార్త మార్తాండ
కులచక్రవర్తి దేవికిం దెలియనెఱింగించుటయు నమ్మెఱుంగుంబోఁడి కాదంబినీగర్జా
నినాదంబు విన్న మరాళియు,నిషాదకోదండటంకారనాదంబు వినినసారంగియు,దాశరథి
శాపాకురరవంబు వినినపికాంగనయు, బిడాలరవంబు వినిన బాలశుకియు,కంఠీరవంబు
కంఠశబ్దంబు వినినకరిణియునుం బోలె నుల్లంబున దల్లడిల్లి హా కుమార యని ఖండిత
కదళీతరుకాండంబుచందంబున మహీతలంబునకు వ్రాలి మూర్ఛిల్లి కొండొకసేపు
చేష్టావిహీనయై యుండి యెట్టకేలకుం దెలిసి జెట్టువడం బొంది బాష్పజలధారా
పూరంబులఁ బాలిండ్లు దొప్పదోఁగ నేడ్చుచు దనలో ని ట్లనియె. 41

తే. అక్కటా లోహితాస్య బాలార్కతేజ, ఘోరశోకంబుచే నన్ను గుండదేసి
తేమిచేయుదు నాకు దిక్కెవ్వ రింక, నెట్లు నిను బాపె విధి కృపయుంజెలేఁ. 42

క. పతిఁ బాసియు నీకతమున, మతిలో దుఃఖంబు లెల్ల మాని చరింతుజ్
ధృతి యాత్మ నిలిపి యిఁక నే, గతి గడతుఙ్ శోకవార్ధి కడముట్టంగన్. 43

క. భీకరఫూత్కారంబున, నాకాకోదరము గవియుటప్పుడు మదిలో
నేకరణి దల్లడిల్లితొ, రాకానిశాకరకిరణరమ్యశరీరా. 44

వ. అని శోకింపుచునమ్మహీకాంతకాంతాలపయింపెనిసి నివాపవచిత యి ట్లనియె 45

తే. తొలుతఁ బుత్త్రుని నెచటికో తొలఁగఁబెట్టి
యడవిలోఁ బాము మూర్కొన్నదంచు మొఱఁగి
కల్లయేడుపు లేడ్చుచుఁ గపటవృత్తి
వెదకుసందున సుతుఁగఁ జూచెదవు నీవు. 46

క. నాముందఱ నెట కరిగెద, వీమాయలు మాకుఁ దెలియ విన్నియు నిను నే
నేమఱుదునె నీకంటెను, నే మిఁచినజాణ జుమ్మ నెలఁతలలోనన్. 47

తే. కొడుకుఁ బలుమాఱు దలఁచుచు నడుగ కిట్లు, మిగులశోకంబు బొందుచు మిన్నకున్న
నీవు గావించుపను లెల్ల నెవ్వ రింకఁ, జేయువారలు రా రమ్మ శీఘ్రముగను. 48

వ. అని యిత్తెఱంగున నం బరుషంబు లగుదురాలాపంబులు పలుకు నక్కాలకౌశికుని
యాలిం గనుంగొని యాలీలావతి యాఱనిదుఃఖంబు లోలో నడంచుచు. 49

సీ. అమ్మ యీవేళ నన్ననుకంపఁ జూడంగ, దగు జిత్తమున నొండుతలఁపు మాని
నాకుమారుఁడు కాననంబులో విష మెక్కి, యేరీతి నున్నాఁడొ యెఱుఁగ రాదు
తెప్పించి యౌషధం బిప్పించి పుత్త్రుదా, నము సేయవలయుఁ బుణ్యంబు మీకు
నని వేడికొనుచు దైన్యంబున నడుగుల,పై వ్రాలి లేవక పలవరింప

గీ. గొంతకనికర మాత్మ సంతసము నొంద, గలహకంటకి యిల తేనికలువకంటి
తల పదంబున నొక్కింత దొలఁగ ద్రోచి, వలికె గర్ణకఠోరసంభాషణములు. 50

ఉ. బాలుఁ డేడ్వ మాన్చుటకు బండులు దెమ్మని పంచిన న్మహో
ఖీలభుజంగసంఘములు పెల్లుగ నుండెడుపుట్ట లెక్కఁగా
నేల భవత్తనూజునకు నే మొనరించినయట్టి దేమి యా
పాళము దప్ప గొప్పవిషయభాగ్యల కూరక యేడ్వ వచ్చునే. 51

తే. ఒడలెఱుంగక తిని మసలుటకి వాఁడు, కావరము పట్టియున్నాఁడుగాక పుట్ట
లెక్కఁ బోవంగ నేటికి నింతలోన, నట్లు కాదగు వానికి నడల నేల. 52

తే. కాననంబుల బుట్టలలోన దిరుగు, పన్నగంబుల కెల్ల వాగ్బంధనమ్ము
చేయ దగు మాకు నిది మేము చేసినట్టి, తప్పు లోగొమ్మ మాయమ్మ దయదలిర్ప.

చ. పలుకఁగఁ బేమి పల్కు లిఁక బల్కక మిన్నక యేఁగుదెంచి వీ
లలవడఁ జేయునట్టి పను లన్నియునుం గొఱ గాక యుండ ని
శ్చలగతితోడ జేసి మఱి సత్తుగ నీసుతువార్త యంతయుం
దెలియుము పోయి నావుడు సతీతిలకం బతిశోకచిత్తయై. 54

సీ. మఱి యేమియును మాఱుమాటలు పల్కంగ, లేక ధీరత నట్లు కాక యనుచు
బాసుల బడి సందెజాము పోయినదాక, వగవుడుపనులు సర్వంబు దీర్చి

యలసియు విసువక యరుదెంచి భక్తిమై, నొయ్యన చరణంబు లొత్తుచుండ
బెట్టుగ బలుమాఱు నిట్టూర్పు లిచ్చుచు, భీకరంబుగ గుఱు పెట్టుకొనుచు
గీ. జెమటచే నవయవములు చెమ్మగిలగ, దఱుచు దుస్స్వప్నముల మతి దడబడంగ
గలవరించుచు నొడలెఱుంగక సెలవుల, జొల్లు గాఱంగ బ్రాహ్మణి సుప్తిబొందె.
వ. అప్పు డప్పల్లవాధర చరణంబులు చప్పుడు గాక యుండ గదలి సదనంబు వెలువడి నిజహృదయాభ్యంతరంబునం బొదలుశోకధ్వాంతంబునకు దోడు బాహ్యతిమిరం బసహ్యంబై పొదివికొన బ్రహ్మచారులు చెప్పినచొప్పునఁ బతిభక్తియే తనకు సహాయంబుగా మహాధైర్యంబునం జని వటుభస్మపుంజంబునకై చరణంబులు వల్మీకంబునకై శిరంబునుం గా వసుంధరఁబడికించిదున్మీలితనయనుండై విచారదూరమాన మానసుండై యూరక మున్ను నిద్రించువిధంబున నున్నగారాబుకుమారు లోహితాస్యుం గనుంగొని. 56

తే. తరుణి యాగ్వంగజాలక తత్క్షణంబ, ధరణిపైఁ బడి మూర్ఛిల్లి ధైర్యమూఁది
కొంతవడి కింత దెలిసి నిజాంతరంగ, భరితశోకాగ్నికీలలు ప్రజ్వరిల్ల. 57

ఉ. హాసుకుమార హావరగుణాకర హాచిరపుణ్యశీల హా
వాసరవల్లభప్రకటనంశమనోహరశక్తి హాశక్తి కా
హాసరసీరుహారిసదృశాంగవిభాసిత లోహితాస్య నిన్
బాసి దరింప నోప నను బాయగ బాడియె నీకు నక్కటా. 58

సీ. మొలకనవ్వుల నుమమస్సులనీమోము, గూర్మి రెట్టింప గన్గొనక యున్న
నమృతంబు చిలుకు నీవిమలవాక్యంబులు, వీనులు చల్లగా వినక యున్న
సంపూర్ణపూర్ణిమాశశిఁ బోలు నీమేను, చెలువార గౌఁగిట జేర్ప కున్న
నిరుపమానము లైననీచిన్ని చెక్కులు, ప్రేమతో గదిసి చుంబింపకున్న
గీ. నిమిషమాత్రంబు ప్రాణము ల్నిలుపఁజాల, నేను జనుదెంతునీవెంటబోయి తేతనూజ
చేరి నాతోడ నొకమాట చెప్పవయ్య, పలుమఱును నిన్నుఁ బిలువంగ బలుక వేల.

క. రాహుగ్రహముఖకబళిత, నీహారమరీచికరణి నీవదనము హా
రాహీంద్రవిషానలకీ, లాహుతిచేఁ జెలువు దఱిగె ననుఁగుఁగుమారా. 60

ఉ. బాలిక లూఁచుచుం గదిసి పాడఁగ మేడలలోన రత్నశో
భాలలితంపుటుయ్యెలలపై సుఖముండెడునీవు నేఁడు బా
నేల నరణ్యమధ్యమున నిర్భరలీలల నిద్ర బోయె దా
భీలసృగాలరావములు పెల్లుగ నెల్లెడ నుప్పతిల్లగన్. 61

వ. అని తనూభవునిం బాయం జాలక మోహపరవశత్వంబున నక్కునం జేర్చి పేర్చు శోకోద్రేకంబునం గఱచినకాకోదరంబు దలంచి. 62

ఆ. వక్రగతిన యెప్పుడు వర్తించు రంధ్రముల్, వెదకుచుండు మిగుల విషముగురియు
నోర పడగఁ బెట్టు నోయన్న యేమందుఁ, జిఱ్ఱు బుస్సు మనెడిచెడుగుఁబురుగు.

క. ఏమందు నిన్ను లోహిత, యేమందుల మాను నందు నిఁక నెవ్వరితో
నేమందు నిన్ను గఱచిన, పాముందే కూడియుండె బాపపువిధియున్. 64

వ. అని యక్కుంభీనసంబు నుపలంభించి యాసంభోరువుహృదయాంభోరుహంబున దన కుం బాన యూఱడించుకొని ధైర్యవివేకంబుల నలవరించి యింక వీనికిం బుణ్యలోకప్రాప్తి యగునట్లుగా నుచితసంస్కారంబులొనర్చి కలహకంటకి మేల్కొనక మున్న రయంబునంజని సముచితకృత్యంబు లొనర్పం దగు నిచ్చోట నాలస్యంబు గర్తవ్యంబు గాదని పట్టిం దనమూపునం బెట్టుకొని కొంతదవ్వు చని పరేత నికేతనంబుం బ్రవేశించి యందుభూతప్రేతపిశాచశాకినీఢాకినీబేతాళకలకలస్వనంబుల నతిభయంకరంబైనయారుద్రభూమిం దనపాతివ్రత్యధైర్యంబులు సహాయంబులుగా బుత్రుని డించి దందహ్యమానంబులైనశుష్కకాష్ఠంబులు కొన్ని గూర్చి పుత్రు నందు నిడి యింగలంబు తగుల్పం బూని పూనలేక శోకావేశంబున నిట్లనియె. 65

సీ. మాతామహాంకమున మాతామహియుఁ జేయు, గారాము నైకొనఁ గాన వైతి
నానందమున నెత్తి యర్మిలి ముద్దాడు, మేనమామల మేలు గాఁ గానవైతి
గరిమ నక్కునఁ జేర్చి శిరము మూర్కొనుతండ్రి, కౌఁగిట మెలఁగంగఁ గాన వైతి
పుత్త్రాగమున మించి వాత్సల్యమున దాచి, నే సేయుమోహంబు గాన వైతి
గీ. పరిణయంబుల సఖులును బ్రియవధూ మెసఁగఁ, బూని యొసరించు ప్రియములు గాన వైతి
చుట్టములకెల్ల వెలిపడి కట్టుపడిన, నాదు జనియించి యిట్లైతివే కుమార. 66

తే. ధన్యసంబంధములోపల నెన్నఁదగిన, భాగ్యసౌభాగ్యవతులైనపడఁతు లుండ
సకలదుర్లక్షణములకు సదన మైన, నాకు నేటికిఁ బుట్టితయో కుమార. 67

వ. అని యిట్లెలుంగున. 68

ఉ. పంచమనాదయుక్తిఁ బికభామిని కూయుతెఱంగు దోఁప నా
చంచలనేత్ర హస్తజలజంబులు మోమునఁ జేర్చి యేడ్చె నే
త్రాంచలబాష్పబిందునివహంబుల దోఁగునురోజకుంభము
ల్మించునఁ దోఁగుపద్మముకుళంబులతోడుతఁ జెల్మి సేయఁగన్. 69

వ. అయ్యార్తారవంబు విని హరిశ్చంద్రుండు మహాశ్చర్యంబును బొంది యీయర్ధరాత్రిం దిక్పట నేకతంబ శోకించువనితానిస్వనంబు వినంబడియె నిస్సందేహంబుగాఁ

గనుంగొన వలయు నని ముద్రికుదియ భుజంబునం బూని ఖరఖడ్గంబు కటిబద్ధాంబ
రంబున గీలించి కులకుధరశిఖరంబుననుండి మహీమండలంబునకు లంఘించుపంచాన
నంబునుంబోలె నారాజపంచాననం బామంచెపైనుండి వసుంధర కవతరించి మెల్లన
చనుదెంచి. 70

సీ. నిబిడశోకారుణనేత్రకోణంబులఁ, బలుమాఱు దొరఁగెడు బాష్పములను
జెక్కుపైఁ జేర్చినచిగురుఁగెంగేలును, వట్టిపోయినయట్టి వాతెఱయును
వేడిమై బలుమాఱు వెడలు నిట్టూర్పులు, గొదకొనివెక్కుడుఁకుత్తుకయును
గడు జిక్కుచీఱుగా విడినకొ్రొమ్ముడియును, నవనీగజోలిప్తమైనమేనుఁ
గీ. దొలఁగి పోయినచనుకప్పుమలినపటము, మిగుల వాడినమోముదమ్మియును గలిగి
దీనదశ నున్నచంద్రమతీపురంధ్రి, కట్టెదుర నిల్చె నత్యంతకరుణ పొడల. 71

చ. నిలిచిన భీతియు న్వడకు నివ్వెఱపాటును భూరిలజ్జయుం
గళవళము న్జనింప నధికం బగుశోకముఁ బొందియుండుచుం
దొలఁగినపయ్యెద న్వలుదతోరపుఁజన్నులఁ గప్పుచున్నయా
నళినదళాక్షిఁ జూచి నరనాయకవంశలలాముఁ డిట్లనున్. 72

సీ. ఈనట్టనడురేయి నీరుద్రభూమిలో, నీపెనుచీకటి నేవిధమున
నొక్కింత శంకింప కున్నసాహసురాల. వేటికి వెఱపు నీకిత్తెఱఁగున
నేకారణమున నీకిట్టిదుర్దశ వచ్చె, నెఱిఁగింప వలయు మా కివ్విధంబు
నీభర్త యెవ్వఁడు నీనామ మెయ్యది, యెచ్చోట వసియింతు వెప్పుడు నీవు
గీ. బాలుఁడేటికి మృతిఁబొందె వాలుగంటి, యనిన వదనాంబుజము వంచి యశ్రుధార
లొలుక గద్గదకంఠయై పలికె ధరణి, కాంతుమానసమున కనుకంప వొడమ. 73

ఉ. ఓనరలోకవంద్య విను ముజ్జ్వలభూరికృపావిధేయ నే
నీనగరంబులో నొక మహీసురపుంగవుమందిరంబునన్
దాసినై వసింతు ననుభర్త ఋణంబునకై ధనార్థియై
మానితసత్యవాఙ్నియతి మానక పోకడ వెట్టెఁ దాలిమిన్. 74

తే. నాదునామంబు విను మంసనారి మత్కు, మారుఁ డీతండు భూమిబృందారకుండు
కోరి పుత్తేరఁగా సమిత్కుశఫలార్థ, మడవి కేతెంచి ఫణిదష్టుఁ డగుచు నీల్గె. 85

క. మీ రెవ్వ రనగ సత్కృప, నారనినాదుఃఖ మెల్లరడపఁగ మదిలోఁ
గోరి ప్రియంబు జనింపఁగ, జేరం జనుదెంచినట్టి సిద్ధాగ్రణివో. 76

తే. కాక బహుభూతనివహము ల్కొడిసి కొలువ, భీతిఁ బుట్టించు నేతత్ప్రేతభూమిఁ
బ్రీతి విహరించుచుండెడిభూతపతివొ, యానతియ్యఁగ వలయు దయానిధాన. 77

చ. త్వరితమ మత్కుమారున కవార్యకృప న్విషవైద్య మిచ్చి యో
చిరతరపుణ్య కర్మమ్మఱ సజీవునిఁ జేసి మదీయమానసాం
బురుహము సమ్మదస్ఫురణఁ బొందఁగ జేయు మహానుభావ త
త్పరమతిఁ బుత్రదానసుకృతంబు సమస్తము నీకుఁ గల్గెడిన్. 76

వ. అనుటయు నమ్మందగమన ప్రియవచోవిశేషంబువలనఁ దనకులాంగన యగుట నిక్కంబుగా మనంబునం దెలియక సందేహంబున నారాజపురందరుండు వెడియుం జంద్రమతిం జూచి. 77

తే. పంకజానన నేభూతపతినిగాను, దురితహరుఁ డైనయట్టిసిద్ధుండఁగాను
దగినవిషవైద్యమంత్రతంత్రములు నెఱుఁగ, బాలుప్రాణంబు మగిడింపఁ జాల నేను.

సీ. వనజాక్షి యిప్పరేతనికేతనక్షోణి తనగుత్తగాఁ జేసికొని వసించు
చండాలకులపాలకుఁడు నాయేలిక, వీరబాహుం డను పేరువాఁడు
సదయుఁడై యీముద్రికదియ నాచేతికి, నిచ్చి యాతఁడు నన్ను నిచట నుండఁ
బనిచిన నుండుదు భక్తి మీఱఁగ దగా, జ్ఞాయత్తచిత్తుండ నగుచు నెపుడ

గీ. వినుము నానామధేయంబు వీరదాసు, నేనెఱుంగక యుండంగ నీవు నీవ
నట్టనడురేయి వచ్చి యీపట్టి దెచ్చి, యిచట నునుపంగఁ బాడియే యిగురుఁబోఁడి.

సీ. ఆఁడుదానవు గాన ననుకంప జనియింప, బరుషోక్తులను నేమి పలుకనోడి
యూరకయుంటి దక్కొరుని నెవ్వరి నైన, శిరము ఖండింతు గాక్షేయకమున
సొద పేర్వ దగునంతచోటికి నొకమాడ, తెచ్చి నా కిత్తువు నచ్చెకంటి
యీచొప్పు దప్పక యియ్యంగ వలయును, దొరకక యుండిన దొలగిపొమ్ము

గీ. మాట లింకేల యిచ్చోట మసలి తేని, యాత్మజాగ్రిణి నత్స్వామి యైనవీర
బాహుపదములయాన యోభామ యనిన, మిగులశోకంబు నిగుడ నమ్మగువ పలికె.

చ. పరహితమార్గవర్తన శుభంకర నన్నొకకొంత నీదయా
సరణి గనుంగొన న్వలయు సంపద గల్గినదానిబోలె ని
ష్ఠురగతి మాడ వేడెదవు చూడక నే నిరుపేదరాల నె
వ్వరు మఱి దిక్కు లేరు తగవా నను శోకపయోధి ముంపగన్. 83

క. శ్రీలున్ దైవాఱ జలధి, వేలావలయితధరిత్రి విమలయశుండై
యేలు నృపనాతి యనుగెదు, నేలవు బాత్రుండు గాడె నీకిటు తగు నే. 84

వ. అని మఱియును. 85

మ. అకటా చేరెడు నేలకుం దగడె సప్తాంభోధివేష్టితభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల

ప్రకటానర్గళనిర్గళత్కిరణఝంఝత్పాదుఁ డైనట్టిరా
జకుమారుం డని యేడ్చెఁ గన్నుఁగవ నశ్రుల్ కాల్వలై పాఱఁగన్. 86

చ. కుదురుమెఱుంగునిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
చెదరఁగ నేల యేడ్చెదవు చెల్వ దురంతవిషాదవేదనా
విదళితమానసంబునకు వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివిపాకము దాఁట దరంబె యేరికిన్, 87

వ. అనిన జంద్రమతి యిట్లనియె. 88

ఆ. సుజనవినుత గోరుచుట్టుపై రోఁకటి, పోటు దాకినట్లు పో తలంప
మొదల శోకజలధి మునుఁగంగ నందుపై, నీవు పల్కినట్టివిస్తరోక్తి. 89

మత్తకోకిల. ఓమహాత్మక మిమ్ము మాఱఁగ యుక్తమే వివరింప మీ
కేమి చేయుదు రయ్య మాటికి హెచ్చి కౌశికమౌనిమా
యామయం బయి వెంటవెంట నహర్నిశంబులు బాయక
ద్దామశక్తిని నాదుకర్మము దాయకై వడి నుండఁగాన్. 90

వ. అనుటయు నవ్వాక్యంబు లాకర్ణించి హరిశ్చంద్రనృపపుంగవుం డంతరంగంబునం
గలంగి యిక్కురంగనయన మదీయభార్య యగుఁ గాని యంతలోనం దీనమనంబు మగుడం
దిగిచికొని నిశ్చయంబుగా నెఱుంగ కిత్తెఱంగునం దలం పేల పుట్టెనో కో యనిపశ్చా
త్తాపంబును బొంది యమ్మందగమనం గనుంగొని మఱియును. 91

చ. హారపదప్రూజకుం దొలఁగి యంత్యజుఁ గొల్చి కులాభిమానముల్
సరగున వెచ్చపెట్టి హరిచందనకీర్తులు వీటబుచ్చి దు
ష్కర మగువల్లకాటి కధికారము వచ్చినదుష్టబుద్ధికిం
గరుణ దలంప నెక్కడిది గంధగజేంద్రసమానగామినీ. 92

చ. అలికులవేణి వీఁడు చతురబ్ధిపరీతమహీతలేశుఁడై
యలరున్నృపాలశేఖరుని యాత్మజుఁ డంటివి మున్ను నీవు త
త్కులసతి వింతదైన్యమునకుం బనిలే దొకమాడమాత్రముం
గలుగదె నీకు నిట్లు పలుకం దగునే విపరీతవాక్యముల్. 93

క. మాడకు మిక్కిలి యడుగము, చేడియ మత్స్వామి మున్ను చేసిన మేరల్
జూడఁగ నడపఁగ దగు మొఁగ, వాడంగారాదు మాకు మొగి నెవ్వరికిన్. 94

తే. నీకు మఱియొం డుపాయంబు లేకయున్న, నెలఁత మాకిచ్చుమాడకు నెలవు గాఁగ
నెమ్మి గైకొనియెద నిమ్మునీదుకంఠ, సూత్రమున నున్నమిన్కైన శోక ముడిగి.

చ. సరసిజనేత్రి జీవితము సత్యము గాదు శరీరధారికిన్
మరణము నిశ్చయంబు పలుమాఱుఁ గుమారునిఁ జూచి యేడ్చిన
న్మరలునె వీనిప్రాణములు మంగళసూత్రి సువర్ణ మిచ్చి నీ
వరసుతునిం దహించు మగువా యనినన్ మూర్ఛిలి శోకమగ్నయై. 96

వ. తెప్పిరిలి యప్పలుకుల కులికిపడి యమ్మత్తకాశిని చిత్తంబున మత్పాతివ్రత్యవిశేషం బుగం జేసి మదీయగళంబున నున్న మంగళసూత్రంబు మిన్నక పరపురుషుల కెన్నడును లోచనగోచరంబు గాదు గావున నిమ్మహానుభావుండు హంసకులావతంసం బగుహరిశ్చంద్రనరేంద్రుండు సందేహంబును బొందవల దని యారాజపురందరుం డున్న దురవస్థయుం దనయంతరంగంబునం గలంగి యక్కురంగనయన తన్నుఁ దా నెఱుంగక మహీతలంబునకు వ్రాలి యెక్కించుక ధైర్యంబున నెట్టకేలకుం దెలివి నొంది. 97

తే. ఓహరిశ్చంద్ర నీపుత్రు లోహితాస్యుఁ, జేరి చూడుము మున్ను నీయూరుపీఠి
నిద్రఁ జెందిన కైవడి నేఁడు దీర్ఘ, నిద్ర వోవుచు నున్న నిర్ణిద్రతేజ. 98

వ. అని పలికి ప్రాణేశ్వరుచరణకమలంబులకు నమస్కరించి కరంబుశోకంబున నిట్లనియె.

సీ. పృథుశిలాస్తంభసంభృత మైనయీమంచె, నవరత్నసింహాసనంబె నీకు
నరశిరఃకలితబంధురకపాలంబులు, మంగళాచారకుంభములె నీకు
కూలోగ్రమానస్థూవరకేశంబులు, రమణీయమగు చామరములె నీకు
భూతభేతాళజంబుకనినాదంబులు, కవిగాయకప్రసంగములె నీకు

గీ. సుచరిత్ర మహిశ్మశానోపకంఠ, శాకినీలోకభయదశ్మశానభూమి
సకలరాజ్యరమానివాసంబె నీకు, సత్యగుణసంపదభిరామ సార్వభౌమ. 100

సీ. గుమిగూడ యున్న యీకాకిదయ్యంబులు, పౌజులవారలె పార్థివేంద్ర
దారుణఘేరవధ్వని కంచుకవ్రాత, సాంద్రహుంకారమే సార్వభౌమ
ప్రీతి జేరి భుజించు భేతాళనివహంబు, మంత్రిసందోహమే మనుజనాథ
సందడి చేయుపిశాచులు నుడిగంపు, టతివలె భానుకులావతంస

గీ. రుద్రభూమి యయోధ్యయే భద్రమూర్తి, మంచె సింహాసనమె జగన్మాన్యవీర్య
తోడరి దైవంబు నేమని దూఱుదాన, గటకటా యోహరిశ్చంద్ర కాంతిచంద్ర.

శా. ఆభాగ్యోన్నతి యాసమగ్రవిభవం బారాజసం బాతనూ
శోభాడంబర మాభుజాకరకచ స్తోమంబు లాప్రాభవం
బో భూమీశ్వర యెందుబోయె నిది దా నోహో మహైశ్వర్య మిం
కేభంగిం దరియింతు వెల్లిగొని పెల్లే తెంచుశోకాంబుధిన్. 102

క. వైణికకరనఖముఖరిత, వీణానాదములు వేడ్క వినియెడు నీ వో
ప్రాణేశ యెట్లు వినె ద, క్షీణశివారవము చెవులు చిందఱ వోవన్. 103

వ. అని బహుప్రకారంబుల శోకించు నాతలిరాకుబోడిం గనుంగొని యమ్మహీకాంతుండు మూర్ఛాగతుండై కొండొకసేపునకుం దెలిసి ధైర్యంబు తూల బుత్రశోకంబునం గుంది కుమారునియశేషవయోరూపగుణవిశేషంబు లాలోకించుచున్న జీవితేశ్వరునిం జూచి వివేకంబు మీఱ నూఱడించి చంద్రమతి యిట్లనియె. 104

చ. ఇనకులసార్వభౌమ మన మిద్దఱము న్ధృతిమాలి యీగతిన్
ఘనతరశోకవహ్నిం బడి క్రాగుచు నుండుట బుద్ధిగాదు నె
మ్మనమున దాల్మి నిల్పుడిక మానుడు దుఃఖము వేకువయ్యె బ్రొ
ద్దును బసలేదు కుక్కుటతతు ల్వెస గూయఁ జొచ్చె నెల్లెడన్. 105

తే. ఇచట దడయంగ రాదు నాకినుడు పూర్వ, గిరికి నేతేకమున్న సత్వరమ యరిగి
సమయసముచితకృత్యము ల్సలుపకున్న, నలుగు నామీఁద మిగుల బ్రాహ్మణునిగృహిణి.

తే. తనయుపై బర్వుమోహలతావితాన, మాత్మసుజ్ఞానమయనిశితాసి గోసి
యానతిం డింక నేమిసేయంగ నుచిత, మూహించి తగవరి యగుచు నృపుడు.

సీ. ఆకాంతతోడ నిట్లనియె నోరాకేందు, ముఖి స్వామికార్యంబు ముఖ్య మరయ
నేలిక మనమున కెడసి సత్యముదప్పి, యిప్పని కొడబడ నెట్లు వచ్చు
నికనొండు మాని నిన్నేలినయట్టిధా, త్రీదేవు నడిగి యేరీతి నైన
మాడయొక్కటి దెమ్ము మసలక వేగంబ, తగవు నౌచిత్యంబు దలపు మనిన

గీ. ప్రాణవల్లభుసత్యప్రభావమునకు, మిగుల నచ్చెరువంది యమ్మీనసయన
యాత్మజుని భర్తకడ నిడి యప్పగించి, యధికభక్తిప్రణామంబు లాచరించి. 108

తే. మఱచి పురవీథి నేగుడుతఱి నెఱింగి, కపటకృత్యధురీణుండు గాధిసుతుఁడు
నృపవధూటిని వధియింప నుపమ యొకటి, యాత్మలోపల యోచించె నద్భుతముగ.

ఆ. తత్క్షణంబ యొక్కతస్కరు గల్పించి, యార్యవినుతశీల యైనయట్టి
జనవరేణ్యుదేవి సమయింపదగునుపా, యంబు గఱపి యరుగు మనిన వాఁడు. 110

క. మొల నీలికాసెయును బద, ముల నోరచ్చులు ధరించి ముదము దలిర్పన్
సెలగోలయు ములుబంతియు, జలపముఁ గత్తియును బూని పటుసాహసియై. 281

సీ. ఆవారణాసీపురాధీశునగరిలో, భీకరంబుగ గన్నంబు పెట్టి చొచ్చి
భర్మహర్మ్యాంతరనిర్మితమణిమయ, డోలాగ్రమున సుఖలీల దాది

ప్రక్కనిద్రితుఁ డైనరాకొమరుని జేరి, బిగియార గుత్తుక పిసికి గడపి
తత్కంఠకంఠహస్తన్యస్తమణిమయా, భరణము లైకొని భయములేక
గీ. వెడలి చని చంద్రమతి కడువేగ వచ్చి, పథమునకు నడ్డమైనిల్చి ప్రాభవంబు
గర్వమును మీఱ బల్కె దస్కరుఁడు కపట, మృదులగంభీరవాచాసమేతుఁ డగుచు.
క. ఎట కేగెద వీవెనుచుఁ, గటినొంటిమెయి న్నతాంగి కల తెఱఁ గెల్లం
దటుకున జెప్పుము నావుడు, గుటిలాలక వాని జూచి గురుతరభీతిన్. 113
తే. వంత బొందుచు దనదు వృత్తాంతమెల్ల, నెఱుఁగ జెప్పుటయును మృషాకృపదలిర్ప
నాసహోదరివీవు కాంతాలలామ, యేడ్వగా నేమిటికి నీకు నివ్విధమున. 114
సీ. అని పల్కి తనచేతిమను జంద్రసుతుసొమ్ము, లన్నియు ముడి గట్టియంది యిచ్చె
నాసమయమున భయంకరాకారులు, యమకింకరులమించు నట్టివార
లవ్వీటితలవరు లత్యుగ్రకరవాల, హస్తులై పదపదం డనుచు నిగిడి
చేదివియలు పూని చెచ్చెర నేతేర, వారికంటెను మున్న చోరకుండు
గీ. దొంగ బట్టి రండని సంగతిగను, దలవరులలోన గలసి యత్తలిరు బోఁడి
బట్టికొని భూరితరముష్టిఘట్టనముల, పాలు వఱుచుచు నత్యంత భయదభంగి. 115
క. కొని చని వేగమ భీషణుఁ, డనుతలవరి మ్రోల బెట్టి యద్భుత మదరం
గనుకొను డని తోడవులు ద, ర్శనముగ నిడి దొంగ చనియె సాహసలీలన్. 116
ఉ. అంతట భీషణుండు హృదయంబున రోషకృశానులీల ల
త్యంతసమగ్రమై పెరుఁగ నక్షుల గెంపు జనింప మేదినీ
కాంతునిరాణివాసము సకల్మషపావనశీల జూచి యో
యింతి నృపాత్మజు న్శిశువు నెట్లు వధించితి సాహసంబునన్. 117
తే. కాంత యిటువంటిబిడ్డల గన్న కడుపు, కాదె నీకు నొకింతయు గరుణలేక
యిట్టిపాతకమున కొడిగట్టితేల, చిత్ర మయ్యెను మాకు నీచేత దలంప. 118
వ. అని పలుకుచు నమ్మహీకాంతునిసమ్ముఖంబునం బెట్టిన నతండు. 119
చ. కలుషవిహీన చంద్రమతి గన్గొని యిట్లని పల్కె నక్కటా
నెలత మహాదురాత్మకుఁడు నిర్దయుఁ డెవ్వఁడు నిన్ను బంపె ని
ట్లులుకను బాలు జంపు మనె యార్భటంబువాంఛ నీమదిం
గలిగిన నిత్తు నందుకయి గాదిలిపుత్రు వధింప నేటికిన్. 120
ఉ. పున్నమచందమామ సరిపోలెడుచక్కనిపట్టి బట్టి సం
పన్నమహోగ్రసాహసము పర్వగ జంపగ నేతులాడె నే

రెన్నఁడు నిట్టిపాతకము లెచ్చట నేము ధరిత్రి మున్ను గ
న్గొన్నది లేదు నీకతన గొత్తలు పుట్టె మహోగ్రకర్మముల్. 121

క. పురుషులకంటెను సాహస, మిరుమడుగుణంబు లరయ నెక్కుడు బింబా
ధరలకు ననియెడువాక్యము, తరుణీ వివరింప నేఁడు తథ్యంబయ్యెన్. 122

చ. అని ధరణీశ్వరుండు హృదయంబున శోకము పొంగ భీషణుం
గనుఁగొని దీని జూచిన నఘుం బొదవుం గడువేగ బాలఘా
తిని దల ద్రెవ్వ నేయు మని తెంపున జెప్పుము వీరబాహుతో
గనికర మింతయు న్నిలుపగా వల దియ్యెడ వేయు నేటికిన్. 123

తే. ఇంక బ్రత్యుత్తరంబు నీ కెద్దియైన, బూని చెప్పితి వేని నాయాన నీకు
నిదియ మున్మాటికిని నెల వేగు మనిన, నట్లకా కని భీషణుం డనుతించె. 124

తే. అపుడు చంద్రమతీదేవి యాత్మలోన, లేశమాత్రంబు చలనంబు లేక దైవ
మెల్లవగపులు పాయంగ నిచ్చె వరము, తగదు చింతింప నింక డెందమున ననుచు. 125

చ. తెలివి ఘటిల్ల నెంతయును ధీరతతో దల వంచి యేమియుం
బలుకక మై వడంకగను బల్మఱు మిన్నక నేల వ్రాయుచున్
నిలచి కృతాపరాధకరణి న్ధరణీపతిమ్రోల నుండె హృ
జ్జలజమునం ద్రిలోకనుతు సత్యధనుం బ్రియునిం దలంచుచున్. 126

వ. అంతట ప్రభాతసమయం బగుటయు. 127

శా. సత్యశ్రీనిధి నేఁడు కల్మషము హరిశ్చంద్రభూమీనాయకుం
డత్యంతస్థిరరాజ్యపీఠము మదం బంఠంగ నీరీతి నా
చిత్యం బొప్పగ నెక్కన న్నుతి నక్షీణప్రభానూత్న కీర్తి నా
దిత్యుం డయ్యుదయాద్రి నెక్కె ధరణీదేవోత్తము ల్మ్రొక్కగన్. 128

వ. అంతట నాభీషణుం డత్యంతరోషంబున గాంతాశిరోమణి యగుచంద్రమతిం
దోడ్కొని పోవం గదిసి రాజవీథిం బౌరకాంతాజనంబులు గనుంగొని. 129

తే. కటకటా చిన్ని నెత్తురుగందు రాచ, పట్టి చక్కనిపాపని బట్టి చంప
నేటిమృత్యుస్వరూపయై యెచటినుండి, వచ్చెనీపడుచులతిండి యిచ్చటికిని. 130

క. పొదిగిళ్లలోన బిడ్డల, ముదమున నిడి యాద మఱచి ముందటిరీతిం
గొదకొని నిద్రింపఁగ రా, దిది మిగులఁ బ్రమాద మయ్యె నిఁక నివ్వేళన్. 131

క. ధరమీఁద నాఁడుదొంగలు, పరికింపఁగ లేరు తొల్లి పన్నిదమునకుం
గర మాశ్చర్యముగా నీ, పురిలోనం గలిగె రిట్టిబూమెలు గలవే. 132

చ. కలుషము బాలఘాతకము గాదని యాత్మ నొకించుకేనియుం
దలఁకక యిట్టిసాహసము దారుణశీల నొనర్చె నింక నీ
యిల నిటువంటివారలకు నెల్ల భయంబుగ దీని నిర్దయన్
వలయు వధింప దోషము లవంబును జెందదు భూమిభర్తకున్. 133

వ. అని పలికి వెండియుఁ గొందఱు దమలో ని ట్లనిరి. 134

క. ఎంతయపరాధ మొదవిన, నింతిం జంపంగఁబాడియే పరికింపం
గొంతదయ చూపఁదగు భూ, కాంతునకు వివేకబుద్ధి కలిమి దలిర్పన్. 135

క. సొమ్మొకచోనుండఁగ నప, నమ్మిక యొకచోట నుండు నరులకు నెప్పుడు
న్నిమ్మదిఁ బరికించి వివే, కమ్మునఁ దెలియంగ వలయుఁ గల్లయు నిజమున్. 136

మ. జలజాతాక్షికి శక్యమే మనమునం జర్చింప నిర్భీతిఁ గో
టలు లంఘించి కవాటము ల్దెఱచి చండస్ఫూర్తిమై నుండుకు
క్కల వాకట్టి నృపావరోధగృహభాగంబు ల్ప్రవేశించి ని
శ్చలత న్సాహసలీల రాకొమరు నాశ్చర్యంబుగాఁ జంపఁగన్. 137

సీ. కపటమార్గమునఁ దస్కరుఁ డెవ్వఁడో దోష, కారి యొక్కఁడు తెంపు గానిపింప
శిశువుఁ జంపి తదీయచిత్రభూషణరాజిఁ, గొనిపోవఁ దలవరు ల్గూడఁ దఱుమఁ
బొదవిన భయమున ముదితపై మచ్చంబు, గాఁగ నాతొడవులు గట్టివైచి
చొప్పుదప్పక వాఁడు మరిగిన నపరాధ, మెల్లను దాన వహించి యాత్మ

గీ. సిగ్గుపడి రాజసభల భాషింప నోడి, లేనిదొంగతనంబు దాఁ బూని యాత్మ
లోన నొక్కింతయును శంక మాన నీక; పోవుచున్నది కాఁబోలు బువ్వుఁబోడి.

వ. అని యనేకు లనేకప్రకారంబులం బలుక నక్కిరవాణి వీరబాహుపాలికిం గొని
పోయి మహీనాయకుం డానతిచ్చినవిధంబు తెలియం జెప్పి యప్పుడఁతి నొప్పనంబు
చేసి భీమణుఁడు తలవరులుం దానును నిజగృహంబున కరిగె నిట వీరబాహుండును
నిజాధీశ్వరు నాజ్ఞోల్లంఘనంబు చేయం దలంకి రయంబున నత్యంతక్రూరవృత్తులును
భయంకరకరవాలహస్తులు నగునిజకింకరులం గనుంగొని మీర లిందఱుం గూడి
మందగమన నమందగమనంబున బరేతనికేతనంబునకుం గొని చని యచ్చటం గలన
న్న వీరదాసునిచేతి కిమ్మచ్చెకంటి నిచ్చి చంపింపుండనుటయు వారునుంబనిపూని
చంద్రమతిం దోడ్కొని పోయి వీరదాసునిముందఱం బెట్టి. 139

క. క్షితిపతినానతియును దమ, పతి యగు నవ్వీరబాహుపంపును గడు న
ద్భుతముగఁ జెప్పిన నది విని, ధృతి దూలి కలంగి యులికి దీనాననయై. 140

క. మిగుల వెఱఁ గంది హాహా, జగమున నెవ్వార లింక శక్తులు విధిచే
త గడవ ధైర్యము నిలుపఁగ, దగు నల్లములోన వగవఁ దగ దించుకయున్. 141

చ. అరసి రణాంగణంబునఁ దృణాంకురసంగతవక్త్రుల న్భయా
కరమతుల న్నిరాయుధుల గర్వము సర్వము నుజ్జగించుచున్
శరణము వేఁడువైరులను సారకృపామతి బ్రోచు నేను ని
ష్కరుణఁ గృపాణధారఁ గులకాంత వధింపగ నెట్లు పూనుదున్. 142

క. ఈహరిణనయనఁ గడపిన, స్త్రీహత్యయుఁ గడప వన్నఁ జెచ్చెర స్వామి
ద్రోహంబును బాటిల్లెడు, నూహించిన నాకు నెగ్గి యుచితము చేయన్. 143

వ. అని బాష్పపూరితనేత్రుండై మొగంబు వంచి యున్న యన్నరేంద్రునకుం జంద్రమతి యి ట్లనియె. 144

క. ఓవసుధాధిపశేఖర, యీ వెఱఁగనిధర్మమార్గ మెందును గలదే
భావింపధైర్య మెడలకఁ, గావింపఁగవలయు స్వామికార్యం బెపుడున్. 145

క. ఊహించి చూడ స్వామి, ద్రోహ మమితభార మనుచుఁ దొల్లి గరుత్మ
ద్వాహనునితోడ నిస్సం,దేహంబునఁ బలికె ధరణిదేవి ప్రియేశా. 146

చ. అదియును గాక నాకొమరు నర్భకుఁ జంపె మహాదురాత్మ రా
లిది యనునిందఁ బొందితి నరేశ్వర కావున నింక న న్వధిం
పఁదగుఁ దలంచి చూడ నణుమాత్రము నొందు దలంపు మానుఁడీ
హృదయములోపలం గరుణ యేటికి నిల్పెద రిట్టిపట్టునన్. 147

తే. మానవులు దేవతలును విస్మయము లొందవ, నిచట నచటను బొగడ మహీతలేశ
శంకఁ బొందక మిగుల నిశ్చలత నిలిచి, తెంపు మీఱఁగ దెంపు మదీయశిరము. 14

వ. అని యమందధైర్యంబునం జంద్రమతి ప్రాణేశ్వరుపదంబుల కెఱఁగి మందంబున గృతప్రదక్షిణయై కరకమలంబులు మొగిడ్చి దరహాసవికాసంబులు వదనంబునం బ్రకాశింప నిరంతరరక్తపంకసంసిక్తంబై చూపట్టు వధ్యశిలోపరిభాగంబునం బద్మాసనంబునం గూర్చుండి మార్తాండమండలంబుపైఁ జూడ్కి నిలిపి. 149

తే. నిఖిలలోకైకవంద్య యోనీరజాప్త, నాకుఁ గృపతోడ జన్మజన్మములయందు
సత్యసంశీలుఁ డగుహరిశ్చంద్రనృపతిఁ, బ్రాణనాయకుగా నొనర్పంగవలయు. 150

వ. అని యత్యంతతాత్పర్యంబున నాదిత్యుం బ్రార్థించి ప్రాణవల్లభు నుల్లంబునం జేర్చియుండుటయు నవ్వాలుఁ గంటం గనుంగొని మహీపాలుండు తదీయధైర్యవివేకంబులకు మనంబున విస్మయంబును బొంది సకలజగదాశ్చర్యంబుగా నిశ్చలత్వంబును గదిసి సింధువేలావలయితవసుంధరాభారభరణసామర్థ్యంబున నొప్పు వామేతరభుజాదండంబున

బ్రిచండదిపుశరఖండనోగ్రం బగుమండలాగ్రం బమర్చి చంద్రమతికంఠభాగంబునం
గదియించి యున్న సమయంబున. 151

తే. భానుబింబసముజ్జ్వలప్రభలు పర్వ,గదిసి గ్రక్కున నెడఁ జొచ్చి గాధిపట్టి
చేతిఖడ్గంబు పట్టి ధాత్రీశలేశు, బలికె రోషాతిరేకసంభాషణముల. 152

ఉ. చాలు బురే నరేశ్వర ప్రచండతరం బగునిట్టిసాహసం
బేల యొనర్చె దీవు, నిను వీక్షణసేయఁగఁ బాతకంబు చం
డాలున కైనఁ గొంత కరుణారస ముబ్బు మనంబులోన నీ
బాలికఁ జూచినం గినిసి పాయకఁ జంపుతలంపు పుట్టునే. 153

క. దానవుఁడవు గా కరయగ, మానవుఁడవె నీవు నిన్ను మగువలఁ జంపం
గా నియమించె నె మీగురు, వైనవసిష్ఠుండు కడుదురాత్ముఁడ వెందుఁన్. 154

క. బలవద్దర్వితవైరుల, గళములు దునుమంగ శక్తిగలనీఖడ్గం
బెలతీగబోఁడులను బ్రిట్టులుక వధింపంగఁ దొడఁగె హా యిటు దగునే. 155

తే. సరవి ధర్మార్థకామమోక్షములు నాల్గు, నీకు నొసఁగంగఁ జాలు వర్ణితచరిత్ర
నీపురంధ్రీశిరోమణి నెట్లు చంపఁ, బూనినాఁడవు నీబుద్ధిపోఁడి మిదియొ. 156

ఉ. పావనమై నుతింపఁ దగుభానుకులంబున నుద్భవించి ధా
త్రీవర వర్తనం బుడిగి దీనగతిన్ వెలివాడవానికిన్
సేవ యొనర్చి పౌత్రతవనసీమ వసించుట నీకు ధర్మమే
భావములోఁ దలంచిన నపాత్రము నీదుచరిత్ర మెంతయున్. 156

చ. కులసతిఁ గూర్రఖడ్గహతిఁ గూలిచి పొందెదుసౌఖ్య మెల్ల ని
ష్ఫలము దలంచి చూడ నరపాలక భార్యకునైమహోగ్రతం
దొలఁగక దక్షునిం గినుకతో వధియించినశూలపాణికిన్
వెలయఁగ నీకుఁ గల్గినవివేకము బుద్ధియు లేక యుండెనే. 157

ఉ. కావున నిట్టియుగ్రతరకర్మము సాహసవృత్తిఁ జేయ ధా
త్రీవర నీతి గాదు భవదీయవివేకవిశేష మిట్టిదే
భూవలయంబులోన నినుఁ బుణ్యచరిత్రుఁడ వంచు బూని నా
నావనినాథపుంగవసభాంతరసూరిజను ల్నుతింపఁగన్. 159

మత్తకోకిల. నాకుమారికలం దిలోకజనస్తుతోజ్జ్వలరూపరే
ఖాకళానిధులైనయంత్యజ కన్యల న్వరియించినన్
నీకుమారునిప్రాణము ల్మఱి నీసముజ్జ్వలరాజ్యము
న్నీకులాంగనతోడిపొందును నీకు నిప్పుడ కల్గెడిన్. 160

వ. అని బహువిధంబులం బోధించు నగ్గాధినందనుం గనుంగొని యమ్మానవాధీశ్వరుండు
దరహసితాననుండై. 161

క. ఓ ఋషినాయక యీసం,సారపయోరాశితీరసంప్రాప్తునిగాఁ
జేరిచి యీకాశీపురి, గౌరీపతి నన్నుఁ బ్రోవఁ గరుణ దలంచెన్. 162

చ. ఇతరునిఁ బోలె బల్మఱు మునీశ్వర నన్భ్రమియింప నేల యీ
గతి బహుభంగులం గమలగర్భున కైనను బూని నిల్పి స
మ్మతి భయ మేది మీ కెదిరి మార్వలుకంగ దరంబు గాదు దు
ష్కృతనిబిడాంధకారసరసీరుహబాంధవ నాకు శక్యమే. 163

క. అనఘాత్మ మీరు మును నుడి, విన బుద్ధులె కాక నేఁడు వింతలు వివరిం
చిన నిందులోన లే విక, జను డేమియు బలుక వలదు సారెకు నన్నున్. 164

తే. పలుమఱును మీకు నిన్ని చెప్పంగ నేల, చేతిఖడ్గంబు విడువ కౌశికమునీంద్ర
యిట్టికతి నుండ జనదు మీ కిచట నిట్లు, వేగ విచ్చేయు డిది నాదువిన్నపంబు.

వ. అనుటయు నాహరిశ్చంద్ర నరేంద్రుని నిత్యసత్యప్రభావంబునకు నత్యాశ్చర్యంబును
బొంది మృషావాదిం జేయుదు నను తలంపును దిగించి విశ్వామిత్రుండు తపోవనంబు
నకుం జనియె నప్పు డంబరంబునం బ్రమోదంబునం జెలంగి నిజాంగనాసమేత ఖేచర
వారితంబు లసమానంబు లగు విమానంబు లెక్కి క్రిక్కిఱిసి విస్మయంబు పొదువం
గనుగొనుచుండ నఖండసాహసంబున నమ్మహీమండలేశ్వరుం డాఖండలకరవజ్ర
ప్రచండం బగుకరవాలంబున నారోలంబవేణి కంఠనాళంబు వ్రేయుటయు నవ్వేటు
ప్రసూనదామకంబుగతి నభిరామం బగుచు బురంధ్రీశిరోమణిగళంబునం గీలుకొనిన
శిరఃకంపంబు జేసి మహీవల్లభుండు. 166

క. కలహంసగమన త్రెవ్వని, గళము నిరీక్షించి వివిధగర్వితరిపుభూ
తలపతుల మెడలు దునుమం, గలకరఖడ్గంబు చూచి కడువిస్మితుడై. 167

తే. దారి తప్పెనో నాటి యీతమ్మికంటి, శిల మెట్టెనో కాక కౌశికమునీంద్రు
జాలమో మద్భుజాశక్తి దూలి చనెనో, పొంగి యిఁకొక్కమాటు వ్రేయఁగవలయు.

క. అనిపోవఁగ వచ్చునె నా, యసి పోవక యంచుమిగుల నాగ్రహలీలం
గొసరక మఱియును హుమ్మని, యసమగతిం బూని వ్రేయు నాసమయమునన్.

శా. పక్షీంద్రధ్వజపద్మజప్రముఖు లాబర్హిర్ముఖుల్ గొల్వఁగా
నుక్షాధీశ్వరు నెక్కి శైలతనయాయుక్తంబుగా భక్తసం
రక్షాదక్షుఁడు విశ్వనాథుడు సువర్ణగ్రావకోదండి సా
క్షాత్కారముఁ బొందె సత్కృప హరిశ్చంద్రక్షమాభర్తకున్. 170

సీ. ఆకాశగంగతో నమృతాంశురేఖతోఁ, బల్లవారుణజటాభరముతోడ
ఫాలలోచనముతోఁ ఫణికుండలములతోఁ, గాలకూటవినీలగళముతోడ
హరిణడింభంబుతో నజగవధనువుతోఁ, డమరుశాతత్రిశూలములతోడ
నజశిరోమాలికాగజచర్మములతోడ, భసితాంగరాగవిభ్రమముతోడ
గీ. సౌరభోజ్జ్వలపుష్పవర్షంబుతోడ, దివిజసందోహరణితవాదిత్రశబ్ద
సహితనారదవల్లకీస్వనముతోడ, శివుఁడు గిరిరాజకన్యకాధవుఁడు పొలిచె. 171

వ. ఇవ్విధంబున జంద్రశేఖరుండు ప్రత్యక్షంబగుటయు నవ్వసుంధరాధ్యక్షుం డత్యంత భక్తితాత్పర్యంబును సంభ్రమంబును బ్రియంబును భయంబును వినయంబును విస్మయంబును నయంబును నుల్లంబున నొక్కమొగిం బిక్కటిల్ల దేహంబునం బులకాంకురసమూహంబు లసమానంబులై జనియింప నానందబాష్పబిందుబృందంబులు నయనారవిందంబులం దొరుగ సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి నిలిచి ముకుళితకరకమలుండై. 172

సీ. జయ పార్వతీమనోజలజాతమార్తాండ, జయ రసాతలవిభూషణకరండ
జయ గజాసురగర్వజలదజగత్ప్రాణ, జయ భక్తలోకరక్షాధురీణ
జయ ఫాలలోచనజ్వలనజితానంగ, జయ పాణిసంభృతోజ్జ్వలకురంగ
జయ వియద్వాహినీశశికళాకోటీర, జయ కుందచందనసమశరీర
గీ. జయ రమాధీశభారతీప్రియపురంద, రాజగీర్వాణమకుటవిన్యస్తరత్న
పటలశోభావిభాసితపాదపద్మ, జయ మనోహరకలధౌతశైలసదన. 173

క. అని బహువిధముల నుతి, వినుతించుచు నున్నభూమివిభు జూచి కృపా
వనరాశి భక్తజనతతి, జననాయి మహానురాగభరితాత్ముండై. 174

ఉ. భూపకులాగ్రగణ్య విను బోలఁగ నృపాలుఁడు లేఁడు చూడఁగా
నీపమునన్ద్రిలోకముల నెంతయు మేలు నితాంతసూనృతా
లాపవివేకధైర్యగుణలక్షణసాహసవైభవశ్రియా
దీపిత మయ్యె నీనడత దివ్యమునీశ్వరవర్ణనీయమై. 175

క. అప్పముగ మాకు మెచ్చులు, మెచ్చితి జిత్తమున గరుణ మిక్కుటము మయ్యోజా
నిచ్చలముల నడుగుము నీ, కిచ్చెద వలసినవరంబు లెయ్యవి యైనన్. 176

తే. అనుచు దాయంగ నమ్మౌని యాదరించి, మృదులకరపంకజంబున మేను నిమిరి
గౌరవం బొప్ప దాపలికంటిచూపు, పరగ నిగిడించుటయు మహీపాలవరుఁడు. 177

వ. లజ్జావనతవదనుండై యేమియుం బలుకనేరకూరకున్నం దదీయమనోభావం బెఱింగి మనసిజారాతి చెలవి బాటగ నవ్వి యిట్లనియె. 178

చ. దలముగ మేన నెల్ల భసితం బెసలార నలంది చర్మ మి
మ్ముల మొల గట్టి భూతగణము ల్భజియింపగ నప్పరేతభూ
ముల వసియించినట్టి నను బోలినవాడవు నీవు నీకు నో
నలినహితాన్వయాభరణ నాన వహింపగ నేటి కిమ్మెయిన్. 179

మ. ఇది గాధేయుమహేంద్రజాలము ధరిత్రీశా సమస్తంబు స
మ్మద మొప్ప న్వినిపించెద న్వినుము యుష్మత్సూనృతాలాపసం
పద యెల్లం దెలియంగ గోరి చలముం బంతంబు రెట్టింప ని
ట్టిదళం గుందగ జేసె మౌని తనకౌటిల్యంబు పాటిల్లగన్. 180

సీ. ఇది ప్రేతభూమి గా దినకులేశ్వర పావ, నం బగుయజ్ఞవాటంబు గాని
యస్థిపోత్రులును గా వమితసూనృతవచ, స్స్వభాగ్యబహుసమిత్సమితి గాని
ఘనకపాలములు గా వనవద్యసాహస, విమలోపకరణపాత్రములు గాని
రక్తపూరము గాదు రాజన్యలోకైక, నాథహయ్యంగవీనంబు గాని

గీ. కడిదికొఱ్ఱులు గావు సగరజయాంక, పాదుకొల్పినభూరియూపములు గాని
చికురజాలంబుగాదు శిక్షితసమస్త, విమతనరపాల నవకుశవితతి గాని. 181

క. ఓలి నిను భృత్యునింగా, నేలినయవ్వీరబాహు డిలలోపల జం
డాలుడు గాడు కృతాంతుడు, నాళీకహితాన్వయాబ్ధినక్షత్రేశా. 182

క. నీసతి బిలిచి తలంకక, దాసింగా నేలునతడు తర్కింపంగా
భూసురుడు గాడు మాయా, వేసపు గలిరాజు గాని విమలచరిత్రా. 183

తే. నీకు డెందంబులోన సందేహ మేల, చేరి విశ్వాస మొదవ వీక్షింపు మనుచు
శుద్ధమతి దివ్యదృష్టి యిచ్చుటయు సర్వ, మునుగనుంగొని తెలిసంది మనుజవిభుడు.

వ. ఆనందకందళితహృదయారవిందుండై చంద్రమతియును దాను నమ్మందాకినీమౌళికి
బునః ప్రణామం బాచరించి వినయవినమితోత్తమాంగుండై. 185

ఉ. శ్రీనగజేశ మీకరుణ జేసి మదీయము లైనయట్టియ
జ్ఞానమయాంధకారములు సర్వము నాకు దొలంగి పోయె సు
జ్ఞానదివాకరోదయము చాలగ సొంపు వహించె నీభవాం
భోనిధి నేటితోడ నను బూని తరింపగ జేయుడీ దయన్. 186

క. మీ పదపంకజసేవా, నైపుణమానసుని జేసి నను సత్కరుణం
జేపట్టి ప్రోవు భూధర, చాప జగద్ధరితరూప చంద్రకళాపా. 187

తే. నిన్ను హృదయాంబుజంబున నిండ వేడ్కఁ, గొలుచు సద్భక్తి నిల్పఁ గల్గుటయె దక్క
వరము లొండు దేవ్వియు నొల్ల వరమునీంద్ర, సముదయార్చిత నీదుపాదములయాన.

వ. అని పలుక నప్పు డమ్మహాదేవువామాంగంబున నున్న సర్వమంగళ చంద్రమతిం గనుం
గొని. 189

ఉ. ఓపికవాణి నీకుఁ గలయోపిక వాణికి లేదు వార్ధి వే
లాపరివేష్టితక్షితితలంబున నీసరి లేరు భామినుల్
నీపతిభక్తియు క్తియును నీమతిశుద్ధియు నీవివేకవా
ఙ్నైపుణము ల్భుజంగకులనాథున కైన నుతింప శక్యమే. 190

క. గళమున నొప్పెడు నీమం, గళసూత్రము పెంపె గాదె గణుతింపఁగ బె
క్కులు భయదోపద్రవములు, దొలఁగించె భవత్ప్రియునకుఁ దోయజగంధీ. 191

మ. చిరకాలంబు సమగ్రరాజ్యవిభవశ్రీఁ జెంది వర్ధిల్లి యీ
ధరణీమండల మేలు నీదుప్రియభర్తం గూడి యేతెంచి సుం
దరి మాయొద్దనె యుండు మంతయు గృతార్థత్వంబుమై నిప్పు డే
వర మైనం దగ వేఁడు మిచ్చెద గడు న్వాత్సల్య మొప్పంగఁగన్. 192

వ. అనుటయుం జంద్రమతి యగ్గిరీంద్రనందనచరణారవిందంబులకుం బ్రణమిల్లి యో
తల్లీ యిప్పటి ఖేదనం బేలు మహీవల్లభకుమారుని సజీవునిం జేసి నాకుం బ్రాపించిన
నింద తొలంగం జేయు మనిన నమందసంతోషితస్వాంతయై యమ్మహీపాలబాలకుం
డింతకుమున్న బ్రతుకు భవత్తనూజుప్రాణంబు లిచ్చితి బరమహర్షంబునం బొందు
మను సమయంబున. 193

చ. పొలుపుగ నిద్ర మేల్కనినపోలిక నల్లన లేచి వచ్చె గో
మలపదపద్మసంఘటితమంజులనూపురకింకిణీరవం
బులు గడుఁ బర్వ లేనగవు ముద్దులచెక్కుల దొంగిలింప ను
జ్జ్వలమతి లోహితాస్యుడు నిశాకరతుల్యుడు సంభ్రమంబునన్. 194

తే. ఇట్లు వచ్చిననందను నెలమి దొలక, జంద్రమతి చూచి యానందజనితబాష్ప
కణము లుప్పొంగ నక్కున గదియ నొత్తి, యమరఁ గౌఁగిటఁ జేర్చి ముద్దాడుచుండె.

క. ఆవేళ గౌశికుడు ల, జ్జావనతశిరస్కుఁ డగుచు సాగ్రహ మెల్లం
బోవంగ విడిచి యతిదైన్యావహముగ జింతనొంది యద్భుత మడరన్. 196

క. చిరకాలార్జిత మగుమ, త్పరమతపోధనము గంటి వడి కడు దటిగా
దురహంకృతి నే బలికిన, నిరుపమఘోరప్రతిజ్ఞ నెపమున నకటా. 197

ఉ. శాకవిరోధి యేమిటికి బ్రిక్ష్ణ మొనర్చె సమస్తతాపసా
నీకము నూరకుండ నతినిర్భరగర్వము పూని భేల్పనై
తోకొని యశ్వసిష్ఠమునితోడుత నేటికి నాగ్రహించితిన్
నాదు వివేకహీనత మనంబున నేటికి బుట్టెనయ్యెడన్. 198

ఆ. కమలభవునితోడ గర్వించి ప్రతిస్సృష్టి: జేయ జాలికట్టినాయ శేష
మతివిశేష మెల్ల మందీభవింపంగ, బట్టిజగడ మేల పెట్టుకొంటి. 199

వ. అని పశ్చాత్తాపంబును బొందుచు నమ్మనుజపతింగదిసి నిల్చి యమ్మునివల్లభుండు కృత
నమస్కారుం డగుమహీరమణుం గనుంగొని రారమ్మని యాలింగనాదిసంభావనం
బుల మనం బలవరించి యి ట్లనియె. 200

క. మిగుల బ్రియాసము నొందితి, వగణితసూనృతవచస్సుయంచిత నీధై
ర్యగుణప్రాగల్భ్యంబులు, జగదాశ్చర్యంబు లార్యసంస్తుత్యంబుల్. 201

తే. నిత్యమైయొప్పు భవదీయసత్యమహిమ, దెలియగోరి మనంబున దలక కేను
వితతకపటక్రియావృత్తి సతిని నిన్ను, బాధ నొందించి కడు నపరాధి నైతి. 202

క. క్షమియింపుము నాయపరా, ధము లన్నియు దయ దలిర్ప దావకసామ్రా
జ్యము గైకొని యేలుము పూ, జ్యముగా నిక బ్రోవు భూప్రజల సిరి దొలకన్.

చ. అన విని నవ్వి యాకరణి నానతి యియ్యకు నీవు వాడియే
మునికులచంద్ర మీరు జగము ల్గొనియాడగ నొండువారు మీ
కును నపరాధము ల్గలవె కోరిక లీరిక లెత్త మీకతం
బున గడు మించె నాయశము పొందుగ నెల్లెడ నేటితోడుతన్. 204

క. నామనవి యొకటి వినుమిక, నోమునికులతిలక మఱచియును రాజ్యము న
న్నే మఱి మగుడగ గొను మని, యేమియు బలుకకుము నాకు నింతియచాలున్.

ఆ. హీనమతి స్వదత్త మైనను బరదత్త, మైన మల్లు మోపునంతమేర
భూమి యపహరించి పోవంగ దొర్చిన, యతడు నరకగామి యండ్రు బుధులు.

శా. నీకిష్టం డగుపార్థివేశ్వరునిచే నిత్యప్రసన్నుండవై
యేకచ్ఛత్రము గాగ నీక్షితితలం బేలించి పాలింపు మ
స్తోకప్రాభవలీల నేలుము జయశ్రోణీతలేశం దరి
త్సోమ్కాంతధ్వజినీవనీచయమహాదావానలస్ఫూర్తివై. 207

ఉ. నావుడు లెస్స యయ్యె నరనాథశిరోమణి యట్ల చేయుదున్
నీకు మదిష్టభూపతివి నిన్ను బ్రియంబున నిల్పెద న్ధరి

త్రిశలయంబు సర్వమును దేజము పర్వఁగ నేలుచుండుమీ
నావచనం బమోఘము మనంబున సంశయ మింక నేటికిన్. 208

తే. ఇందు కోడఁబడ కుంటివే నృపవరేణ్య, యూని బొంకితి నని పొమ్ము పోవ కున్న
నరసి నే నెట్లు చెప్పితి నట్ల చేసి, కీర్తిఁ బొందుము సత్యవిస్ఫూర్తి మెఱయ. 209

క. మును దేవసభామధ్యం, బున నాచేసినప్రతిజ్ఞ భూవర తప్పం
జనునె ప్రతిజ్ఞాభంగం, బునకంటెను దురిత మెద్ది బుద్ధిఁ దలంపన్. 210

చ. నలినమహాత్మ్యలీన పదునాల్గుమహాయుగము ల్వసుంధరా
స్థలికి నధీశుగా నిను ముదంబున నిల్పెద నంచుఁ బూని నేఁ
బలికినవాఁడ నాప్రతిన ప్రాప్తి వహింపఁగ నంతకాలమున్
జలధిపరీతభూతలము సర్వము నేలు ప్రజానురాగివై. 211

క. మరి మీఁదఁ బాకశాసను, సరిగద్దియ నొగిఁ జతుర్దశ మహామన్వం
తరములు నిలిపెద ననుచుం, దిరముగ నేఁ బల్కినాఁడఁ ద్రిదశులు వినఁగన్.

క. అందాక నుండు మధిపా, నందంబును బొంది నీవు నాకంబున సం
క్రందనుమాఱటగద్దియ, నిందుకళాధరుని యాన యిఁక నేమనినన్. 213

ఆ. అనిన నొండు పలుక నాత్మలోఁ శంకించి 'యినకులాధినాథుఁ డేమి యనఁగ
నేమి యగునో యనుచు నెంతయుఁ జింతించు, చున్న యంత శిష్యులోలిఁ గొలువ.

ఉ. తోయజగర్భసన్నిభుఁడు దుష్కృతపర్వతవజ్రపాణి యా
మ్నాయరహస్యవేది యసమానతపోవిభవప్రభావధా
రేయుఁడు శైవమార్గచరిత్రుఁడు పాత్రు డరుంధతీసతీ
నాయకు డవ్వసిష్ఠమునినాథుఁడు వేడుక వచ్చె జెచ్చెరన్. 215

గీ. వచ్చి రాజీవబాంధవవంశతిలకు, నెదుర నిలుచుటయును జూచి హృదయ మలర
మ్రొక్కి యిట్లని పలికె నోమునివరేణ్య, మిగుల బుణ్యుండనైతి నే మీకతమున.

చ. పరుసముతోడ మోపి సులభంబుగ లోహముఁ గాంచనంబుగాఁ
బరువడిఁ జేసినట్లు నిరపాయతపోమహిమానుభావబం
ధురుఁ డగుగాధినందనునితోడుత నన్నొఱయించి సత్యసు
స్థిరతరకీర్తిమంతునిగ నేసితి రెంతయు సత్కృపారతిన్. 217

క. భూతలనాథులలోపల, నాతత మగుకీర్తి నేఁ గృతార్థుఁడ నైతిన్
మీతలఁపానతి యిం డిక, నేతెఱగున నడతు నుచిత మెయ్యది యనినన్. 218

ఉ. శ్రీకరసత్యవైభవవశీకృతచంద్రకళావతంస యి
క్ష్వాకులకీర్తి నీకతన వన్నియ మించె ధరిత్రిమీఁద నా

శ్లోకుఁడ వీవు నీకుఁ గలసూనృతధైర్యవివేకదానరే
ఖాకలితప్రతాపములు గన్గొన నెవ్వరియందు నెచ్చటన్. 219

క. అనఘాత్మ నాపురోహితుఁ డని యెంతయు నాదరించి యరుదుగ నాచే
సినప్రతిన దప్పకుండఁగ, నను రక్షించితివి త్రిభువనంబు లెఱుంగన్. 220

క. నావుడు గురువాక్యంబులు, ద్రోవక గాధేయునాజ్ఞ తోరపుభక్తిన్
గావింప ననుమతించె న, హీవల్లభుఁ డంత నిర్జరేంద్రుఁడు కడఁకన్. 221

సీ. సురనారి పసుపున మణికుంభముల నియ్య, సన్నదివారిఁ దెప్పించి నరవరేణ్యు
జానొందఁ మంగళస్నానంబు చేయించి, వరవస్త్రబహువిధాభరణగంధ
మాల్యాదివస్తు సామగ్రిచే నెంతయు, శ్రీలు మీఱఁగ నలంకృతు నొనర్చి
చంద్రకాంతశిలావిశాలవితర్దికో, పరిభాగమునఁ జాల బ్రభుత మీఱ

గీ. మేరుశిఖరంబులతోడఁ దుల వేల మాను, భద్రసింహాసనంబునఁ బరఁగ నునిచి
యగ్రజన్ముల నుచితదానాదివిధుల, బ్రీతచిత్తుల గావించి ప్రియము వెలయ. 222

వ. ఇందుశేఖరకృపావిశేషంబున నిఖిలవిశ్వంభరామండలంబు సమస్తంబును మానంబున
నేలు మని సమగ్రసైన్యంబున బట్టంబు గట్టె నాసమయంబునం గమలాసనాది
గీర్వాణులు వసిష్ఠవిశ్వామిత్రాదిసంయమిజనంబులు ననేకప్రకారంబుల నాశీర్వ
దించి మంత్రాక్షతంబు లిడి రప్పుడు. 223

సీ. దివి నాదితేయవాదిత్రము ల్ఘోషించెఁ, గురిసెను గుప్పగా విరులవాన
గంధర్వకామినీగానము ల్వెలసిల్లె, నప్సరస్త్రీలనాట్యములు చెలఁగె
నత్యంతసౌరభశైత్యమాంద్యంబుల, మలయానిలము వీచెఁ గలయ దిశల
దహనుఁ డొప్పారె బ్రదక్షిణార్చులచేత నినచంద్రదీధితు లేపు చూపె

గీ. భుజగవంశాధినాథదిగ్గజవరాహ, కూర్మకులపర్వతంబులు కుతలభార
మెడల విశ్రాంతి వహియించె నెలమి దొలక, సకలజీవులు పొదలిరి సమ్మదముల.

వ. తదనంతరంబ. 225

తే. చంద్రశేఖరుఁ డాహరిశ్చంద్రు జూచి, యీవు సాకేతపురమున కేగుమనుచు
హరివిరించిపురందరాద్యమరవరులుఁ, గొలువ వేంచేసె గైలాసవసుధరమునకు. 226

క. అంతట దద్వృత్తాంతం, బంతయు నారదునివలన నమరఁగ విని య
త్యంతప్రమోదభరిత, స్వాంతుండై సత్యకీర్తి సంభ్రమ మొప్పన్. 227

క. క్ష్మాకాంతమౌళిరత్నము, రాక పురిం జాటఁ బంచె రయమునఁ దద్వా
ర్తాకర్ణనసంజనితప్ర, హాకౌతుకముల జెలంగి యప్పుడ పౌరుల్. 228

వ. బహుప్రాకారంబుల నత్యంత రమ్యంబుగా బురం బలంకరించి రాసమయంబున నపరి మితకరిహయరథపదాతి సమేతుండై మంగళతూర్యరవంబులు చెలంగ సుప్రాంగి సముగ్రవైభవంబున. 229

ఉ. ప్రన్నమనాటి రేయి పరిపూర్ణసుధాకరురాక గాంచి సం
పన్నకుతూహలస్ఫురణ పర్వగ నంబుధిరాజు దా నెదు
ర్కొన్నవిధంబున న్నృపశిరోమణిరాకకు సత్యకీర్తి య
త్యున్నతభక్తియుక్తి చెలం గొంద నెదుర్కొనిసం బ్రియంబునన్. 230

తే. ఎదురుకొని సంభ్రమంబున నినకులేశు, నంఘ్రిపంకజములకు సాష్టాంగ మెఱగి
కేలుదమ్ములు శిరసుపైఁ గీలుకొలిపి, పలికె నిట్లని వినయసంభావణముల. 231

ఉ. సాంద్రయశోరమావిభవ సత్యవచోమణిహార రోహహరి
శ్చంద్రనరేంద్ర వంశవనచైత్ర యమిత్రజయప్రతాపని
స్తంద్ర పురందరాదివిబుధవ్రజరంజితపట్టభద్ర భో
గీంద్రున కైన శక్య మగునే నుతియింప భవత్ప్రభావముల్. 232

మ. అనఘుం డైనవసిష్ఠుతో నొఱసి లోకాశ్చర్యధుర్యంబుగాఁ
దనయత్నీణతపోవిశేషగరిమ న్దర్పించి బ్రహ్మర్షియై
వినుతిం జొందినవేదమూర్తి త్రిజగద్విఖ్యాతుఁ డగ్గాధినం
దను డెంతే వెఱఁ గంద నిల్పితివి నిత్యం బైనసత్యం బిలన్. 233

తే. మహిమతో నింకఁబూజ్యసామ్రాజ్యలక్ష్మి, వెలయఁ గైకొని భూప్రజావితతిబ్రోవ
వేఁ విచ్చేయుఁ డని విన్నవించుటయును, హర్ష మొదవంగదరహసితాస్యుఁడగుచు.

చ. సముచితవాగ్విశేషముల సంతస మొందగ సత్యకీర్తిను
త్తమసచివాగ్రిణి న్నిజహితస్థిరకార్యరహస్యవేదిను
ర్విమతసమూహహరణవిక్రమునిం దగ నాదరించి ర
త్నమయవినూత్నకాంచనరథంబు ముదంబున నెక్కె నన్నతిన్. 235

సీ. అమలంబు లగుచతురంగబలంబులు, గడిమి దీపించి నల్గడల గొలువ
హృద్యంబులై బహువాదనరవంబులు, మ్రోయ మాగధగానములు చెలంగ
కరకంకణఝణత్కారము ల్చెలరేగ, రమణులు వింజామరములు వీవ
గీ. గలికికన్నులవారకాంతలు పసిండి, పళ్ళెరంబుల రత్నదీపములు నించి
నిండువేడ్క నివాళింప నిజపురంబు, మంచిశుభలగ్నమునఁ బ్రవేశించెన్నృపతి. 236

వ. ఇవ్విధంబునం బురంబుం బ్రవేశించి రాజమార్గంబునం జనుదెంచునప్పుడు. 237

సీ. అరవిందనాభుఁ డీయవనీతలేశ్వరుఁ, డిందిర యీశరదిందువదన
పాకశాసను డీదివాకరాన్వయభర్త, పౌలోమి యీపురంధ్రిలలామ
నీహారకిరణుఁ డీనిత్యసత్యధనుండు, రోహిణి యీపంకరుహదళాక్షి
ప్రసవకోదండు డీరాజదేవేంద్రుండు, రతిదేవి యీలోకనుతచరిత్ర

గీ. యని హరిశ్చంద్రసార్వభౌమాగ్రకన్యఁ, జంద్రమతిఁ జూచి యానందజలధిఁ దేలి
పౌరజనబృందములు సుధాసారమధుర, చిత్రవాగ్వైఖరుల బ్రశంసించి రెలమి.

వ. ఇవ్విధంబునం బౌరజననికాయసంస్తూయమానుండై హరిశ్చంద్రుండు మహానందంబును బొంది నిజమందిరంబు దఱిసి సముచితవర్తనంబునం బ్రవర్తించుచు నయమార్గంబునం బ్రజాపరిపాలనాశీలుండై పూజ్యంబగురాజ్యంబు సేయుచుండెనని- 239.

క. మునిపతిమార్కండేయుం, డనఘుండు యుధిష్ఠిరునకు ననురాగమునన్
వినిపించె హరిశ్చంద్రా, వనినాథుకథాక్రమం బవార్యప్రౌఢిన్. 240

శా. వాగ్భంగీద్రసుపర్వసింధుశరద్వార్వాహతారాసుధా
రుగ్భ్రాజచ్చలచాపగోపగరుడత్రోటిచ్ఛటామల్లికా
స్రగ్భ్రావిభ్రమశుభ్రకీర్తిరుచిహారశ్రేణికావిస్ఫుర
ద్దిగ్భామాకుచమండలాగ్ర వివిధార్థివ్రాతచింతామణీ. 241

క. అలఘుప్రతాపతపనస, మలకేంద్రకృపాసమగ్రమహిమాన్విత శో
రొల్లలనిగ్రామనికేతన, జలసీమారత్నైకచాతుర్యనిధీ. 242

ఉత్సాహ. రాట్సభాంతకాళిధీధురంధరప్రశస్తప్రా-
వృట్సమాగమాంబుభృన్నవీనదాన గర్విత
ద్విట్సమాజదంతిసింహ ధీరతామరాచలా
మట్సహస్రవంశదుగ్ధసాగరతుషాధిపా. 243

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకలసుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమారవినయవివేక విద్యాలంకారశంకరకవినామధేయప్రణీతం బయినహరిశ్చంద్రోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు సర్వంబును

బంచమాశ్వాసము.

# దండకరత్నములు

ఆంజనేయదండకము, సూర్యనారాయణదండకము, నూకాలమ్మదండకము, సోమాలమ్మదండకము, గంగాలమ్మదండకము, మహాశక్తిదండకము యీ మొదలగు యిరువది దండకములు హిందూదేశములో తరుచుగా వ్యాపించెనీ మనవారిలో నుపయోగించుటకు మహాశక్తిదండకము మొదలగునవి పనికివచ్చును. వెల 0—6—0



## హాస్యపుపాటలు

...నికి పనికిరాని యింజెరింపాట, లంకణాలు చేయుచున్న రాధారిబోటు పాట, గుమ్మగు బల్ ముస్తాలగుమ్మసుస్తాలపాట, వస్తాదులకైనను మొత్తరాని బస్తాలమోత, తమాషాకు తమాషాపాట, అచ్చటచ్చట కొట్టుముచ్చట్లు, రండలందరిలో నీముండపాట, చిత్రమగు విచిత్రవివాహము, బంగారు లేకుండా కడ్లుపోవుటకుక్రొత్త మొక్కుబడులు, లౌకికమెరుగని వైదికసరసము, చంచలమగుదాంపత్యపుపాట జగమంతయువ్యాపించినసిరిసిరిమువ్వపాట, వలదన్ననుయొసగేవల్లమాలిన కల్లబహుమతులు, వావివరుసలేని జోలపాట, బత్తెములేని ముత్తిపాట, బాలుల తమాషాకుబండిపాట, చిత్తకార్తిలోగత్తరిలేకుండానే జరిగే గోంగూరపాట, మెల్లరనేడ్పించు కల్లుపాట, కుండపాట, నారాయణమ్మ, నాయుడుబావపాట, యిల్లెల్లగుల్లజేసి కల్లనిపించు జూదమ్ము పొడుముకాయ, చేతగానినామగడ వేరుబడదామురాపాట, నిరసన... వముగలిగించు వల్లమాలిన సరసముతో 16 పాటలుగలవు గ్రామఫోను వరుసలతో నూతనముగా తయారు కాబడినవి. వెల 0—6—0

---

కొండపల్లి వీరవెంకయ్య, బుక్సెల్లరు, రాజమండ్రి.